# భారతదేశ ఔషధాలు

# హోమియో వైద్య విధానం

*INDIAN DRUGS*
*AND*
*HOMOEO MEDICAL SYSTEM*

మెటీరియ మెడిక, చికిత్స,
రోగి లక్షణాలకు మందులు
సూచించడం జరిగింది.

-: రచన: -

**డాక్టర్ ఎన్. అశ్వర్థరెడ్డి**

రిజిష్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్

# భారతదేశ ఔషధాలు

# హోమియో వైద్యవిధానం

రచన

డాక్టర్ ఎన్. అశ్వర్థరెడ్డి
రిజిష్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్

ప్రతులకు
సర్వోదయ హోమియో వైద్యశాల
17-154, వన్‌వే ట్రాఫిక్ రోడ్డు,
నీరుగంటి వీధి, పాత ఊరు,
అనంతపురం - 515 005 (ఏ.పి.)

# విషయసూచిక


ముందుమాట VIII

శక్తి X

1. అబ్రోమ అగస్ట 3
2. ఎబ్రోమ రాడిక్స్ 5
3. ఎకలైఫ్ ఇండిక 5
4. ఈగల్ పోలియా 5
5. ఈగిల్‌మార్మెలోస్ 6
6. టెర్మినాలియా అర్జున 6
7. జనోసియా అశోక 7
8. ఎటిస్ట ఇండిక 8
9. ఎటిస్ట రాడిక్స్ 9
10. అసాయ్ 9
11. అజాడిరెక్టా ఇండిక 11
12. బ్లాట ఒరియంటాలిస్ 11
13. యెంబిలియార్రైబ్సు 11
14. ఎక్రైరాన్తెస్ ఎస్పెరిలిస్ 11
15. ఎవెన సతివా 12
16. బ్లుమెయా ఒడొరాట 12
17. బొరావియా డిప్యూస 13
18. బొరావియా రిపెన్స్ 13
19. సిసాల్‌పెనియా బాండుసెలా క్వినియా ఇండిక 12
20. జెంటియాన చిరాట (చిరాట) 14
21. కలోట్రోపిస్ బ్రెగాంటియా 15
22. కలోట్రోపిసు లాక్టం 16
23. కారికపాపయ 16
24. క్లెరొడెండ్రాన్ ఇన్‌ఫార్చునేటం 16
25. సెఫలాండ్ర ఇండిక 16
26. కొలియస్ అరోమాటికస్ 17
27. కొలియస్ మాలావారికస్ 17
28. సైనొడాన్ డక్టైలాన్ 17

29. డెస్మోడియం గాంజెటికం 18
30. ఫికస్ రిలిజియోస 18
31. ఫికస్ ఇండిక 19
32. జినోకార్డియా ఒడొరాటా (చాల్మోంగ్రా) 19
33. హెమిడెస్మస్ ఇండిక 19
34. హైడ్రోకొటైల్ ఏసియాటిక 20
35. హైగ్రోఫైలా స్పైనోస 21
36. హోలారెన ఏంటి డిసెంటిరిక 21
37. జస్టిసియా అధాటొడ వాసక 21
38. జస్టిసియారుబ్రం 22
39. కాల్మెఘ్ ఎండ్రొగ్రాఫిస్ పనికులాట 22
40. లూఫా బిండాల్ 23
41. లూఫా అమారా 23
42. ల్యూకస్ ఎస్పెర 23
43. మకరధ్వజ 24
44. మెనిస్పెర్మం 24
45. మొమోర్డికచెరన్షియా 24
46. నిక్టాంతెస్ అర్బోర్ ట్రియోటిస్ 24
47. సిజిజియం జాంబొలనం 25
48. సొలానంజాంతో కార్పమ్ 25
49. ఒల్డెన్ లాండియా హెర్బాసియా 26
50. నేత్రం మూర్బిట్ 26
51. ఎన్డెర్సోనియా రోహితక 26
52. ఒసిమమ్ సాన్క్టం 27
53. ఒసిమం గ్రాటిస్సియం 29
54. ఒసిమం కారియోఫైల్లాటం 29
55. టినొస్పొరకార్డిఫోలియా 29
56. ట్రికొసాంతస్ డియోయిక 30
57. టెర్మినాలియా చెబూల 31
58. ట్రైపొపెట్రినం 31
59. ఎల్లియంసెపా 31
60. ఎనకార్డియంఒరియంటాలిస్ 33
61. ఎస్పరాగస్ అఫిసినాలిస్ 34
62. బుపొరాన 35

63. కెన్నబిస్ ఇండిక 36
64. కెన్నబిస్ సతివ 37
65. కాప్సికం 38
66. కార్బొవెజిటబిలిస్ 40
67. కాలోసైలిం 42
68. అశ్వగంధ 43
69. అల్పటోనియాస్కొలారిస్ 43
70. రావ్‌వొల్ఫియా సర్పెంటిన .43
71. చెనొపోడియం 44
72. కాకస్‌కాక్టి 44
73. క్రోటన్‌టిగ్ 45
74. క్యుబెబ 46
75. మెలిలోటస్ ఆల్బా 46
76. నూపర్ ల్యూటియం 57
77. నక్సమోస్కట 48
78. బాంబూనినం 49
79. ఒరిగనం 49
80. ప్లాంటాగో మేజర్ 50
81. రిసినస్ కమ్యూనిస్ 50
82. జిమ్నెమ సైల్వస్టర్ 51
83. జింజిబెర్ అఫిసినాలిస్ 51
84. క్రోకస్ సటివ 52
85. లాథరస్ సతివుస్ 53
86. లోబెలియా ఇన్‌ప్లాటా 54
87. రూటాగ్రావియోలెన్స్ 55
88. థియా 56
89. థాయిమల్ 57
90. వెరాట్రంవిరైడ్ 57
91. అరహరపత్ర 59
92. యుపటోరియం అయాపాన 59
93. అమల్కీ 59
94. ఎన్‌హైడ్రా 59
95. కాషియా సఫోరా 59
96. టిరొకార్పస్ సాంటలినస్ 60

97. ట్రిబులస్ టెరెస్ట్రస్ 60
98. పెక్రోరిజా 60
99. ముత్తా 60
100. మైకా 60
101. టెర్మినాలియా వలెరికా 60
102. బ్రయోపైలం కలిసినం 60
103. వర్నోనియా ఎన్‌థాల్‌మింటికా సోమరాజ 60
104. హైటెక్స్‌నిగుండా 61
105. సెమ్యూల్ 61

## హోమియో చికిత్స

మూత్రంలో ఆల్బ్యుమిన్ అధికంగా ఉండుట 61
ఋతుస్రావం ఆగపడకపోవుట, అణగారుట, ఆగిపోవుట 61
ఉబ్బు, శరీరానికి నీరు పట్టుట 61
ఉబ్బసం శ్వాసకాసం 62
రాచపుండు 62
వాంతి, బేది, విషూచి, కలరా 63
మలబద్దం 63
పడిశం రొంప, జలుబు 63
దగ్గు 64
తలపై కేశములున్న భాగానికి కలుగు చంద్రు 64
మధుమూత్రం, అతిమూత్రం 64
విరేచనాలు, అతిసారం 65
ఉబ్బురోగం, నీరుపట్టుట 66
గ్రహిణి, రక్త విరేచనాలు, చీము లేక జిగటవిరేచనాలు 66
ఋతుశూల 67
అజీర్ణం రోచకం 67
చెవులు 69
ఏనుగు కాలు, బోద, శ్లీపదము 69
ముక్కునుంచి రక్తం కారుట 69
కాళ్ళుచేతులు చివరి భాగం 69
కన్ను 69
జ్వరము 70
సన్నిపాతము జ్వరం 71

| | |
|---|---|
| వాతరోగము | 72 |
| జీర్ణకోశం నుంచి రక్తం వాంతియగుట | 72 |
| మూత్రం | 72 |
| ఊపిరితిత్తుల నుంచి రక్తం పడుట | 72 |
| తలనొప్పి | 72 |
| గుండె | 73 |
| ఎక్కిళ్ళు | 73 |
| స్వరం బొంగురుపోవుట | 73 |
| వెర్రి ఉన్మాదము పిచ్చి | 74 |
| కామెర్లు | 74 |
| కుష్టురోగం | 74 |
| కుసుమ తెల్లబట్ట | 74 |
| శరీరంపై కలుగు తెల్లని మచ్చలు | 74 |
| ప్రసవించిన తరువాత కలుగు స్రావం | 74 |
| క్షీర రసగ్రంథులు స్త్రీ స్తనాలు | 75 |
| పొంగు వేపపువ్వు అనెడి చిన్న అమ్మవారు | 75 |
| ఋతుస్రావం అమితంగా అత్యధికంగా స్రవించుట | 75 |
| మూలశంక | 75 |
| తేలుకాట్లు | 76 |
| చర్మము | 76 |
| మశూచికము, పెద్దఅమ్మవారు | 77 |
| పాము కాటు | 77 |
| శుక్రనష్టము | 77 |
| ప్లీహము | 77 |
| వంధ్యత్వము | 78 |
| రాయిగట్టిపడిన పదార్ధము | 78 |
| సవాయి | 78 |
| క్షయ, రాజయక్ష్మ | 78 |
| పుండు | 79 |
| తలత్రిప్పు | 79 |
| కోరింతదగ్గు | 79 |
| క్రిములు | 79 |
| రోగికి సంబంధించిన లక్షణ సూచిక | 80 నుంచి 116 |

# ముందుమాట

ఈ ప్రపంచాన్ని భగవంతుడు సృష్టించాడని, భగవంతుడు సర్వాంతర్యామియని, ఆస్తికులు, తత్వశాస్త్రజ్ఞులు, ఆధ్యాత్మికంగా అనుభవం గడించిన పెద్దలు చెప్పడం జరిగింది. భగవంతుడు సృష్టించిన భూమి పలురకాల రసాయన పదార్థాలతో ఏర్పడినట్లు పలువురు పరిశోధకులు, విజ్ఞానవంతులు, అనుభవజ్ఞులు వెల్లడించడం జరిగింది. ఈ భూమిపై అపారమైన ప్రకృతి సంపద, వృక్షాలు, మూలికలు, ఓషధులు ఉద్భవించేలా భగవంతుడు సృష్టించాడని పరిశోధనవల్ల తెలుస్తూ వున్నది. గడిచిన యుగాలలో ఋషులు, మహర్షులు, మూలికలు, ఓషధులవల్లనే మానవకోటికి వైద్యముచేస్తూ విముక్తి కలిగించేవారని ఆధ్యాత్మిక గ్రంథాలద్వారా, ఆయుర్వేద, ఋగ్వేద, అధర్వణవేద, చరకసంహిత, శుశృత సంహిత గ్రంథాలద్వారా తెలియజేయడం జరిగింది. ప్రస్తుతం ఈ కలియుగంలో కూడా ఓషధుల ద్వారా వైద్యము చేయు పద్ధతి కొనసాగుతూనే వున్నది. ధన్వంతరి మహర్షి పుణ్యామా అంటూ, ఓషధులు, మూలికలవల్ల వైద్యము చేయు పద్ధతి అనుభవంవల్ల ప్రసాదించిన వరం అని నేను భావిస్తూ యున్నాను. హిప్పోక్రాటెస్ అను గొప్ప గ్రీకుదేశపు వైద్యుడు పలురకాల వ్యాధులకు మూలికావైద్యం వెల్లడించడం జరిగింది. చైనా దేశంలో ఈ రోజువరకు ఓషధులు, మూలికలచేత వైద్యం చేయు పద్ధతి కొనసాగుతూ వున్నది.

భారతదేశంలో కూడ ఓషధులవల్ల వైద్యంచేయు పద్ధతి, సాంప్రదాయం కొన్ని యుగాలనుంచి నేటివరకు కొనసాగుతూనే వున్నది. కొన్ని పురాతనమైన వైద్యగ్రంథాల ఆధారంతో పరిశోధించి మందులు తయారు చేయుచున్నారు. ఆయుర్వేదము, హోమియోపతి, సిద్ధయూనాని, అల్లోపతి, ప్రకృతి వైద్యవిధానాలవల్లవైద్యులు మానవకోటికి ఎనలేని సేవచేస్తూ యున్నారు. ఈ రోజువరకు నిగూఢంగా అంతుపట్టని కొన్ని ఓషధులపై పలువురు వైద్యులు, పరిశోధకులు పరిశీలిస్తూనే యున్నారు.

భారతదేశంలో లభ్యమగుచున్న ఓషధులు, మూలికలనుంచి హోమియో సిద్ధాంతం లేక శాస్త్రీయమైన హోమియోపద్ధతిద్వారా మందులు తయారుచేసి, హోమియో సిద్ధాంతంద్వారా రోగలక్షణాలపై ప్రయోగించి రుజువుచేసి ఆచరణరీత్యా అమలులోవున్న మందులు తెలియజేయడం జరిగింది. పలువురు హోమియో వైద్యులు, పరిశోధకులు, అనుభవజ్ఞులు, విజ్ఞానవంతులు రచించిన గ్రంథాలను పరిశీలించి తెలుగు భాషను అభ్యసించిన ప్రతి ఒక్కరూ తెలుసుకొనేలాగా చేసేందుకుగాను ఈ పుస్తకం రచించి ప్రచురించడం జరిగింది.

"ఒక మందు ఆరోగ్యవంతునిపై ఎట్టి లక్షణాలు కలిగించగలదో అట్టి లక్షణాలు

గల ఏ వ్యాధినైననూ ఆ మందు విజయవంతంగా; తప్పక నయం చేయును లేక కుదుర్చును". హోమియోవైద్య సిద్ధాంతమును కనిపెట్టిన హోమియోవైద్య పితామహుడు డాక్టర్ శామ్యూల్ హానిమాన్ నుడివినట్లు పరిశీలించి రోగిలక్షణాలకు సరిపడు మందును ఎంపికచేసి ఉపయోగించిన విజయవంతంగా నివారించవచ్చును. ఈ గ్రంథంలో సుమారు 105 మందుల వస్తుగుణ దీపిక, హోమియో చికిత్స, లక్షణ సూచిక వివరించడం జరిగింది. మందుకు మందు విరుగుడు కాకుండా లక్షణాలకు సరిపడు మందులను మిశ్రమంచేసిగాని, లేక ఒకటి తరువాత ఒకటిగా యివ్వవచ్చును.

"నా అహింసా సిద్ధాంతానికి ఎలా అపజయమంటూ లేదో, అదేవిధంగా హోమియో సిద్ధాంతానికి అపజయమంటూ ఉండ"దని మహాత్మాగాంధీ బోధించడం జరిగింది. "హోమియో వైద్యం అపారమైన శాస్త్రవిజ్ఞానం. తత్వశాస్త్రాల వివేచనతో నవీన వైద్యశాస్త్ర విధానంగా రుజువైనదని, దీనిని శ్రద్ధాసక్తులతో అభ్యసించి కృషిచేసిన భారతదేశంలో నలుమూలల వ్యాపించి వుండు వాతావరణానికి ఈ హోమియో వైద్యం మిక్కిలి సారూప్యమైనదని, ప్రత్యేక నియమావళితో సంతరించుకొన్నదని, జీవకోటికి ఎనలేని సేవచేసే శాస్త్రీయమైన విధానమని", విశ్వకవి నోబెల్ బహుమతి గ్రహీత రవీంద్రనాథ్ ఠాగూర్ విశ్వజనీనమైన అభిప్రాయం వ్యక్తంచేయడం జరిగింది. భారతదేశ మూలికలతో హోమియో చికిత్సద్వారా అన్ని లక్షణాలుగల వ్యాధులను సమూలంగా నిర్మూలించవచ్చును. ఈ పుస్తకం వైద్యులు, విద్యార్థినీ, విద్యార్థులు, సామాన్యమైన చదువరులు, ప్రతి ఒక్కరికి ఉపయోగపడగలదు. ఈ పుస్తకం ద్వారా ప్రతి ఒక్కరూ స్వయంగా రోగిలక్షణాలను నివారించుకోవచ్చును. ఇందులో ఎలాంటి అతిశయోక్తి లేదని భావిస్తున్నాను. ఎక్కువ ఖర్చులేకుండా తక్కువ వ్యయంతో రోగాలను నిర్మూలించుకోవచ్చును. ఈ పుస్తకాన్ని ప్రతి ఒక్కరూ ప్రోత్సహిస్తూ, తమరుకూడా తోడ్పడగలరని విశ్వసిస్తూయున్నాను.

చదువరులు, అనుభవజ్ఞులు, విజ్ఞానవంతులు, వైద్యులు ఈ గ్రంథాన్ని పరిశీలించిన తదనంతరం ఇందులో ఎలాంటి లోపాలు కనిపించినా, తమరు సూచనప్రాయంగా తమ భావాలుగాని, సలహాలుగాని, కొత్త పద్ధతులుగాని, నూతనంగా పరిశీలించి, పరిశోధించి ఆచరణరీత్యా అమలులోవున్న మందులుగాని, ఆధునిక పద్ధతులుగాని తెలియజేసిన తదనంతరం ప్రచురించు ఎడిషన్‌లో సవరించుకొంటూ చేర్చడం జరుగుతుందని కోరుతున్నాను.

- డాక్టర్ ఎన్.అశ్వర్థరెడ్డి
రిజిష్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్,
అనంతపురం.

# శక్తి (Potency)

రోగి లక్షణాలపై మందులు ప్రయోగించునపుడు తరుణ వ్యాధులలో (Acute Diseases) తక్కువ శక్తి (Low Potency) గల మందులు వాడాలి. మాత్రు ద్రావకము - Q, 1x నుంచి 30x శక్తిగల మందులు అధికశాతం వాడవచ్చును. దీర్ఘవ్యాధుల (Chronic Diseases) లో అధికశక్తిగల (High Potency) మందులు వాడవచ్చును. దీర్ఘవ్యాధి లక్షణాలపై మందులు ప్రయోగించునపుడు 200, 1M, 10M, 50M, C.M. శక్తిగల మందులు వాడవచ్చును. అధికశక్తిగల మందులు వాడునపుడు మోతాదు (Dose) తక్కువగా వాడవలయును. 200 శక్తిగల మందు రోజుకు రెండుసారులు వాడవచ్చును. సమయం సందర్భంగా రోగి లక్షణాలు గమనించి మోతాదును పెంచవచ్చును. 1M శక్తిగల మందు వారానికి రెండుసారులుగాని, ఒకసారిగాని వాడవచ్చును. 10M (వేలు), 50M (వేలు), శక్తిగల మందులు 10 రోజులకుగాని, 15 రోజులకుగాని ఒకసారి వాడవచ్చును. C.M. (లక్ష) శక్తిగల మందు 15 రోజులకు ఒకసారిగాని 30 రోజులకు ఒకసారిగాని వాడవచ్చును. సమయానుకూలంగా వ్యాధి లక్షణాలనుబట్టి మోతాదు పెంచుకోవచ్చును. కొంతమంది హోమియోవైద్యులు 1M నుంచి CM వరకు రోజు ఒక మోతాదుగాని, రెండుసారులుగాని వాడవచ్చునని కొన్ని పత్రికలలో చదవడం జరిగింది. ఈ విషయంలో నేను అభ్యంతరం చెప్పగా పత్రికలలో ప్రకటించిన వైద్యుడు తన వాదనను సమర్థించుకోవడం జరిగింది. ప్రస్తుతం భారతదేశంలోగాని, ఇతర దేశాలలోగాని మానవులేకాకుండా, జంతువులతోసహా అన్నిరకాల కలుషితమైన ఆహారం తీసుకోవడంవలన తక్కువ ప్రొటెన్సీ మందులు సరిగా పనిచేయవని ఇది తమ అనుభవంద్వారా తెలుపుతూయున్నట్లు చెప్పారు. ఈ రోజుల్లో విషపూరితమైన ఆహారం తీసుకొంటున్నందువలన అధికశక్తిగల మందులు రోజుకు రెండుసార్లు యిచ్చినప్పటికి మేలే చేయగలవని, కీడుచేయవని వ్యక్తంచేశారు. మాతృద్రావకం మందు వాడునపుడు 5 నుంచి 15 చుక్కలమందు రోజుకు మూడుసార్లుగాని, నాలుగుసార్లుగాని వాడవచ్చును. అత్యవసర సమయంబట్టి మోతాదు పెంచుకోవచ్చును. 1 నుంచి 30 శక్తిగల మందు వాడునపుడు రోజుకు 3 నుంచి 4 మోతాదులు వాడవచ్చును. అత్యవసరము బట్టి అర్ధగంట, గంటకొకసారి కూడా యివ్వవచ్చును. హోమియో ఇంజెక్షన్ మందులు వాడవచ్చును. అనుభవంవున్నవారు చేయడం మంచిది.

మోతాదు ఎన్ని మాత్రలు వాడవలసిన విషయం వచ్చినపుడు వైద్యుడు సమయస్ఫూర్తిగా వాడు సైజుగల మాత్రలనుబట్టి నిర్ణయించుకోవడం మంచిది. ఎందుకంటే పలురకాల సైజుల్లో మాత్రలుగా, పిల్సుగా, బిళ్లలుగా కంపెనీవారు తయారుచేయటంవల్ల సమయానుకూలంగా వైద్యుడు సైజునుబట్టి నిర్ణయించుకోవడం మంచిది. ఉచిత హోమియో వైద్యశాలలు యిచ్చు మాత్రలకును, ప్రయివేటు వైద్యుడు యిచ్చు మాత్రలకును తేడా యుండును. ఇది ప్రతి ఒక్కరూ తెలుసుకొంటారని భావిస్తూయున్నాను.

50 మిల్లి సెమిల్ శక్తిగల మందులు ప్రస్తుతం కొన్ని పరిశ్రమలు మాత్రం తయారుచేస్తున్నాయి. వీటిని ఇదేల్లాగా అధిక శక్తిగల మందులు మాదిరిగానే వాడవచ్చును. ఈ మందులు మరల మరల వాడిన నిరపాయకరంగా పనిచేయును.

- డాక్టర్ ఎన్.అశ్వర్థరెడ్డి
రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనర్,
అనంతపురం.

# ఓషధి నిఘంటు (Materia Medica)

## (1) అబ్రోమ అగస్టె (ABROMA AUGUSTA)

**రోగి లక్షణాలు :** మూత్రంలో అల్బుమెన్, నిద్రపట్టకపోవుట, ఋతుస్రావం అణగారుట, రాచపుండు, అతిమూత్రం, మధుమూత్రం, నీరసం, ఋతుశూల మొదలగు బలహీనతలు.

**మనస్సు :** త్వరగా కోపం వచ్చుట, ఉద్రేకభావంతో వుండుట, కోపంగా వుండుట, జ్ఞాపకశక్తి లేకపోవుట, పరధ్యానంగా వుండుట, జబ్బు స్థితి, విచారంగా వుండుట, దుఃఖంతో వుండుట, ఆతృతగా వుండును. కోపంతో మాట్లాడలేకపోవుట.

**తల :** తల భారంగా కష్టంగా వుండుట, తలలో ఖాళీగా వుండునట్లు భావించును. తల గుండ్రంగా తిరిగినట్లుండుట, తలత్రిప్పుట.

**కన్నులు :** దృష్టిలోపం, కనురెప్పలు ఉబ్బునట్లుండుట, భారంగా నుండుట, కన్నులు సులభంగా అలసిపోయినట్లుండుట, కండ్లు వాలునపుడు మూసుకొన్నపుడు కన్నీటిచుక్క కారుట, కన్నులలో నీరు కూడుకొని నొప్పి వుండుట, కంటియొక్క అమత్యక్కు తెల్లబారినట్లుండును.

**చెవులు :** వినికిడి తక్కువ, చెవులలో తేనెటీగల ఝుంకారంవలె శబ్దము వుండుట, చెవులనుంచి చీము, రసి విసర్జించుట.

**ముక్కు :** పలుసార్లు తుమ్ములు వచ్చుట, నీరు కారుట, ముక్కు పొడిగానుంటూ మర్దన చేసికొనేందుకు కోరుట.

**ముఖము :** పాలిపోయివుండుట, పచ్చగ నుండుట, ముడతలు పడియుండుట, చూసేందుకు ముసలివారిలాగా వుండును. ముఖంపై నవ్వ, దద్దులు మంటగానుండును. ముఖంపై సెగ్గడ్డలు, కురుపులుండును.

**గొంతు :** పొడిగానుండుట, మంటగా నుండును. ఘనపదార్థాలు కూడా మ్రింగుట కష్టంగా వుండును. కాని పానీయాలు త్రాగుటవల్ల తాత్కాలికంగా ఉపశమనం కలుగును.

**నోరు** : ఇంచుమించుగ నిరంతరం నోరు పొడిగా వుండుట, అతిగా చల్లనినీరు త్రాగినప్పటికి పొడిగా వుండును. నాలుక పొడిగా శుభ్రంగా వుండును. మాటలు అస్పష్టంగా వచ్చుట, పెదవులు ఆర్చుకొనిపోయి నల్లగా వుండును.

**ఆకలి** : విపరీతమైన ఆకలి, కడుపునిండా తిన్నప్పటికి మరల ఆకలి వుండును.

**కడుపు** : ఆకలిగొన్నపుడు నీరసంగా వున్నట్లు భావించును. అన్నిరకాల ఆహార పదార్థాలు తినాలనే కోరిక యుండుట, కడుపులో ఖాళీవున్నట్లు భావించును.

**ఉదరము** : ఉదరకోశం వాయుపూరితమై ఉబ్బినట్లుండును.

**మలము, విరేచనాలు** : మలబద్ధకము, మలం గోధుమవర్ణం వుండును. నల్లగా వుండును. మలం గట్టిగా కష్టంగా వచ్చుట, చాలా బలవంతంపై మలం ముద్దలులాగా వచ్చును.

**మూత్రము** : రాత్రి, పగలు మూత్రం విస్తారంగా విసర్జించుట, తరచుగా మూత్రం స్రవించుట, నోరు ఆర్చుకొనిపోవుట, అతిగా దాహం వుండును. మూత్ర విసర్జనానంతరం దాహం తీర్చుకొనేందుకు నీరు త్రాగవలెనని కోరిక వుండును. మూత్ర విసర్జనవల్ల ఆలసట కలుగుట, మూత్రం చేప వాసన వచ్చుట, తేలికపాటి మడ్డిగానుండుట, మధుమూత్రం రాత్రి స్పృహలేకుండానే శయ్యలో మూత్రంపోయుట, మూత్ర విసర్జన నాళంలో మంటయుండుట, మూత్రంలో అతిగా చక్కెరపోవుటవల్ల నోటిలో తెల్లని పుండ్లు ఏర్పడును.

**హృదయం** : గుండె బలహీనత, గుండె వడిగా, బలంగా కొట్టుకొనుట, మూర్ఛపోవునట్లు భావించుట.

**శ్వాసమండలం** : కఫం, కళ్ళి, చీముతో కూడిన దగ్గు, ఛాతీలో నొప్పి. కళ్ళి ముద్దలాగా తెల్లగా పచ్చగా రంగులలో ఉండును. చల్లని వాతావరణంలో సాయంత్రం రాత్రిపూట అధిక బాధలతో నుండును. దగ్గునపుడు రోగి ఛాతీని అదిమిపట్టుకొనును.

**చర్మం** : చర్మం పొడిగా నుండుట, గోకుకొనుట, మంటగ నుండును. వేసవి కాలంలో చిన్నచిన్న గడ్డలు పుట్టుట, పెద్దపుండ్లు ఏర్పడినపుడు పనిచేయును.

**మెడ, వీపు, కాళ్ళు చేతులు** : కాళ్ళు చేతులలో నొప్పులు, చాలా విచారకరంగా వుండుట, కాళ్ళు చేతులు మొదలగు అవయవాలు నీరసంగా, బలహీనంగా వుండుట, మూత్రపిండాలకు సంబంధించిన భాగంలో నొప్పులుండును.

**పురుష జననేంద్రియానికి సంబంధించిన లక్షణాలు** : వృషణాలు వాచి వ్రేలాడునట్లుండుట, జననేంద్రియ వాంఛ లేకపోవుట, సంభోగించేందుకు అసమర్థతగా వుండుట, సంభోగానంతరం ఆలసిపోయి నీరసం కలుగును.

**స్త్రీ జననేంద్రియానికి సంబంధించిన లక్షణాలు** : కాలనియమం లేకుండా ఋతుస్రావం కలుగుట, రక్తం నల్లగా గడ్డలులాగా ఋతుశూలలో స్రావం విస్తారంగా వచ్చుట, తెల్లబట్ట నీళ్లలాగా పల్చగా తెల్లగా విస్తారంగా విసర్జించుట, ఒక రకమగు రక్తక్షీణత యువతులలో అతిగా కలుగును. ఇందుచే ముట్లు ఆగిపోయి నీరసించి ఆకలిగాని, జీర్ణశక్తి యుండును. పొత్తికడుపు దిగువభాగంలో ఋతుస్రావానికి 2 నుంచి 3 రోజుల ముందుగా శూలతో కూడిన నొప్పులు వచ్చుట, ఋతుదోషాలవల్ల మానసికంగా కలత చెందును.

**నిద్ర** : నిద్రమత్తు, నిద్రపట్టకపోవుట, ఏ పనిచేయాలన్నా అయిష్టంగా వుండును. పూర్తిగా శక్తి అంతయూ పోయి సొగిలపడినట్లుండుట, ఆలసట తీర్చని నిద్ర, వేకువజామున బాగుగా నిద్రపట్టినట్లుండును.

**జ్వరం** : శరీరమంతయు ఉష్ణం, పొడిగా వుండును. విపరీతంగా దాహం వుండును. ఈ మందు మూలికను ఒలలట్ కంబాల్, డేవిల్సు కాటన్ అందురు. ఒలక్ టంబాల్ అని కూడా అందురు. డాక్టర్ డి.ఎన్.రాయ్ మొట్టమొదటగా యీ మందును ప్రవేశపెట్టి రుజువుచేసెను.

## 2. ఎబ్రోమ రాడిక్స్ (ABROMA RADIX)

**రోగి లక్షణాలు :** స్త్రీ వ్యాధులు

**మనస్సు :** మానసిక సంబంధమైన వ్యాధులు మరియు ఎబ్రోమ ఆగస్ట మందులో చెప్పిన లక్షణాలన్నియూ ఈ మందులో గలవు.

**స్త్రీ జననేంద్రియానికి సంబంధించిన లక్షణాలు :** కాల నియమం ప్రకారం ఋతుస్రావం కలుగకుండా సంభవించు వ్యాధులు. ఋతుశూల, ఋతుస్రావం విస్తారంగా స్రవించవచ్చును. లేక తక్కువ స్రవించవచ్చును. కుసుమ వ్యాధి వుండును. ఈ మందు ఒలట్ కంబాల్ చెట్టు వేరునుంచి రసంతీసి తయారుచేయుదురు. ఈ మందును డాక్టర్ డి.ఎన్.రాయ్ ప్రప్రథమంగా ప్రవేశపెట్టి రుజువుచేసెను.

## 3. ఎకలైఫ ఇండిక (ACALYPHA INDICA)

**రోగి లక్షణాలు :** దగ్గు, విరేచనాలు, ప్రేగులు గాలితో ఉబ్బరించియుండుట, ఊపిరితిత్తులనుంచి దగ్గినపుడు రక్తంవచ్చుట.

**శ్వాససంబంధమైన లక్షణాలు :** దగ్గు ఉధృతంగా వుండును. దగ్గినపుడు కళ్ళె, కఫంతోపాటు రక్తం వచ్చుట, ఉదయంపూట శుద్ధరక్తం వచ్చుట, సాయంత్రంపూట నల్లనిరక్తం గడ్డలులాగ పడుట. రాత్రిపూట దగ్గు ఉధృతంగా వుండును. ఛాతీలో ఎల్లప్పటికి తీవ్రబాధ, నొప్పియుండును.

**ఉదరసంబంధమైన లక్షణాలు :** ప్రేగులు, కడుపులో మంట, విరేచనాలు బ్రద్దలు కొట్టినట్లుగ శబ్దంతో వడిగా బహిర్గతమగును. పొత్తి కడుపులో శూలనొప్పి, మల, మూత్రం విసర్జించుటకు బాధపడుట, ముక్కుటకు ప్రయత్నంచేయాలి. పురీషనాళంలో నొప్పి స్రావం వుండుట, సాయంత్రంపూట బాధ మొదలగునవి హెచ్చును.

**చర్మం :** పచ్చకామెర్లు, కామలారోగం, సెగ్గడ్డలులాగ వాపులో వుండుట, నవ్వలు, దురదలుండును. మందు తయారగు మూలికను "హరితమంజరి, ముక్తబర్షి" అందురు. డాక్టర్ ఎం.ఎల్.సర్కార్ ప్రప్రథమంగా రుజువుచేసెను.

## 4. ఈగిల్ ఫోలియా (AEGLE FOLIA)

**రోగి లక్షణాలు :** రక్తం స్రవించు మూలశంక, విరేచనాలు, గ్రహిణి, రక్తవిరేచనాలు, ఉబ్బుతో కూడిన జ్వరం, నపుంసకత్వం.

**మనస్సు :** వర్ణక్రమం, అక్షరక్రమంలో పొరపాట్లు వచ్చుట.

**తల :** తలనొప్పి సాయంత్రం 4 నుంచి 8 గంటల మధ్యలో కనబడుట. సాయంత్రం తలనెత్తిపైన ఉష్ణం కనబడుట. ఇది ఆహారం తినుటవలన బాగుండును.

**ముఖం :** ముఖం, కండ్లు, చెవులు వేడివల్ల ఎర్రగా మారుట. ఆహారం తిన్న తదనంతరం కనపడకుండా మాయమగును.

**శ్వాససంబంధమైన లక్షణాలు :** అమత్వక్కు వాపు, శ్వాసనాళమందలి అమత్వక్కు వాపు, జలుబులో కూడిన జ్వరం, ఊపిరితిత్తులవాపు, దగ్గు.

**ఉబ్బురోగం నీరుపట్టుట :** శరీరంలో ఏ భాగమందైనా ఉబ్బు వుండవచ్చును. కనురెప్ప పైభాగంలో ఉబ్బియుండుట. గుండె వ్యాధులలో నీరుపట్టి ఉబ్బు వుండును. నంజువ్యాధికి అద్భుతమైన మందు.

**నాడి, ధాతువు, ధనారింపు :** కాల నియమం లేకుండా పూర్తిశక్తివంతమైన విధంగా విచిత్రంగా సహజంగా వుండుట.

**కడుపుకు, ప్రేగులకు సంబంధించిన లక్షణాలు :** అజీర్ణం, పొత్తికడుపునొప్పి, మూలశంక,

మలబద్ధం, ఆహారంపై కోరిక లేకపోవుట, ఆకలి లేకపోవుట, అజీర్ణంచే నోటినుంచి నీరు అధికంగా ఊరుచుండుట, కడుపునొప్పికి సంబంధించిన వ్యాధులు, ప్రేగులు గాలితో ఉబ్బరించుట, అపానవాయువులు పెద్దశబ్దంతో వచ్చుట, మధ్యాహ్నం బాధ అధికమగుట, గ్రహిణి, చీము, రక్తవిరేచనాలు కలుగును.

**మూత్ర సంబంధించిన లక్షణాలు :** మూత్రం చాలా తగ్గిపోవుట, నడుముకు సంబంధించిన భాగంలో, వీపులో నొప్పియుండుట, మధ్యాహ్నం బాధలధికమగును.

**పురుష జననేంద్రియాలకు సంబంధించిన లక్షణాలు :** జననేంద్రియాలకు సంబంధించిన నపుంసకత్వం.

**చర్మం :** తామర, చర్మవ్యాధులచే చర్మంపై పొరలూడుచుండును. నవ్వలు, దురద వుండును.

**జ్వరం :** ఎడతెగని జ్వరం, విషపడిశం జలుబుతో వుండుట. కాలేయం, ప్లీహంనకు సంబంధించిన బాధలుండును.

ఈ మందును బిల్వ, మారేడు, శ్రీఫలము చెట్టునుంచి తయారుచేయుదురు. డాక్టర్ పి.పి.బిస్వాస్ రుజువుచేసెను.

## 5. ఈగిల్ మార్మెలోస్ (AEGLE MARMELOS)

ఈగిల్ఫొలియా మందులాగే ఈ మందు కూడా పనిచేయగలదు. తరుణ, దీర్ఘకాలికంగా వుండు అతిసారవ్యాధికి చక్కగా పనిచేయును. ఉదరంలో అపానవాయువుతో కూడుకొన్న విరేచనాలు, చీము, రక్తవిరేచనాలు, చిన్నపిల్లలలో కలుగు దగ్గులకు మంచి ఫలితం యివ్వగలదు. 1929లో యదువీర్‌సింహ ఈ మందును ప్రయోగించి రుజువుచేసి మంచి లాభంపొందినట్లు చెప్పారు.

## 6. టెర్మినాలియా అర్జున (TERMINALIA–ARJUNA)

**రోగి లక్షణాలు :** గుండె జబ్బులు, గుండెనొప్పి, అవయవాల పని, ఊపిరాడకుండా చేయుట, తలత్రిప్పుట, ఎముకలు విరిగి శరీరమంతా నొప్పులతో వుండుట, కుముకు దెబ్బలవలన కలిగిన మచ్చలకు అద్భుతంగా పనిచేయును. క్షయ, రక్తస్రావం, నంజువ్యాధి, అతిసారవ్యాధి, వాంతులు, శుక్రనష్టం, సెగవ్యాధి లక్షణాలను మాయం చేయును.

**మనస్సు :** నరాలకు సంబంధించిన వ్యాధి, పిరికితనం.

**తల :** తలత్రిప్పుట, చుట్టూ తిరుగునట్లుండుట.

**చెవి :** చెవిలో ఎడతెగని శబ్దం వుండుట.

**నోరు :** నోటిలో రుచి చేదుగనుండుట.

**మూత్రం :** మూత్రం తక్కువగా నుండును. కొంచెం కొంచెం విసర్జించును.

**గుండె :** గుండెపోటు, గుండె నొప్పి, బలహీనతగా వుండుట.

**శ్వాససంబంధమైన లక్షణాలు :** దగ్గు, ఛాతీలో గురగురలాడునట్లుండుట. ఛాతీలో నొప్పి, దగ్గిన తరువాత కళ్ళితోపాటు రక్తం పడుట, శ్వాస ఆడుట కష్టంగా వుండును. గాలికోసం పంఖా కావాలని కోరుట- మొదలగు లక్షణాలపై పనిచేయును.

**నిద్ర :** రాత్రిళ్ళు పూర్తిగా నిద్రపట్టకపోవుట, చెమటలు పట్టుట, కొట్లాట, ఆత్మహత్య, సముద్రం చూస్తూయున్నట్లు కలలు వచ్చుట.

**జ్వరం :** మందజ్వరం, చేతులు, కాళ్ళు నల్లగా వుండుట, అతిగా చెమటలు పట్టుట.

ఈ మందును మద్దిచెట్టునుంచి తయారుచేయుదురు. డాక్టర్ ఎస్.పి.ఘోస్ ప్రప్రథమంగా ప్రయోగించి రుజువుచేసెను:

# 7. జనోసియా అశోక (JANOSIA ASOKA)

**రోగి లక్షణాలు :** పలురకాల గర్భకోశానికి సంబంధించిన వ్యాధులు, ఋతుస్రావం సక్రమంగా కాకపోవుట, ముఖ్యంగా ఋతుస్రావం అధికంగా స్రవించుట, స్త్రీ పాలిటికి కల్పవృక్షంలాంటి మందు.

**మనస్సు :** మంచి స్వభావం, ప్రేమతో వుండుట, సులభంగా ఏర్పడుట, ఉద్రేకం చెందుట, ఆయాసపడుట, ఏ పనిచేయాలన్నా ఇష్టం లేకపోవుట, పరధ్యానంగా వుండుట, నిదానంగా అర్థం చేసుకొనుట, హిస్టీరియా, ఆతురత సహించలేకపోవుట, చిన్న విషయంతోగాని, చిన్న వస్తువులతోగాని తృప్తిచెందుట, నిద్రాభంగం, నిద్రపట్టకపోవుట, భీతి చెందునట్లు, ప్రయాణించునట్లు కలలు వచ్చును.

**తల :** రక్తప్రసరణాధిక్యతచే కలుగు తలనొప్పి ఋతుస్రావం కలుగుటవలన తలనొప్పి తగ్గును. కాల నియమం కలుగు తలనొప్పి స్నానం చేయుటవలన తగ్గును. తలభారంగా వుండును. తలత్రిప్పుట.

**కన్నులు :** కండ్లయొక్క అమత్వక్కు ఎర్రగా, మంట దురదతో వుండును. కన్నీరు కారును. వెలుగును సహించలేకపోవుట, వెలుగునందు భీతిచెందుట, కంటి పైరెప్పమీద కాయలు, కురుపు లేచుట, హ్రస్వదృష్టి, శారీరక, మానసిక లక్షణాలవల్ల కండ్లు అలసట చెందినట్లుండును.

**ముక్కు :** ముక్కునుంచి విస్తారంగా నీరు కారుట, తుమ్ములు ముక్కురంధ్రాలలో పుండ్లు నొప్పివుండుట, ముక్కుకు అంతరాయం కలుగుట, వాసన తెలియకపోవుట, ముక్కునుంచి రక్తం కారుట.

**చెవులు :** చెవులలో నొప్పి తీవ్రమైన చలి తర్వాత గట్టిగా పిలవందే వినపడదు.

**ముఖం :** ముఖం పాలిపోయి వుండుట, ఉష్ణం ఎర్రదనం ఒకటి తరువాత ఒకటి వచ్చుట, ముఖంపై మొటిమలుండుట.

**నోరు :** నోరు పొడిగావుంటూ అమితదాహం వుండును. ఒకేసారి అతిగా నీరుత్రాగుట, నాలుకపై తెల్లగాగాని, గోధుమవర్ణంగాకాని జిగటగా పూత వుండును. నోరునుంచి జిగటగ కారుట, పంటినొప్పి వుండును.

**గొంతు :** గొంతుకలో ఎర్రని పుండ్లతో వుండునట్లు భావించుట, సులభంగా చల్లదనం వచ్చుట, దగ్గు వుండును.

**ఆకలి :** తియ్యని, పుల్లని పదార్థాలపై కోరిక, పాలు త్రాగుటకు అయిష్టత.

**కడుపునొప్పి :** అతిగా వికారంగా వుండుట, వాంతి చేసికొనగోరుట, అప్పుడప్పుడు పైత్యరసం వాంతి చేసుకొనుట, జీర్ణకోశంలో నొప్పి, ఉదరకుహరంలో నొప్పి, ఆహారంపై అయిష్టత, కొద్దికొద్దిగా తినుట.

**ఉదరం లేక పొత్తికడుపు :** గట్టిగా వుండును. ఉబ్బినట్లుండి దుర్వాసనతో గాలి బహిర్గతమైనపుడు తగ్గుట, సాయంత్రంపూట బాధలధికంగా వుండును.

**మలము :** దీర్ఘకాలికంగా వుండు మలబద్ధకం, మూడు, నాలుగురోజులకొకసారి మలవిసర్జన వచ్చుట, మలవిసర్జన ముందుగా నొప్పివుండును. గుదస్థానంలో పుండు నొప్పి వుండుట, రక్తం స్రవించు మూలశంక, మంట నవ్వతో వుండును. మలం గట్టిగా పొడవుగా జిగటగ వచ్చును.

**మూత్రావయవములు :** తరచుగా కొద్దిగా రాత్రిపూట తెలియకుండగానే మూత్రవిసర్జన జరుగుట, నొప్పి వుండుట.

ఈ మందు అశోక వృక్షం నుంచి తయారుచేయుదురు. మొదటగా డాక్టర్ డి.ఎన్.రాయ్ ఈ మందును ప్రయోగించి రుజువు చేసెను. 1918లో డాక్టర్ మహేంద్రనాథ్ సర్కార్, బాగ్దాద్ పట్టణంలో ఈ మందును హోమియో పద్ధతిలోనికి తెచ్చెను.

# 8. ఎటిస్ట ఇండిక (ATISTA INDICA)

## గ్లైకొస్మిస్ పెంటాఫైలా (Glycosmis Pentaphylla)

**రోగి లక్షణాలు :** పిత్తకోశంనుంచి రాళ్ళు వెలువడుటచే ఉదరకుహరం కుడివైపు పైభాగంలో కలుగు శూల (నొప్పి), విరేచనాలు, జీర్ణకోశం, ప్రేగులు గాలితో ఉబ్బరించుట.

**మనస్సు :** జ్ఞాపకశక్తి లోపించుట, స్వంత పనిపై కూడా ఉత్సాహం లేకపోవుట, శక్తి క్షీణించుట.

**తల :** ఉదయంపూట తల తిరుగుట, ఒకప్రక్క కణతలో కొరుకుకు తినుచున్నట్లు తీవ్ర నొప్పియుండుట.

**కన్ను :** వెలుగును సహించలేకపోవుట, వెలుతురులో భీతిచెందుట, కండ్లు తెరిచినపుడు వెలుతురు ముందు కొన్ని క్షణాలు కంపనం వుండినట్లుండుట. కండ్లు మూసుకొన్న ఉపశాంతి కలుగుట, కండ్లముందు వెలుతురు వణుకుచున్నట్లుండును. తదనంతరం నిద్రపట్టును.

**చెవి :** వినుటకు సాధ్యంకాని విధంగా ఎక్కువగుట, చెవిలో ఝుంకారమగు శబ్దం వుండును.

**ముక్కు :** ముక్కులనుంచి కారుట, పొడిగ రొంప జలుబు ఉండును.

**దంతములు :** ఇగుళ్ళనుంచి రక్తస్రావం, దంతాలమూలంలో విచారకరమగు నొప్పియుండును.

**పొడిగ నుండుట :** ఉష్ణం అతిగానుండు స్థితిలో తీర్చజాలనంతటి దాహముండును.

**నాలుక :** అప్పుడప్పుడు తేన్పులు వస్తూ ఉప్పునీరులాగా ఉదయంపూట ఎడతెగని ఉమ్మి వూస్తూయుండుట, శుభ్రం చేయునపుడు పుల్లని నీరులాగ వుండును.

**గొంతు :** కొన్ని వారాలు జ్వరం వచ్చిన తదనంతరం టాన్సిల్సు గట్టిగా ఏర్పడుట.

**కడుపు :** అత్యధికంగా ఆకలి, ద్రవపదార్థాలపై అయిష్టత, నిమ్మరసంపై కోరిక ఎక్కువగా వుండుట, కడుపులో భారంగా వుండునట్లుండుట, ఉదరకుహరంలో రొమ్మెముక భాగం ధనారింపుండుట, కడుపులో వాయువుచేరి ఉబ్బరించినట్లుండుట, తేన్పులు వచ్చిన తాత్కాలికంగా ఉపశాంతి కలుగును. క్రిములవల్ల అజీర్ణవ్యాధి సంభవించుట, భోజనం చేసిన తరువాత తరచుగా తేన్పులు వచ్చుట, ఆహారం తీసుకొన్న 3, 4 గంటల తదనంతరం గుండెలో మంట వుండుట.

**ఉదరం, పొత్తికడుపు :** నాభి, బొడ్డుచుట్టూ శూలవుండుటవలన రోగిని తెలివిహీనునిగా చేయును. కడుపునొప్పి, మూత్రవిసర్జనగాని, మలవిసర్జనగాని ముక్కనిదే వచ్చుట కష్టంగా వుండును. మూత్రపిండాలకు సంబంధించిన భాగంలో లాగుచున్నట్లు నొప్పియుండును.

**గుండె, నాడీమండలం :** జ్వరం వచ్చినప్పుడు గుండె వేగంగా కొట్టుకొనుట, జ్వరం వుండునపుడు నాడులు పూర్తిగా వేగంగా వుండును. గట్టిగా, బలహీనంగా వుండును. జ్వరం తగ్గిన తదనంతరం నెమ్మదిగా కొట్టుకొనును.

**మలము :** జ్వరంతో వుండునపుడు మలబద్ధకంగాని, విరేచనాలుకాని వుండును. తెల్లగ, మట్టిలాగ మలం వుండుట, మలంతో రక్తం స్రవించును.

**పురుష జననేంద్రియ లక్షణాలు :** జననేంద్రియ సంబంధంగా వాంఛలేకపోవుట, పురుషులలో శిశ్నం ఏ కారణంలేకనే నిక్కి ఉబ్బుట, మూత్రవిసర్జనాళంలో విద్యుద్ఘాతంలాగ కొన్ని క్షణాలపాటు ధనారింపు వుండును.

**కాళ్ళు, చేతులు అవయవాలు :** భారంగా, నీరసంగా వుండుట, కాళ్ళు నిద్రావస్థకు వెళ్ళుట, బిగుసుగవుంటూ బాధతో ముడుచుకొనిపోవునట్లుండుట.

**జ్వరం :** దాహంలేకుండా చలి, తీవ్రమగు దాహం, ఉష్ణం వుండును. ఉదయం 5 నుంచి 10 గంటలమధ్య జ్వరం వచ్చును. సాయంత్రం 3 నుంచి 4 గంటల మధ్యలో తగ్గిపోవును. దినం విడిచి

దినం జ్వరం వచ్చును. Ash-Sheora అను చిన్న మొక్కనుంచి మందు తయారుచేయుదురు. ప్రప్రథమంగా డాక్టర్ కాలీకుమార్ భట్టాచార్య 1919లో మందును ప్రయోగించి రుజువుచేసెను.

## 9. ఎటిస్ట రాడిక్స్ (ATISTA RADIX)

**రోగి లక్షణాలు :** గ్రహిణి, చీము, రక్తవిరేచనాలు, క్రిమి వ్యాధులు, మలమునకు సంబంధించిన లక్షణాలు. ఎటిస్ట ఇండిక మందుకంటె ఈ మందు చాలా ఉపయోగపడును. నాభి చుట్టూ తీవ్రమగు నొప్పి, ఆకురాలు కాలం, శీతాకాలానికి, వేసవికి మధ్యకాలంలో కలుగు గ్రహిణి తేలికరకమైనను, అపాయకరమైనను చీము రక్తంతోయున్నను, ఎటిస్ట ఇండిక మందుచే నివారణకానపుడు ఈ మందు నివారించును. నాభిచుట్టూ తీవ్రమగు నొప్పియుండుటతో కేవలం రక్తం మాత్రం రోగి విసర్జించునపుడు ఈ మందు ఉపయోగపడును. క్రిమివ్యాధులు, విరేచనాలు, గ్రహిణి, శూలపోట్లు, ఉదరం వాయుపూరితమగుట, పైత్యరసాధిక్యతచే కలుగు శూల, కలరా ఆమ్లలక్షణాలు, శూలకు అద్భుతంగా పనిచేయును. ఎటిస్ట ఇండిక అను మూలిక వ్రేళ్ళనుంచి ఈ మందును తయారుచేయుదురు. 1920లో డాక్టర్ హరిదాస్ పాలిత్, లహెరియా సరాయ్‌లో ప్రప్రథమంగా ప్రయోగించి రుజువుచేసెను.

## 10. అసాయ్ (ASAI)

**రోగి లక్షణాలు :** ఉష్ణమండలంలో కలుగు అపాయకరవ్యాధి, కర్తం క్షీణించి కాలేయ ప్లీహములు పెద్దవగును. జ్వరంతో రోగి ఎండి నల్లగా మారును. వంటికి నీరు పట్టును. ఇగుళ్ళ నుంచి, అంతర్గతావయవాల నుంచి రక్తం స్రవించును. దీనినే కాలా అజార్ లేక డండం జ్వరమందురు. ఈ వ్యాధివల్ల రోగి ఆవేదన చెందునట్లుండును.

**మనస్సు :** చింతాక్రాంతుడగుట, తీవ్రమగు బాధ, నొప్పివలన వ్యాకులపడుట, భవిష్యత్తు గురించి ఆందోళన చెందుట, శాంతి లేకపోవుట, భవిష్యత్తులో అరిష్టం జరుగుతుందేమోనని విచారంగా వుండుట. నీళ్లలో ఈదుతూ విహారయాత్ర సలుపునట్లు కలవచ్చుట.

**తల :** తల రెండువైపులా అతి వేడిగా వుంటూ నొప్పితో వేదన చెందుట.

**కన్నులు :** కండ్లు ఎర్రగా వుండుట, కొంచెం ఆవేశం చెందినప్పటికీ కండ్లనుంచి నీటిచుక్కలు రాలును.

**చెవి :** చెవినుండి చెడువాసనతో స్రావం కారుట. చెవిలో వేడిగ వుంటూ శబ్దం వుండుట.

**ముఖము, నాలుక** నోటిలో పుండ్లు, నోటిలో దుర్వాసన, నాలుకపై ఎర్రగా వాచుట, పండ్లలో నొప్పులు, ఇగుళ్లు వాచి చెడురక్తం స్రవించును.

**గొంతు :** దగ్గుతున్నప్పుడు గొంతులో మంట, గొంతులో కళ్లికూడియుండుట, ఊపిరితిత్తులలో గళ్ల ఎక్కువగా కూడి శ్వాస ఆడుట కష్టంగా వుండును. శ్వాస పీల్చునపుడు ఎక్కువ శబ్దంతో వుండును.

**శ్వాస సంబంధించిన లక్షణాలు :** ఛాతీలో నొక్కినట్లుండుట, శ్వాస ఆడుట కష్టంగా వుండుట, శ్వాస, పీల్చునపుడు బాధ, కష్టం వేధించినట్లుండును.

డాక్టర్ కాలీకుమార్ భట్టాచార్య(అస్సామ్) ప్రప్రథమంగా ఈ మందును ప్రయోగించి అమలు పరిచెను.

## 11. అజాడిరెక్టా ఇండిక (AZADIRECTA-INDICA)

### (మెలియా అజాడిరక్ట - MELIA AZADIRAHTA)

**రోగి లక్షణాలు :** ముక్కు పుండిపడి దుర్వాసనగల స్రావం స్రవించుట, స్ఫోటకవ్యాధులవలనగాని, సవాయిచేగాని ముక్కు, ఎముకలు పుండుపడుట కలుగవచ్చును. బొబ్బలతోకూడిన చర్మవ్యాధి

బొబ్బలు మొదలు చిన్న బటానీగింజ పరిమాణం వుండి కోడిగ్రుడ్డు పరిమాణం వరకు వుండవచ్చును. నీటిబొబ్బలు గుంపుగగాని, ఒకదాని తరువాత మరియొకటిగాని కలుగుచూ పగిలి పుండుపడి పల్చని పక్కు గట్టును. అపాయకరమగు రకాలందు అమత్వక్కు పుండుపడి రక్తస్రావం విరేచనాలు కలుగవచ్చును. చిడుము, గజ్జి, అంటు చర్మవ్యాధి, రాత్రులు తీవ్రమగు దురద, కలుగుచుండును. ఇది ఒక రకమగు సూక్ష్మక్రిములచే కలుగుచున్నది. సూక్ష్మక్రిమి చర్మం క్రింద గుడ్లు పెట్టుచుండును. ఇది ఒకరినుంచి మరియొకరికి సులభంగాసోకి వ్యాపించును.

**మనస్సు :** ఉత్సాహాదులు క్రుంగుట, దేనిని జ్ఞాపకముంచుకోలేడు, వ్రాతలలో తప్పులు దొర్లుట, వర్ణక్రమ లోపాలు, ముఖ్యంగా సన్నిహితంగా వుంటూ తెలిసినవారి పేర్లు కూడా జ్ఞాపకం లేకుండుట, పరుండగోరును.

**తల:** పైత్యం ప్రకోపించే తలనొప్పి, తలత్రిప్పుట, ధనారింపుగనుండు తలనొప్పి, కుడివైపు అధికంగా వుండును. ఆరుబయట గాలిలో తీవ్రంగా వుండుట, కపాలం కప్పియుండు కేశములగల చర్మము నొప్పితో వుండుట. కేశములలో (వెంట్రుకలు) నొప్పి యుండును.

**కన్నులు :** కండ్లు ఎర్రగా వుండును. రక్తం అధికంగా కూడుట మంట, భారంగా వుండుట, కుడిభాగం కనుగ్రుడ్డు నొక్కినట్టు నొప్పి వుండును.

**చెవులు :** చెవులలో తేనెటీగలు కుట్టినట్లు నొప్పి, శబ్దం వుండును. పక్షిరెక్క ఈక చెవులలో పెట్టిన ఏ విధంగా చక్కిలిగింతగా వుండునో అదేలాగ వుండును. నోరు తెరచిన వ్యాధి ఉధృతంగా వుండును.

**ముక్కు :** ముక్కునుంచి నీరులాగా కారుచుండును.

**నోరు :** నోటిలో క్రుళ్లిన వాసన రుచి వుండును. దాహం వుండదు. నోటిలో జిగటగ చేదుగా వుండును. నాలుక నొప్పి, మంట నోటిలో వేడినోరు కాలునట్లుండును. నాలుక మధ్యలో ఉబ్బినట్లుండుట, లాలాజలం ఉప్పగా వుండును. ఆహారం, నీరు మ్రింగుట కష్టంగా వుండును. కొంతకాలం దాహం వుండుట, మరికొంతకాలం దాహం ఉండకపోవుట, లక్షణాలు ఉండును. చేదుగాని అరుచిగాని యుండును.

**గొంతుక :** ఎడమవైపు గొంతుక నొప్పి యుండును.

**ఉదరము :** ఉదరకుహరమందు అప్పుడప్పుడు బరువుగా నుండి వాయువును తేన్పుటగాని అపానవాయువుగాని వదలుటచే ఉపశమించును. గుండెలో మంట అజీర్ణంచే నోటియందు అమితంగా నీరు వూరుట, కడుపులో నులివేయుచున్నట్లు నొప్పి యుండును.

**మలము, విరేచనాలు :** మలవిసర్జన అసంతృప్తిగా నుండుట, మలం గట్టిగా కొద్దికొద్దిగా వచ్చుట, మలబద్ధం, సాధారణ మలవిసర్జన విస్తారంగా వచ్చుట, మృదువుగా ఉండుట, ప్రేగులలో మంట నొప్పి ఉండును.

**జననేంద్రియ విధానం :** (పురుషులు) పురుషులలో జననేంద్రియోద్రేకం, మూత్రం కొంచెం కొంచెం విసర్జించుట. మూత్రం రంగు మారుట, ఘాటైన దుర్వాసనతో విసర్జించును. శ్వాసావయవము(శ్వాస సంబంధించిన భాగం) స్నానం చేసిన తదనంతరం మధ్యాహ్నం 1 గంట ప్రాంతంలో దగ్గుతో వ్యాధి ఉధృతం చెందును. కల్లి తెల్లగ, జిగటగ చిన్నచిన్న ఉండలులాగా వుండును. అతికష్టం పైన కల్లి బయటకు వచ్చును.

**కాళ్లు, చేతులు :** కాళ్లు, చేతులు తిమ్మెరులుగా వుండును. చేతులు, అరికాళ్లు మంటలు, కాళ్లకు వాతం నొప్పులు వచ్చి బాధగా వుండును.

**నిద్ర మరియు కలలు :** నిద్ర రాకపోవుటవలన పడకలో ఆందోళనకరంగా వుండును. జగడము, కొట్లాడుకొనుట కొట్టుకొంటూ యున్నట్లు మొదలగునవి కలలు వచ్చును. ఇవి అర్ధరాత్రి తరువాత వచ్చును.

**చర్మం :** దద్దులులేకుండా దురద వుండును. కుష్టు, గజ్జి, దీర్ఘకాలపుండ్లు, కురుపులు,

అపాయకరమగు బిళ్లలవాపు, విషపు పుండ్లకు చక్కగా పనిచేయును.

జ్వరం : దీర్ఘకాలికంగాయుండు జ్వరాలు, చలివుండని, లేకపోని సాయంత్రం 4.30 గం.నుంచి 7.30 గంటల వరకు యుండి తగ్గును. చెమటలు ముఖ్యంగా నుదుటిమీద, మెడమీద, శరీరోర్ధ్వభాగంమీద, విస్తారంగా పట్టును. చెమటలు దుర్వాసనగావుండును. శరీరం క్రిందిభాగం చెమటలు పట్టదు. ఆరుబయట గాలియందును మధ్యాహ్నమందు రోగి బాధలధికమగును.

ఈ మందు భారతదేశంలో అతిప్రసిద్ధి చెందిన వేపచెట్టు నుంచి తయారు చేయుదురు. ఈ మందు గుణాలను కలకత్తా వాస్తవ్యుడు డాక్టర్ పి.సి.ముజుందార్, హోమియోపతి పద్ధతిద్వారా రుజువు చేసెను.

## 12. బ్లాటఒరియంటాలిస్ (BLATA ORIENTALIS)

రోగి లక్షణాలు : ఉబ్బసం, శ్వాసకాసం, జలుబుతో కూడిన జ్వరం, శ్వాసనాళంలో అమత్వక్కు వాపు, దగ్గు, ఆయాసం శ్వాస కష్టంగా వుండుట.

శ్వాస మండలం : ఉబ్బసం శ్వాసనాళంనకు సంబంధించిన వ్యాధి. ఆయాసం, శ్వాస కష్టంగా వుండుట లక్షణాలకు అద్భుతంగా పనిచేయును. తరుణ వ్యాధిలో తక్కువశక్తి, దీర్ఘవ్యాధిలో ఎక్కువ శక్తి గల మందును వాడాలి. ఈ లక్షణాలు వర్షాకాలంలో ఉధృతమగునపుడు మేలు చేయును. రోగికి ఊపిరాడకుండా భయోత్పాతం కలిగించునపుడు మేలు చేయును. క్షయరోగి ఆయాసంతో బాధపడుట, దగ్గు వుండునపుడు వాడిన ఉపశమనం కల్గించును. ఈ మందు బొద్దింకనుండి తయారుచేయుదురు. ఈమందును ప్రప్రథమంగా కలకత్తాకు చెందిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ప్రవేశపెట్టి అమలు పరిచెను.

## 13.యెంబెలియారైబ్సు (EMBELIA RIBES)

రోగి లక్షణాలు : చిన్నపిల్లల మందు. క్రిముల నాశనం చేయును. క్రిములచే కలుగు అజీర్ణం, ఉదరం వాయుపూరితమగుట, విరేచనాలు జ్వరం, మూత్రం ఘాటువాసన, రక్తంవలె ఎర్రగా వుండుట, విరేచనాలతో క్రిములు వెడలును.

మనస్సు : రోగి చిరచిరలాడుచుండును. కోపం విసుగునొందుట, మండిపడుట, అస్థిమితం నిత్యం కదలుచుండుట.

ముక్కు : ముక్కులో నవ్వ దురద ఉన్నంట్లుండును. సన్నని ముళ్ల గ్రుచ్చుకొనునట్లుండును.

నోరు : నాలుక పొడిగా వుండును. దంతాలు కొరకుకొనును.

కడుపు : జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బరించుట, విరేచనాలు, అజీర్ణం, వికారం వాంతి చేసికొనగోరును. భుజించిన వెంటనే అతిగా ఆకలివుండును.

మలాశయం : మలాశయంలో దురద అజీర్ణం వలన మలం ద్వారా క్రిములుండును.

మూత్రం : మూత్రం రక్తపురంగు వుండును. కారంగా తీవ్రంగా వుండును.

నిద్ర : నిద్రపోవునపుడు గట్టిగా, బిగ్గరగా కేకపెట్టును. నిద్రకు అంతరాయం ఏర్పడును.

జ్వరం: ఉదయం 101-103$^0$ F జ్వరం వచ్చును. ఈ మందును వాయు విడంగములు గింజల నుంచి తయారు చేయుదురు.

## 14. ఎకైరాన్తెస్ ఎస్పెరిలిస్ (ACHYRANTHES ASPERALIN)

రోగి లక్షణాలు : వగరుగా వుండుట,నాళములను దగ్గరకు ముడుచుకొనునట్లు చేసి స్రావముల నాపుచేయును. విరేచనాలు మూత్రం అధికమగునట్లు చేయును. గ్రహిణి రక్తవిరేచనాలు ఋతుస్రావం అత్యధికంగా స్రవించుట, కుక్క, పాముకాటువలన కలుగు చెడు లక్షణాలకు పనిచేయును.

ఉదరమునకు సంబంధించిన లక్షణాలు : కలరా, విరేచనాల తరుణ వ్యాధికిని "విరేచనాలు పచ్చగా పొరలు పొరలుగా నీరులాగా విస్తారంగా ప్రవహించుట. అతిగా దాహం తరచుగా కొద్ది కొద్దిగా నీరు త్రాగును. నీరుకూడా వాంతి చేసుకొనును. కడుపులో నొప్పి వికారము వాంతి యగుట, కడుపులో మంట, మూత్రవిసర్జనకు అంతరాయం ఏర్పడుట, నాడిదౌర్బల్యం చెందుట, తలత్రిప్పుట.

చర్మము: గడ్డలు, కురుపులు కుళ్ళుపుండ్లు విషసంబంధమగు పుండ్లయందును, రాచపుండ్లు, పాము, కుక్కకాటుకు మేలుచేయును. ప్రేగులలోని క్రిములు మూలశంకకు ఉపయోగపడును. ఈ మందును పైకి, లోపలికి వాడాలి. ఈ మందును అపమార్గం, ఉత్తరేణి మూలికనుంచి తయారు చేయుదురు. డాక్టర్ఎస్.సి.ఘోస్ ప్రప్రథమంగా ప్రయోగించి రుజువు చేసెను.

## 15. ఎవెన సతివా (AVENA SATIVA)

రోగి లక్షణాలు : మానసిక పరిశ్రమలు చేయువారు, మానసికంగా గ్లాని, నరాల దౌర్బల్యం, రక్తప్రసారం బలహీనంగా వుండుట, మూత్రంలో ఫాస్ఫేట్ వున్నవారికి, కపాలం వెనుకభాగం తలనొప్పి నిద్రలేమికి, నపుంసకత్వం, జననేంద్రియ లోపం, హస్తప్రయోగంవలన కలుగు దౌర్బల్యానికి, స్త్రీలకు ఋతుసమయంలో మంటతో తలనొప్పిరావటం, పొగాకు, నల్లమందు మార్ఫిన్, మత్తుపానీయాలు తీసుకొనే అలవాటుకలవారికి, విరుగుడుగా పనిచేయును. మూర్ఛ పక్షవాయువు, వాత సంబంధమగు గుండెవ్యాధులు, జలుబు తరుణవ్యాధికి మేలుచేయును.

మనస్సు : ఏ విషయందును మానసిక దౌర్బల్యం వుండును.

తల : ఋతుసమయంలో నరాలకు సంబంధించి తలనొప్పి, తలపై మంటతో నొప్పి, మూత్రంలో ఫాస్ఫేటులుండుటవలన కపాలం వెనుకభాగం తలనొప్పి వుండును.

స్త్రీలు : రక్తస్రావం బలహీనంగా వుండుటవలన ఋతుశూల, ఋతుస్రావం అగుపడకపోవుట, లేక అణగారుట వుండును.

పురుషులు : నపుంసకత్వం, శుక్రనష్టం, నిద్రలో శుక్రం స్ఖలనమగుట, శుక్రం తెలియకుండాపోవుట, తీవ్ర జననేంద్రియ లోలత తదనంతరం కలుగు వ్యాధులకు పనిచేయును.

కాళ్ళు, చేతులు : చేతుల బలం కోల్పోవుట, కాళ్ళు చేతులు తిమ్మెరగా వుండును. సవాయివలన మెదడు వ్యాధిగ్రస్తమై మానసిక శక్తులు శిథిలమగుట ఈ వ్యాధి త్వరగాగాని, మెల్లగాగాని కలుగవచ్చును. జ్ఞాపకశక్తి పోవుట, ప్రథమచిహ్నం, తాను గొప్పవాడినని భావించును. మానసిక మార్పులు వణుకు, మూర్ఛవంటి పొర్లు కనుపాపలందు మార్పులు కలుగును. పక్షవాత స్థితి క్రమంగా వృద్ధిచెందును. ఈ మందు Oatఅను ధాన్యపు మొక్కనుంచి తయారుచేయుదురు.

## 16. బ్లుమెయో ఒడొరాట (BLUMEA ODORATA)

రోగి లక్షణాలు : దగ్గు, జ్వరము, రక్తస్రావం, స్వరం బొంగురుపోవుట.

రక్తస్రావం : రక్తస్రావంగల మూలశంక, గ్రహిణి, విరేచనాలలో రక్తస్రావం వుండును. విస్తారమగు రక్తస్రావంవలన గర్భపతనం యోనినుంచి రక్తస్రావం కలుగుట, తెల్లబట్ట అగుట, రక్తస్రావమునకు సంబంధించిన వ్యాధులలో శక్తివంతంగా పనిచేయును.

జ్వరము : రోజు విడిచి రోజు వచ్చు జ్వరం, ప్రతి మూడవ రోజు వచ్చు జ్వరాలకు పనిచేయును.

దగ్గు : స్వరం బొంగురుపోవునంతటి దగ్గు దగ్గును. అదుపు చేయుటలో మంచి మందు పెద్దగా శబ్దంతో గురగుర మొరుగు దగ్గులకు అద్భుతంగా పనిచేయును.

ఈ మందు కుక్కిమ అను వృక్షం మంచి తయారుచేయుదురు. దీని ఆకులు పొగాకును పోలియుండును. డాక్టర్ ఎన్.ఎం.చౌదరి, తన శిష్యబృందం ద్వారా కలకత్తాలో పరీక్షించి రుజువు చేయడం జరిగింది.

## 17. బొరావియా డిఫ్యూస (BOERHAVIA DIFFUSA)

**రోగి లక్షణాలు :** ఉబ్బసము, బెరిబెరి (నంజువ్యాధి), రక్తపుపోటు, వంటికి నీరుపట్టి ఉబ్బుట, కామెర్లు, గనేరియా, గుండెజబ్బులు, విషపురుగుల కాట్లకు మొదలగు వాటికి పనిచేయును.

**తల :** కుడిభాగం తలనొప్పి సహించలేనంతగా వుండును. చల్లని తడిబట్టవలన ఉపశాంతి కలుగును. తల(తిప్పుట.

**దగ్గు :** పొడి దగ్గుతో జలుబు కఫ్ఫి తెల్లగా జిగటగవచ్చును.

**గుండె :** తరచుగా గుండె కొట్టుకొనుట, విడిచి విడిచి ధనారింపు శబ్దంతో గుండె కొట్టుకొంటూ నొప్పియుండును.

**కాలేయము :** కాలేయమునకు సంబంధించిన వ్యాధులు, కాలేయం గట్టిపడి చిన్నదగుట లేక పెద్దదగుటవలన వికారం, వాంతులు, రక్తపు వాంతులు, రక్తవిరేచనాలు, కామెర్లు, స్ప్లీన్ పెద్దదగుట,అరుచి మొదలగు లక్షణాలపై పనిచేయును. వర్షాకాలంలో సంభవించు నంజువ్యాధులకు మేలు చేయును.

**ఉబ్బుట :** కనురెప్పలు ఉబ్బుట, చేతులు, ఉదరము, కాళ్ళు, పాదాలు ఉబ్బును. బరువుగా నుండును.

**మూత్రావయవములు :** మూత్రం రంగుగాను, మూత్రవిసర్జన కష్టంగా చుక్కలు చుక్కలుగా బాధతో విసర్జించుట, మూత్రోత్పత్తిని అధికంచేయు స్వభావం కలదు. నొప్పి, శరీరమంతా వాతనొప్పులు కలిగియుండును. మూత్రం అధికంగా విసర్జించునట్లు చేసి ఉబ్బును తగ్గించును. ఈ మందును కుష్టువ్యాధి, పాము, పిచ్చికుక్క, తేలు మొదలగు విషజంతువుల కాట్లకు, రక్తక్షీణతకు మొదలగు వ్యాధులకు ఈ మందును ఆయుర్వేద వైద్యులు సాధారణంగా వాడుచుందురు. ఈ మందును పునర్నవ గలిజేరు మూలిక నుంచి తయారుచేయుదురు. ఈ గలిజేరు మూడురకాలుగా వుండును. తెల్లపుష్పములు గలవి. ఎఱ్ఱపుష్పములు గలవి, నీలి పుష్పములుగలవి వుండును.డాక్టర్ అఘోర్‌చంద్ర భాదుడీ, 1898లో పలువురు తన శిష్యవర్గం పరీక్షించడం జరిగింది.

## 18. బొరావియా-రిపెన్స్ (BOERRHAVIA REPENS)

బొరావియా డిఫ్యూస మందు మాదిరిగా అన్నిరోగాలకు సంబంధించిన లక్షణాలపై ఉప యోగపడును. ఈ మందు తెల్లని పుష్పములుగల గలిజేరు లేకపునర్నవ నుంచి తయారుచేయుదురు.

## 19. సిసాల్ పెనియా బాండుసెలా-క్వినియా ఇండిక

## (CEASALPANIA-BONDUSILLA or QUNIA INDICA)

**రోగి లక్షణాలు :** జ్వరము, తలనొప్పి మొదలగు లక్షణాలపై పనిచేయును.

**మనస్సు :** మానసికంగా కృంగుట, ఉత్సాహాదులు నశించుట.

**తల :** తలనొప్పి ఉధృతంగా వుండును. కప్పుకొనుటగాని, అదుముటవలనగాని తగ్గును.

**కన్నులు :** జ్వరం సంభవించునపుడుగాని, ముందుగగాని, కన్నులు మంటనొప్పితో వుండును. చల్లనిది అంటించిన ఉపశమనం కలుగును.

**నాలుక :** నాలుకపై తెల్లని పూత, నాలుక తడిగా తెల్లగా రక్తక్షీణత కలిగివుండును. చల్లనిది అంటించిన ఉపశమనం కలుగును.

**ఉదరము, కడుపు :** పొత్తికడుపులో నీటిప్రవాహంగల శబ్దం వచ్చును. కాలేయము. స్ప్లీన్ ఉబ్బి సాగినట్లుండుట, తాకిన నొప్పి కలుగును. ఉడకబెట్టిన బియ్యం, మాంసము గట్టి పదార్థాలపై కోరిక ద్రవపదార్థాలపై అయిష్టత వుండును.

**మలము :** గట్టిగా, కుంకుమ పువ్వురంగుగాను, లేదా మలము పసుపురంగుతో ద్రవంలాగా వచ్చును.

**జ్వరం** : క్రమంగా వచ్చును. జ్వరం చలి వణుకుతో రావడం, మరొకదినం తేలికపాటి చలితో జ్వరం వచ్చును. జ్వరం ఉదయం 8 నుంచి 10 గంటలవరకును, సాయంత్రం 2 నుంచి 4 గంటవరకు వచ్చును. విడుపు జ్వరం మధ్యాహ్నం వచ్చును. దాహం వుండదు. మరల జ్వరం ఉదయంపూట వచ్చిన దాహం ఉష్ణం ఉండును. ముఖం ఎర్రబడును. శ్వాస వేడిగా వుండును. శ్వాస పీల్చుటకు ఆత్రం ఎక్కువగా వుండును. జ్వరం తగ్గిపోయిన తదనంతరం రోగి చాలా నిస్త్రాణగాను, బలహీనంగా వుండును. ఏ పనిచేయలేని స్థితిలో వుంటూ మాట్లాడుటకూడా కష్టంగా వుండును. కండ్లు మూసుకొని నిద్రావస్థలో వుండునట్లుండును. ముఖంపై తాత్కాలికంగా చెమట బిందువులు, మెడ భుజాలు ఛాతీపైన చెమటలు పట్టును.

**చర్మము** : పొడిగా, అసహ్యంగా దోమకాట్లులాగ చిన్నచిన్న దద్దులు వుండును.

**వీపు వెనుకవైపు** : చల్లనీళ్ళు స్నానం చేసిన తదనంతరం వీపు వెనుకవైపు లాగునట్లు నొప్పి వుండును.

ఈ మందు కుబేరాక్షి, నాటా కంతకరంజ నుంచి తయారుచేయుదురు. డాక్టర్ కె.కె.భట్టాచార్జీ మొదటిసారిగా ఈ మందును రుజువుచేసెను.

## 20. జెంటియాన చిరాట (చిరాట) (GENTIANA CHIRATA)

**రోగి లక్షణాలు** : జ్వరాన్ని తగ్గించును. అజీర్ణం, అగ్నిమాంద్యం, మలేరియా జీర్ణించుటచే కాలేయ, ప్లీహములు పెద్దవగును. దీర్ఘకాలికంగా వుండు జ్వరాలు, జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బరించును. ఆమ్లము అధికంగా వుండును.

**మనస్సు** : మందబుద్ధిగా నుండును. పరుండగోరును.

**తల** : తల చల్లగా వుండును. కణతలలో నొప్పి, క్రమక్రమంగా తల అంతటికి వ్యాపించును.

**ముక్కు, కండ్లు** : కండ్లలో మంటలుండును. ముక్కు రంధ్రంనుంచి వేడిగా నీరుకారుట, ముక్కులో ఎర్రగా వుండును.

**చెవి** : చెవిలో బుసకొట్టినట్లు శబ్దం వుండును.

**నోరు** : ఉదయంపూట నోటిలో చెడురుచిగా వుండును. దుర్వాసన వచ్చును.

**నాలుక** : నాలుకపై పసుపుపచ్చరంగు పూత కలిగియుండును. నాలుక భారంగా వుంటూ మాట్లాడుటకు కష్టంగా వుండును.

**ఉదరము** : జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బరించుట, కాలేయము, స్లీన్ ఉబ్బి సాగినట్లుండుటవల్ల నొప్పితో బాధవుండును. మూత్రపిండాల కుడిభాగంలో నొప్పి, వెన్న, నెయ్యి, మాంసాహారములపై కోరిక వుండును.

**పురుష జననేంద్రియాలు** : జననేంద్రియోద్రేకత బలహీనంగా వుండును. స్వల్పంగా శుక్రము విసర్జించును.

**కాళ్లు, చేతులు** : కాళ్ళు, చేతులు, నొప్పులతో బాధపడును. కాళ్ళు బలహీనంగా వుండును. నడచుటకు చాలా కష్టంగా వుండును.

**జ్వరం** : చలి వికారము పైత్యపు వాంతులుండును. ఆఖరిదశలో 3 నుంచి 4 గంటలవరకు వేడి వుండును. చెమటలు కనపడును. చలి తదనంతరం వేడినీటిని కోరును. దీర్ఘకాలిక జ్వరాలకు అద్భుతంగా పనిచేయును.

జ్వరంతో వుండు ఏ సమయమైనా కనపడవచ్చును. ఇందులో సాధారణంగా మధ్యాహ్నం వచ్చును. జ్వరం అనంతరం కలుగు నిస్త్రాణకు ఈ మందు మేలుచేయును. ఈ మందు కిరాత తిక్త, సీమనేల, వేము మూలిక నుంచి తయారుచేయుదురు.

డాక్టర్ కలికుమార్ భట్టాచార్య (అస్సామ్) 1925లో ఈ మందును పరీక్షించి అమలుపరిచెను.

## 21. కలోట్రోపిస్ జైగాంటియా (CALOTROPIS GIGANTIA) :

**రోగి లక్షణాలు :** ఉబ్బసరోగము, ఉదరకుహరమునకు నీరుపట్టుట, దగ్గు, జలుబు, ఏనుగుకాలు దీర్ఘకాలికంగా వుండు వాతనొప్పులు, విరేచనాలు, గ్రహిణి క్షయవ్యాధితో, ఊపిరితిత్తుల వాపు, పాము, విషపు పురుగుల కాట్లు, కుష్టు, ప్రేగులలో క్రిములుండుట, చర్మవ్యాధులు సవాయి (సిఫిలిస్).

**మనస్సు :** ఉత్సాహాదులు కృంగి విచారంగా వుండును. అలసట చెందినట్లు భావించును. విశ్రాంతి లేకుండును.

**తల :** తలత్రిప్పు, ఉదయం 11 నుంచి కపాలం వెనుకభాగం తలనొప్పివలన మందబుద్ధి వుండుట, తల వేడిగానుండును. ధనారింపుగ నొప్పి వుండుటవలన ఒకదానిని మరియొకదానిగా భావించును. మూర్ఛ తల తిరుగుటవలన వాంతితో వాలును.

**ముఖము :** ముఖము వేడి, దవుడ, చెంప మంటగా కాలునట్లుండును. గొంతు, పెదవులు పొడిగా ఆర్చుకొనిపోవును.

**నోరు :** దుర్వాసన దవుడలు కదలికవలన నొప్పి నోరు పుండులాగ వుండును.

**కడుపు :** ఎడతెగని తేన్పులుండును.

**మూత్రావయవములు :** తరచుగా మూత్రవిసర్జన మూత్రం నల్లగా ఎర్రగా విసర్జించును. వాసన ఘాటుగా వుండును.

**శ్వాససంబంధమైన వ్యాధి :** ఛాతీ భారంగా వుండును. ఆయాసము శ్వాస త్వరితముగా నుండును.

**నాడి :** నాడి వేగముగా వడిగా వుండును.

**చేతులు :** మణికట్టు కీళ్ళలో నొప్పి కదలికవలన ఉద్రేకము చెందును. కుడిచేయి అరచేతి కేంద్రంలో కండరాలు అధికబాధతో ముడవలాగుకొని పోవునట్లు నొప్పి, కొద్దిరోజులుగా గట్టిగా పట్టుకొనునట్లుండు నొప్పి.

**కాళ్ళు :** అడుగువేసినప్పుడల్లా కుడితొడలో నొప్పి, గజ్జ క్రిందిభాగంలో పుండులాగ వాపుతో నొప్పి వుండును. ఎడమకాలు పాదంలో ముడుచుకొని పట్టుకొన్నట్లు నొప్పి, పడకలో బలవంతంగా ఎల్లపుడు కదలించుచుండును. విశ్రాంతివలన నొప్పి ఉద్రేకం చెందును. కాని వ్యాధి లక్షణాలు ప్రకోపనం చెందుటవలన కన్నులు నొప్పిగా వుండును. కాఫీ త్రాగుటవలన నొప్పి ఉపశమనం చేకూరును.

**జ్వరం :** తరచుగా చలి వెన్నెముక ద్వారా పైకి ప్రసారం జరుగును. తల వేడి శరీరం చల్లగా వుండును. చెంపలు, దవుడలు మంట కాలినట్లుండును. పడకయందు మంట చల్లారిన చలి మరల వచ్చును. మూర్ఛవలన చెమటలు తదనంతరం పిరుదులు చలితో వుండును. శరీరంలో చీము కూడుటచే కలుగు జ్వరం క్షయజ్వరం విరేచనాలతో కూడిన జ్వరం పైత్యాధిక్యతచే కలుగు జ్వరం, సవాయివలన కలుగు జ్వరం స్ఫోటకం వ్యాధివల్ల కలుగు జ్వరాలకు గొప్ప మందు. రేచీకటి అంధత్వం మొదలగు కంటిజబ్బులకు మేలు చేయును.

**చర్మము :** అన్నిరకాల పుండ్లు కుష్టు ధాతువులు క్రుళ్ళునట్టి గాంగ్రేను సంబంధమగు పుండ్లకు ఈ మందు అద్భుతంగా పనిచేయును. సవాయి పుండ్లు, పిప్పిపళ్ళకు వాడవచ్చును. గోళ్ళు చివర దళసరి ఏర్పడి ముదిరిన సవాయికి మేలు చేయును. ఈ మందును మూలికా సంబంధమగు పాదరసమని పిలుచుట కలదు. మూలశంకను కూడా కుదుర్చును.

ఈ మందు జిల్లేడు, అర్క, అను చెట్టు నుంచి తయారుచేయుదురు. తెల్లజిల్లేడు, ఎర్రజిల్లేడు రెండు రకాలుండును. ఈ రెండు గుణాలు సమానంగా వుండును. 1872లో డబ్లిన్ వాస్తవ్యుడగు ఇ.బి.యువాట్సు దీని గుణాలను ప్రప్రథమంగా నిరూపించెను.

## 22. కలోట్రోపి సులాక్టం (CALOTROPIS LACTUM)

విరేచనాలు, వాంతులు, పంటినొప్పి, ప్లీహము పెద్దదగుట, కంటివ్యాధులు, చర్మవ్యాధులు విజయవంతంగా నివారించవచ్చును. 'కలోట్రోపిస్ జైగాంటియా' మందుకు లొంగని కేసులు, లక్షణాలు ఈ మందుకు లొంగును.

ఈ మందును జిల్లేడు పాలనుంచి తయారుచేయుదురు.

## 23. కారిక పాపయ (CARICA PAPAYA)

**రోగి లక్షణాలు** : అజీర్ణ వ్యాధులు, గర్భపతనము, కంటి కలక, కాలేయ ప్లీహములు పెద్దవగుట, గర్భకోశానికి సంబంధించిన వ్యాధులు.

**కడుపు ప్రేగులకు సంబంధించిన లక్షణాలు** : కాలేయ ప్లీహములు పెద్దవగుటవలన వచ్చు జ్వరాలు, నీరసంగా వుండువారల, అజీర్ణమునకును, అజీర్ణ విరేచనాలు కొద్దికొద్దిగా రోజుకు పలుసార్లు అగుచుండును. నాలుకపై తెల్లనిపూత యుండును. ఈ రోగికి పాలుపడవు. మాంసము, పాలను కొలదిగా వాడినను కాలేయ ప్లీహములో నొప్పి, అజీర్ణము కలుగును.

కన్నులు : కంటియొక్క అమత్వక్కు సహజమైన రంగుమారి పచ్చగా వుండును.

**స్త్రీ జననేంద్రియాలు** : ఋతుదోషాలను పోగొట్టును. ఇది గర్భపతనమునకు మేలుచేయును. స్తన్యపానమును వృద్ధిచేయును. రక్తస్రావముగల మూలశంకకును, ప్రేగులలో క్రిములకు ఉపయోగపడును. ఈ మందు బొప్పాయి, పరంగి, మదనానపచెట్టు నుంచి తయారుచేయుదురు. డాక్టర్ డి.ఎన్.రే. కలకత్తా వాస్తవ్యుడు ప్రప్రథమంగా పరీక్షించి అమలుపరిచెను.

## 24. క్లెరొడెన్డ్రాన్ ఇన్‌ఫార్ట్యునేటం (CLERODENDRON INFORTUNATUM)

**రోగి లక్షణాలు** : జీర్ణకోశ సంబంధమైన వ్యాధులు.

కడుపుకు, ప్రేగులకు సంబంధించిన లక్షణాలు : వికారంతో వుండు విరేచనాలకు గొప్ప మందు. క్రిములతో నీళ్ల విరేచనాలు, విరేచనాల రంగు పసుపుగాను, నురుగుగా నుండును. గ్రహిణి క్రిములచే కలుగు శూలకు అద్భుతంగా పనిచేయును. ప్రేగులలోని క్రిములు నిర్మూలించవచ్చును. మలబద్ధం పోగొట్టును. నోటినుంచి నీరు ఊరుచుండును. చిన్నపిల్లల వ్యాధులకు మేలుచేయును.

**జ్వరం** : మలేరియా జ్వరాలు, దీర్ఘకాలికంగా వుండు జ్వరాలకు ముఖ్యౌషధము. కాలేయ ప్లీహము పెద్దవగుట, మధ్యాహ్నం తేలికరకమగు జ్వరం వచ్చును. కండ్లు, ముఖం మంటగా నుండును. ఆకలి యుండదు. ఎలాంటి ఆహారమైనను తినాలని కోరిక ఉండదు. వికారం ముఖ్య లక్షణము (ఇపెకాక్). ఈ మందును గుంటకర్ణమొక్క నుంచి తయారుచేయుదురు.

## 25. సెఫలాండ్ర ఇండిక (CEPHALANDRA INDICA)

**రోగి లక్షణాలు** : అతిమూత్రము, మధుమూత్రము, చర్మవ్యాధులు, కామెర్లు, పురాణ మలేరియా జ్వరాలు, ఉబ్బురోగము మొదలగు లక్షణాలపై పనిచేయును.

**మనస్సు** : చిరచిరలాడుట, కోపముతో మండిపడుట, ఏ పనిచేయుటకు యిష్టముండదు. చింత చేయుచుండును. విచారంగా వుండును. జ్ఞాపకశక్తి నశించుట, శారీరకంగా, మానసికంగా సహనశక్తి ఏమాత్రం లేకపోవుటను.

**తల** : మూత్ర విసర్జనానంతరం తల తిరుగుట, బలహీనంగా వుండును.

**కన్నులు**: కండ్లు మండుచున్నట్లుండును.

**ముఖము** : ముఖం మంటగా వుండును.

**నోరు :** దాహం అమితంగా వుండుటతో నోరు చాలా పొడిగా వుండును. దాహంతో అతిగా నీరు త్రాగుచుండును.

**గొంతు :** గొంతు పొడిగా ఆర్చుకొని పోయినట్లుండును.

**ఆకలి :** ఆకలి లేకపోవుట.

**ఉదరము :** ఉదరము వాయుపూరితమై ఉబ్బును.

**మూత్రము :** మూత్రం విస్తారంగా విసర్జించుట. మూత్ర విసర్జనానంతరం బలహీనత, నీరసము ఏర్పడును. మూత్రంలో చక్కెర (సుగర్) వుండును. అతిమూత్రం, మధుమూత్రంగల వ్యాధులకు పనిచేయును.

**మలము :** మలం ఆకుపచ్చరంగుతో వచ్చును. మల విసర్జన ముందుగాని, మలం విసర్జించునపుడుగాని నొప్పి, తెలికపాటి రంగుతో రక్తం వచ్చును.

**మంట :** శరీరమంతయు మంటగా వుండును. కాళ్ళు, చేతులు, ముఖము మండుచుండును.

**నాడి :** బలహీనంగా వుండును. విడిచి విడిచి వచ్చు దీర్ఘకాలికంగా వుండు మలేరియా జ్వరాలకు ఉపయోగపడును. డాక్టర్ ఎస్.సి.ఘోష్ ఈ మందును ప్రప్రథమంగా రుజువుచేసెను. ఈ మందును కాకిదొండపాదు (దొండ) కందూరి చెట్టునుంచి తయారుచేయుదురు.

## 26. కొలియస్ ఆరోమాటికస్ (COLEOUS AROMATICUS)

**రోగి లక్షణాలు :** సెగవ్యాధి (గనేరియా) మూత్రావయపమునకు సంబంధించిన వ్యాధులు.

జననేంద్రియాలు, మూత్రావయముల వద్దతి : మూత్రవిసర్జన బాధగానుండి చుక్కలుచుక్కలుగా నగుట. మూత్రకోశపు వ్యాధిచే మూత్రోత్పత్తి అణగారుట. గనేరియా (సెగ) వ్యాధితో వున్న రోగి మూత్రం విసర్జించునపుడుగాని, మూత్ర విసర్జనానంతరంగాని మంటగా నుండును. మూత్రకోశం వాపుతో వుండును. మూత్రం బంధింపబడును. కుడిమూత్ర పిండంలో నొప్పి, మధుమూత్రము మూత్రం రక్తంతో వుండును. మూత్రపిండాలలో రాళ్ళు, మూత్రంలో రాళ్ళుపడుట, మూలశంక, అజీర్ణం, దగ్గు, ఉబ్బసానికి ఈ మందు మేలు చేయును. ఏ వ్యాధిలోనైనా మూత్రం బంధించిన మేలు చేయును.

ఈ మందును పాషాణభేధి తెలకపిండి చెట్టు ఆకుల రసంనుంచి తయారుచేయుదురు.

## 27. కొలియస్ మాలావారికస్ (COLEOUS MALAVARICUS)

మాలావార్ అను మూలిక భారతదేశం తూర్పుభాగంలోను కొలియస్ స్కూటిలైరియా యడస్ మధ్యప్రదేశ్‌లోను పెరుగును. ఈ రెండు మందులు ఆమాశయము పాకాశయంనకు గడబిడ కలిగినపుడు పనిచేయును.

## 28. సైనొడాన్ డక్టైలాన్ (CYNODON DACTYLON)

**రోగి లక్షణాలు :** రక్తస్రావములు, గ్రహిణి, వంటికి నీరుపట్టి ఉబ్బుట, కుసుమ (తెల్లబట్ట)

**రక్తస్రావములు :** జీర్ణకోశం నుంచి రక్తం వాంతియగుట తగ్గునపుడు ఊపిరితిత్తుల నుంచి రక్తం వచ్చును. ముక్కునుంచి రక్తం కారుట, గాయాలు తగిలిన, తెగిన కలుగు రక్తస్రావాలు మూలశంకలో కలుగు రక్తస్రావాలకు సైనొడాన్ శాశ్వత నివారణ కలిగించును. స్త్రీ గర్భకోశం నుంచి రక్తం స్రవించును.

**మూత్రావయవములకు సంబంధించిన వ్యాధి :** మూత్రం బంధించుట, అణగారుట, మూత్రకోశంలో రాళ్ళవంటివి ఏర్పడుట సవాయి వ్యాధికి మేలు చేయును.

**కన్ను :** కండ్లయొక్క అమత్వక్కు వాపు, కండ్లకలక సంభవించునపుడు పనిచేయును.

**కడుపు :** ఉదరమునకు సంబంధించిన లక్షణాలు దీర్ఘకాలికంగా యుండు విరేచనాలు వంటికి నీరుపట్టి (ఉబ్బు వ్యాధి) పైత్యాధికతచే కలుగు వాంతులు.

చర్మము : చిడుము, గజ్జి, రాచపుండ్లు అన్నిరకాల గాయాలకు ఉపయోగించుదురు.

ఈ మందును దర్భగడ్డి, గరిక గడ్డి నుంచి తయారుచేయుదురు.

## 29. డెస్మోడియం గాంజెటికం (DESMODIUM GANGETICUM)

రోగి లక్షణాలు : జ్వరం, తలనొప్పి, మెదడు, వెన్నుపాములను చుట్టియుండు పొరలవాపు మొదలగు లక్షణాలపై పనిచేయును.

తల : తలను నవారుతో బిగించినట్లుండుటతో తలనొప్పి, మెదడు, వెన్నుపాములను చుట్టియుండు పొరలవాపు.

నొప్పి : శరీరమంత నరాల నొప్పులు, వెన్నుపాము నొప్పితో వుండుటవలన నిటారుగా కూర్చొనలేడు. పాదాలు, చేతులు మండుతూ వుండును. వేడివలన ముఖం ఎర్రగా వుండను.

ఇంద్రియ జ్ఞానములకు సంబంధించిన పనులను చేయునట్టి మెదడునందలి కేంద్రం : నిద్ర లేకపోవుట, స్మారకం లేనట్టి నిద్ర.

జ్వరం : నిద్రమత్తు, విడుపుజ్వరాలు, నిద్రలేకపోవుట జ్వరం ఉదయం 7 గంటలకు చలితోవచ్చి 2, 3 గంటలుండును. జ్వరం ప్రారంభంనుంచి హస్తములు, పాదాలు, ముఖము, కన్నులు మండుచుండును. ముఖం నుంచి వేడి సెగలు కలుగుచుండును. చెమట పట్టుటతో కొద్దిగా జ్వరం తగ్గును. కీళ్ళవాతము, నరాల బాధ ముఖ్యంగా కాళ్ళు, మెడ నొప్పిగా నుండును. వాంతులు, నీరు పట్టుట, పుండ్లు దగ్గర శ్వాసావయ వ్యాధులు, క్రిములు, ఉబ్బసము, అజీర్ణములకు, పాముకాటు, తేలు కుట్టినపుడు మేలు చేయును. కాలపర్ణి, నక్కతోకపొన్న, మయ్యాకుపొన్న చెట్టునుంచి ఈ మందును తయారుచేయుదురు.

డాక్టర్ ఎ.సి.భాదుడి 1898లో తన ముగ్గురు శిష్యులతో ఈ మందును పరీక్షించి అమలుపరిచెను.

## 30. ఫికస్ రెలిజియోస (FICUS RELIGIOSA)

రోగి లక్షణాలు : రక్తస్రావం నుంచి రక్తం పైకి వెడలును. బంధించుట రక్తస్రావంతో కూడిన మూలశంక ముక్కునుంచి రక్తస్రావం ఉండుట, గ్రహిణి రక్తంతో కలిసి వుండుట, దగ్గునపుడు ఊపిరితిత్తులనుంచి రక్తం వచ్చుట, జీర్ణకోశంనుండి రక్తం వాంతియగుట, మూత్రకోశంనుంచి కలుగు రక్తస్రావం విస్తారంగా ఋతుస్రావం కలుగుట, ఋతుసమయం కానపుడు గర్భకోశంనుంచి రక్తస్రావం వుండును. మొదలగు రక్తస్రావాలన్నింటిపైన పనిచేయును.

మనస్సు : కదలుటకు యిష్టంలేకుండును. దుఃఖము అమితంగా కృంగియుండును. విచారంగా వుండుట, శబ్దమును ఏమాత్రం సహించలేకపోవును.

తల : తల త్రిప్పుట, వికారం నడినెత్తిన మంట స్వల్పంగ తలనొప్పితో తల తిరుగును.

నోరు : తెల్లని నాలుకతో లాలాజలం విస్తారంగా వుండును.

ముక్కు : ముక్కునుంచి రక్తస్రావం కలుగును.

కడుపు : ప్రకాశవంతమైన ఎర్రని రక్తం వాంతి చేసికొనుట అన్నిరకాల ఆహారపదార్థాలపైన ఏమాత్రం హితవుకాకపోవుట, అసహ్యించుకొనును. కడుపులో అనారోగ్యంగా వుండునట్లు భావించును.

ఊపిరి పీల్చుకొనుట : శ్వాస పీల్చుకొనుట కష్టంగా వుండును. దగ్గు, అయాసము తగ్గినపుడు ఊపిరితిత్తులనుంచి రక్తం వచ్చును.

మలం, విరేచనాలు : గ్రహిణి విరేచనాలు రక్తస్రావంతో వుండును.

మూత్రావయవములు : మూత్రంలో రక్తం వుండును. తరచుగా మూత్రం విసర్జన చేయును.

స్త్రీ జననేంద్రియాలు : ఋతుస్రావం అమితంగా వుండును. పొత్తికడుపులో క్రిందికి

లాగినట్లుండును. పొత్తికడుపులో నొప్పి, గర్భకోశంనుంచి కలుగు రక్తస్రావాలకు గొప్పగా పనిచేయగల మందు స్త్రీ యోని నుంచి అతి ఎర్రని రక్తస్రావం కలుగును.

ఈ మందును రావిచెట్టు, అశ్వత్థ వృక్షం ఆకులనుంచి తయారుచేయుదురు. డాక్టర్ ఎస్.సి.ఘోష్ (కలకత్తా) ప్రథమంగా పరీక్షించి అమలుపరిచెను.

## 31. ఫికస్ ఇండిక (FICUS INDICA)

**రోగి లక్షణాలు :** రక్తస్రావాలందు ఫికస్ రిలిజియోస కన్న గొప్పగా పనిచేయును. రక్తం అతి ఎర్రగా వుండును. గొంతుకనుంచి నోటినుంచి అతి ఎర్రని రక్తస్రావం కలుగును. కుసుమ రక్తంతో కూడియుండును.

**రక్తస్రావం :** రక్తస్రావాలనాపును, మూలశంక, నోరు, గొంతునుంచి కలుగు రక్తస్రావాల విజయవంతంగా నిలిపివేయును. బహిష్టుకాలమందు మలవిసర్జనకు మందుగాగాని కుసుమ రక్తంతో కూడియుండును.

**మూత్రావయవము :** సెగ (గనేరియా వ్యాధి) మధుమూత్రం నందును తీపు చాలా అధికంగా వుండును. మూత్రం విసర్జించునపుడు మంటగా వుండును. మూత్రకోశం నుంచి రక్తస్రావం కలుగును.

**అంతటకు చెందిన లక్షణాలు :** శుక్ర స్ఖలనంచే కలుగు నాడీమండల నీరసమునకును, రక్తస్రావం విస్తారంగా కలుగుట, తరచూ విరేచనాలు అగుచుండుటతో ప్రేగులు దిగజారును. ఋతువు త్వరగా అగుపడి దీర్ఘకాలంగా వుండును. నపుంసకత్వం, సెగ్గడ్డలు, అన్నిరకాల రక్తస్రావాలకు పనిచేయును. ఈ మందు వట, మర్రి మహావృక్షం నుంచి తయారుచేయుదురు. ఈ వృక్షం ఊడలనుండియు, మొగ్గలనుంచి రసంతీసి తయారుచేయుదురు.

## 32. జినోకార్డియా ఒడొరాటా (చాల్‌మోంగ్రా)

(GYNOCARDIA ODORATA-CHALMONGRA)

కుష్ఠు రెండవదశలో సవాయి (సిఫిలిస్) వ్యాధి కీళ్లవాతము గౌట్ సంబంధించిన నొప్పులు దీర్ఘకాలికంగా వుండు నొప్పులు తెల్లని పొలుసులతో పొడిగ నుండు ఎర్రని మచ్చలుగల చర్మము గరుకుగానుండు దీర్ఘకాలికంగాయుండు చర్మవ్యాధి (సోరియాసిస్) చిన్ననీటి పొక్కులతో కూడిన చర్మవ్యాధి అవి పగిలి పక్కుగట్టును. చీము రసి ఓడును. ఆ ప్రదేశం పక్కుగట్టి పొలుసులువలె యుండును. చిడుము, గజ్జి ఇది అంటు చర్మవ్యాధి. రాత్రులు తీవ్రమగు దురద కలుగుచుండును. ఇది ఒక రకపు సూక్ష్మక్రిములచే కలుగుచున్నది. ఆ సూక్ష్మక్రిమి చర్మము క్రింద గ్రుడ్లు పెట్టుచుండును. ఇది ఒకరినుంచి మరియొకరికి తేలికగా సోకును. ఇతర చర్మవ్యాధులు, దద్దులు, బొబ్బలు, పొక్కులు పేలుట, మశూచి, గజ్జి వ్యాధులకు గొప్పగా మేలు చేయును. ఈ మందు చాల్‌మోంగ్రా చెట్టు విత్తనాలు, రసం నుంచి తయారుచేయుదురు.

## 33. హెమిడెస్మస్ ఇండిక (HEMIDESMUS INDICA)

వివిధరకాల చర్మవ్యాధులు అజీర్ణము ఆకలిలేకపోవుట జ్వరాలకు అమితంగా లాభం చేకూరును. రక్తశుద్ధికీ పనిచేయును. ముదురు రంగుగల మూత్రం కొద్దికొద్దిగా రావటం, మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధి మూత్రంలో రాళ్ళు ఏర్పడుట, పిల్లలకు వచ్చు విరేచనాలు దీర్ఘకాలికంగా వుండు దగ్గులకు అద్భుతంగా పనిచేయును. పాదరసం వలన సంభవించు దద్దులు చిడుము, గజ్జి సంబంధించిన చర్మవ్యాధులకు మేలు చేయును. డాక్టర్ ఇ.జి.బ్రానింగ్, సవాయికి సంబంధించిన చర్మవ్యాధులు, కీళ్ళవాత నొప్పులకు పనిచేయునని సిఫారసు చేసెను. ఈ మందు చెట్టువేరునుంచి తయారుచేయుదురు.

## 34. హైడ్రోకొటైల్ ఏసియాటిక (HYDROCOTYLE ASIATICA)

**రోగి లక్షణాలు :** కామెర్ల వ్యాధికి ముఖ్యౌషధము. కుష్టు, చర్మవ్యాధులు, సవాయి (సిఫిలిస్), సెగ వ్యాధి (గనేరియా), ఉబ్బు, తెల్లబట్ట, ఏనుగుకాళ్ళు, మూత్రమునధికమగునట్లు చేయును. విరేచనాలు కలిగించును. అవయవములకు బలమునిచ్చును. శుక్రనష్టము, నరాల బలహీనత పోగొట్టును.

**మనస్సు :** చింత విచారంగా వుండును. మనుష్య ద్వేషము, వాగుడు, అధికంగా మాట్లాడుట, జ్ఞాపకశక్తి నశించువారలకు మేలు చేయును.

**తల :** అమితశబ్దం తిమిరంతో తలత్రిప్పుట నుదిటికి సంబంధించిన నరాల నొప్పి, కపాల వెనుకభాగం సహించరాని బాధ వుండుటకు మేలు చేయును. ఈ మందు జ్ఞాపకశక్తిని, వృద్ధిని పెంపొందించునని "సుశ్రుత" కనుగొనినట్లు వ్యాఖ్యానించడమైనది.

**కడుపు :** ఆకలి లేకపోవుట, అమితంగా ఆకలివుండుట, పొగాకు పొగ త్రాగడానికి అయిష్టంగా వుండుట.

**మలాశయం :** గుదస్థానంలో మంట, దురద, నవ్వ వుండును. మలాశయంలో బరువుగా వుండును.

**మూత్రావయవము :** తరచుగా మూత్రవిసర్జన చేసేందుకు కోరుట, మూత్రకోశ వ్యాధులు, మూత్రోత్పత్తి అధికమగుటతో మూత్రకోశపు మెడయందు క్షోభం, మూత్రకోశ మెడవాపు, మూత్రము మడ్డిగా వుండును.

**పురుష జననేంద్రియాలు :** శుక్రవాహక నాళాలు లాగుచున్నట్లు నొప్పిగా వుండును. నపుంసకత్వం సంభోగంపై అలక్ష్యంగా వుండుట, వృషణాలు వాపువుండును.

**స్త్రీ జననేంద్రియాలు :** తెల్లబట్ట కుసుమ గర్భకోశంలో, భారంగా వుండుట స్త్రీ బాహ్యజననేంద్రియం యోని స్త్రీ గర్భకోశపు మెడ ఎర్రగా వుండును. గర్భకోశంలో ప్రసవ నొప్పులులాగా తీవ్రంగా వుండును. యోని వేడిగను, దురదగను వుండును.

**శ్వాసమండలము :** స్వరపేటికలు గలభాగం పొడిగానుండును. స్వరం బలహీనంగా వుండును. మాట్లాడుటవలన అలసట కలుగును. శ్వాసనాళం నుంచి కఫ్ఫని ఉమ్మివేయుటకు చాలా కష్టంగా వుండును. ఆయాసంగా వుండును.

**గుండె మరియు నాడులు :** గుండెచుట్టూ నొక్కివేయుట దగ్గరకు ముడుచుకొనిపోవుట, గుండెకు సంబంధించి ఈడ్పులు, గుండె సంకోచం చెందినపుడు విపులీకరించినపుడు కలుగు శబ్దం క్రమంతప్పి పనిచేయును. నాడులు బలంగా, పూర్తిగా, సక్రమంగా పనిచేయులాగా మేలుచేయును.

**జ్వరం :** మధ్యాహ్నం చలి వణుకుతో వుండును. చేతులు, పాదాలు చల్లగా వుండును. మర్దన చేయుటవలన చల్లదనం కలిగి ఉపశమనం కలుగును.

**చర్మము :** పోతరపు పొక్కులు గజ్జి పెద్దబొబ్బలతో కూడిన పెంఫిగస్ అను చర్మవ్యాధి లూపస్ అను దీర్ఘకాలపు క్షయతత్వ చర్మవ్యాధి రాగిరంగు చర్మవ్యాధి. వివిధ భాగాలందు భరింపశక్యంగాని దురద. ముఖంమీద చిన్న పొక్కులతో కూడిన చర్మవ్యాధి. చర్మం పైపొర చాలా దళసరెక్కి పొలుసులు ఊడు చర్మవ్యాధి, అరికాళ్ళు భరింపరాని దురద, సవాయి సంబంధమగు వ్యాధులు, కుష్టువ్యాధికి గొప్ప మందు. చెమట విస్తారంగా పట్టును. మడెము, అరికాళ్ళు, అరచేతులు, కాళ్ళు చేతులమీద సొరియాసిస్, (పొలుసు కట్టువాపుతో కూడిన దీర్ఘకాల చర్మవ్యాధి), చీము పొక్కులు పొడిగా వుండు చర్మవ్యాధులు, రాచపుండు, పుట్టరణము వ్యాధులకు పనిచేయును. గొంతు, కీళ్ళవాతము, ముఖము, నాలుక, పండ్లకు చెందిన త్రివిభక్త నాడులకు (ట్రిగెమినల్ నెర్వెస్) చెందిన వ్యాధులు నాలుకపూత, సవాయి సంబంధమగు నోటిపూత, కనుగ్రుడ్డు నరాల బాధ, ఛాతీ,

మెడవాపుపై దద్దులు, దురదపుండు వ్యాధులకు మేలు చేయును. శరీరమంతటా కముకుదెబ్బ తగిలినట్లుండును. కండరాలు లాగుచుండును. ఏ పనిచేయలేడు. చెమటలు విస్తారంగా పట్టును. ఈ రోగి నిటారుగా నుండుట కష్టము. ఈ మందు సరస్వతీ ఆకు, మాండూకపర్ణి మాండూక బ్రాహ్మి మొక్కలనుంచి తయారుచేయుదురు. డాక్టర్ బోయిలెన్, ప్రప్రథమంగా ఈ మందును హోమియో పద్ధతిద్వారా రుజువుచేసెను.

## 35. హైగ్రోఫైలా స్పైనోస (HYGROPHILA SPINOSA)

**రోగి లక్షణాలు :** శరీరమంతా ఉబ్బియుండుట నీరుపట్టి ఉబ్బియుండును. సెగ(గనేరియా) నిద్ర పట్టకపోవుట, నపుంసకత్వం, కీళ్లవాతము, కుసుమ తెల్లబట్ట, పలురకాల చర్మవ్యాధులు, మూత్రకోశమునకు సంబంధించిన వ్యాధులు. పిత్తకోశంలో రాళ్లవంటివి ఏర్పడుట, ఇవి పైకి వెడలునపుడు తీవ్రంగా నొప్పి కలుగును. శరీరానికి నీరుపట్టి ఉబ్బుటవలన కాలేయం పనికి అంతరాయం ఏర్పడుట, పైత్యరస నాళాలలో పనికి ఆటంకం ఏర్పడును.

**చర్మము:** ఉష్ణంవలన అతిగ చర్మవ్యాధులు సంభవించును. చల్లదనం వలన తగ్గును. రక్తం చెడిపోవుటవలన కలుగు పుండ్లు ఉర్టికేరియా లేక నెటల్‌రాష్ అను దద్దులు దురదతో వుండు చర్మవ్యాధి కుష్టువ్యాధికి పనిచేయును.

**జ్వరం :** దురద, వేడి, గులలతో కూడిన తట్టు దద్దుర్లతో మలేరియా జ్వరం వుండును. ఉష్ణం అతిగ ప్రకోపించుటవలన తీవ్రంగా నవ్వ దురద వుండును. చల్లని నీరుగాని, తడిబట్టగాని అంటించిన ఉపశమనం కలుగును. చలిదాహం లేకుండా ఉదయం పూట జ్వరం వచ్చును. ఈ మందు ఇక్షుగంధ, కోకిలాక్షి, గొలిమిడివేరు చెట్టునుంచి తయారుచేయుదురు.

## 36. హోలారెన ఏంటి-డిసెంటరిక (HOLARRHENAANTI-DYSENTIRICA) (OR)

## రైటియాటింక్టోరియా (WRIGHTIA TINCTORIA)

**రోగి లక్షణాలు :** తరుణ దీర్ఘకాలికంగ యుండు గ్రహిణి, జ్వరం మొదలగు లక్షణాలుండును. జ్వరం గ్రహిణి పోగొట్టును.

**కడుపుకు ప్రేగులకు సంబంధించిన లక్షణాలు :** గ్రహిణి సంబంధించిన వ్యాధివలన బలహీనత ఏర్పడును. శుష్కించి పోవుట, ఆకలి లేకపోవుట, నీరసంగా వుండును. గ్రహిణి విరేచనాలతో నాభిచుట్టు శూలబాధ వుండును. నులిపెట్టుచున్నట్లు నొప్పి, ఆమంతో విరేచనాలు పెడలుటచే నొప్పి ఉపశమనం కలుగును. విరేచనమగునపుడు గుదం చుట్టుపుండువంటి బాధ నొప్పి ఉండును. మనసు ఆందోళనగ వుండి ఏదియో విపత్తు త్వరలో సంభవించునని భీతిచెందును. ఛాతీలో అమితంగ బాధ వుండి విరేచనానంతరం తగ్గును. కన్నులు మండుచుండును. నిద్రవుండదు. నోరు పెదవులు పొడిగ వుండును. నాలుక తెల్లగ వుండును. జ్వరమందు కాళ్ళ చేతులు నొప్పిగ నుండును. కాళ్ళ నీరసంగ వుండును.

ఈ మందు కుర్చి, కుటజ, ఇంద్రియవ, కోడిశ అను మొక్కలనుంచి తయారు చేయుదురు. డాక్టర్, మహేంద్రలాల్ సర్కార్ ప్రధమంగ ఈ మందును వాడి రుజావు చేసెను. డాక్టర్ కలికుమార్ భట్టాచార్య(అస్సామ్) 1935లో ఈ మందును పరీక్షించి అమలు పరచెను.

## 37. జిస్టిసియాఅధాటొడ-వాసక (JUSTICIA ADHATODA-VASAK)

**రోగి లక్షణాలు :** అన్నిరకాల్లు దద్దులు, వేడిశము, ఈ మందు వాడిన ఏ రకమైన దగ్గు సంభవించిన ప్రాణభయం వుండదు. వాసాక దగ్గర ఉంచుకొనిన నయమగు స్వభావం వుండును.





మనస్సు : నిరుత్సాహంగా వుండును. పైన వత్తిడికి ఏమాత్రం సహనశక్తి లేకపోవుట అత్యత మాట్లాడుటకు యిష్టం లేకుండును.
తల: నుదుట, లేక లలాటమంత అతిగ మంట యుండును. తలఅంతయు భారంగా వుండును. వేడిగ వున్నట్లుండును. తల రెండువైపుల గుండెవలె కొట్టుకొంటూ యుండును.

ముఖము : పాలిపోయినట్లుండును. తెల్లబారినట్లుండును. నీలిరంగు చారలుండును.

నోరు: నాలుక పొడిగ వుండును. అతిగా దాహం వుండును. చల్లని నీరు త్రాగిన ఉపశమనం కలుగును. మలము, విరేచనాలు:దీర్ఘకాలికంగ మలబద్దం వుండును.

శ్వాసావయలక్షణాలు : ఊపిరితిత్తులలో నొక్కి వేయుచున్నట్లు నొప్పి వుండును. జలుబు, దగ్గు, పడిశం ఊపిరితిత్తులవాపు శ్వాసనాళం వాపు(బ్రొంకొ-న్యూమోనియా, రక్తం ఉమ్మట, జలుబుతో తుమ్ములు అత్యధికంగా వుండును. జలుబుతో కన్నీరు కారును. గొంతు బొంగురు పోవును. కోరింతదగ్గు నందు పిల్లవాడు తన ఉదరకుహర ఊర్ధ్వభాగం రెండువైపుల రెండు చేతులతో (హైపొకాండ్రియం) గట్టిగ పట్టుకొనును. ఆహారం వాంతియగును. దగ్గుపొర్లు తీవ్రంగా నుండి పిల్లవాని ముఖం నీలిగనగును. కోరింత దగ్గులో పిల్లవానికి ఊపిరాడక పోయి బిగ్రబిగిసి నీలిగ నగును. తిన్న ఆహారం దగ్గుతో వమనమగును. ఈ దగ్గువలన ఆకలి యుండక మలబద్దం అధికంగ వుండును. శీతాకాలం వచ్చు జలుబు తగ్గును. ఛాతీలో శ్లేష్మం నిండియుండును. శ్లేష్మంచే ఛాతీ నుంచి గురగుర ధ్వనులు పైకి వినిపించును. కళ్లెపైకిరాదు. కొలది మాత్రమే పదే పదే కాండ్రించగ కళ్లెగా పడును. కళ్లె పచ్చగ చాల చిక్కగ నుండును. దగ్గుతో ఆయాసం అధికంగా వుండును. గొంతులో పిల్ల మ్రోతలతో దగ్గు వుండును. క్షయప్రారంభదశలో ఉపయోగపడును. కళ్లెరక్తంతో కలిసి వచ్చుట, నాలుక, నోరు, గొంతుక మొదలగు అమత్వక్కులు పొడిగ నుండి, దాహముండును. నాడి గట్టిగ వడిగ నుండును. ఉదరకుహరం వాయుపూరితమై గుడగుడలు శబ్దం పైకి వినబడును. కాలేయం సరిగ పనిచేయదు. స్ప్లీన్(ప్లీహము)లో నొప్పిగ నుండును. ఈ రోగి చిరచిరలతో నుండును. తేలికగా కోపంనొందును.

జ్వరం : ప్రతి సాయంత్రం చలితో రాత్రిపూట చమటలు పట్టును. ఊపిరితిత్తుల వ్యాధులకు ఉపయోగపడును. నిస్త్రాణ కలిగించు దగ్గు, క్షయ సంబంధమగు జ్వరం కనిపించును. శ్వాసావయ వ్యాధులతో జ్వరాలు మెల్లగ కలుగు జ్వరాలు, దీర్ఘజ్వరాలు వుండును.
ఈ మందు అడ్డసరము, వాసక మూలిక నుంచి తయారు చేయుదురు. డాక్టర్. ఎస్.సి.ఘోష్(కలకత్తా) మొదటి సారిగ పరీక్షించి రుజువు చేసెను.

## 38. జస్టిసియారుబ్రరం (JUSTICIA - RUBRUM)

జస్టిసియా అధాటోడమందు పనిచేయు లక్షణాలన్నింటిపైన ఈ మందు పనిచేయును. కాని దగ్గుతో రక్తం అధికంగ వచ్చుట క్షయవ్యాధి కలవారిలో రక్తపు కళ్లె పడునప్పుడు రక్తపువాంతి కలుగునపుడును గొప్పగ పనిచేయును. రక్తం విస్తారంగ నుమ్మనపుడు కుదుర్చును. దగ్గనపుడు ఊపిరితిత్తులనుంచి రక్తం వచ్చుట, ఛాతిలో నొప్పిగ వుండునపుడు పనిచేయును. ఈ మందు రక్తవాసన ఎర్రకొడిసె చెట్టునుంచి తయారు చేయుదురు.

## 39. కాల్మేఘ్ ఎండ్రొగ్రాఫిస్ పనికులాట

## (KALMEGH-ANDROGRAPHIS PANICULATA)

ఉష్ణమండలాలలో కలుగు అపాయకర వ్యాధి రక్తం క్షీణించి కాలేయ ప్లీహములు పెద్దవగును. నొప్పివుండును. జ్వరంతో రోగి ఎండి నల్లగ మారును. వంటికి నీరుపట్టును. ఇగుళ్లు అంతర్గతావయవములనుంచి రక్తం స్రవించును. (కాల-అజార్) చిన్నపిల్లలలో కలుగు కాలేయ ప్లీహవ్యాధులకు ముఖ్యౌషధము. విడుపుజ్వరాలు సెరలు ఉబ్బి నీలివర్ణంగ ఉండును. ముఖం నాలుక

నల్లగ మారును. మలేరియా విడుపు జ్వరం ఉధృతమగు ఉష్ణంతో వుండును. చలి ఉదయం 8నుంచి 9 గంటలు లేక 10 నుంచి 12 గంటలకు వచ్చును. చలిమంట ఒకటి తరువాత ఒకటి వచ్చును. చల్లనిబట్టలు అంటించిన ఒక్కోసమయంలో మేలు జరుగును. ఒక్కోసమయంలో అయిష్టంగా ఉండును. దీర్ఘకాలికంగా వుండు మలేరియా 'కాల-అజార్' శిశువులలో కలుగు కాలేయ వ్యాధులు కన్నులు పచ్చగ నుండుట నాలుకపై తెల్లని పుంత వుండును. మలబద్దం కన్నులు మంటగ నుండును. లలాటమందు నొప్పి వుండును. విరేచనాలు నల్లగ వచ్చును. అరికాళ్లు, అరిచేతులు మంటగ నుండును. మూత్రం పశుపుపచ్చగ విసర్జించును. ఋతుస్రావం ఒకనెలలో అతిగ నుండును. రెండవనెలలో తక్కువగా ఉండును. నిద్రలేకపోవుట, గొంతులోను జీర్ణకోశంలో మంట విరేచనాలు కొద్దిగ రావటం జరుగును. కడుపులో ప్రేగులు వాయుపూరితమై ఉడుకునట్లుండును.

## 40. లుఫా బిండాల్ (LUFFA BINDAL)

దీర్ఘకాలికంగ యుండు మలేరియా జ్వరానికి మేలు చేయును. 'గాల్' తిత్తిలో రాళ్లు ఏర్పడుటచే కలుగు శూల కాలేయ వ్యాధులను, ఈ మందు నివారించును. ప్లీహము(స్ప్లీను) పెద్దదైన వారలకు ఉపయోగపడును. జబ్బుతో కాలేయ ప్లీహములు పెద్దగనుండు వారలకు పని చేయును. తరచుగ జలుబు చేయుచుండును. దీర్ఘకాలిక జలుబు లచే బాధపడుట చల్లదనంగాని వాతావరణం మార్పుగాని సహించలేరు.మూలశంకలో పైకి లోపలికి వాడవచ్చును. ఈ మందును చేదు బీరకోశాతకి చెట్టు నుంచి తయారు చేయుదురు.

## 41. లుఫా అమారా (LUFFA AMARA)

**రోగి లక్షణాలు :** ప్లీహము పెద్దదగుట, జ్వరం, కాలేయం పెద్దదగుట బలంనిచ్చు మందు.
**మనస్సు :** ఆందోళన చెందుచుండును.
**నోరు:** అతిదాహంతో పొడిగ నుండును. నోటిలో రుచిలేదు.

**విరేచనాలు మరియు వాంతులు :** ప్రతి 15 నిముషాల కొకసారి బియ్యం కడుగు నీరు లాగ విరేచనాలు కలుగును. ప్రతి అర్ధగంటకొకసారి పైత్యరసం నీరు లాగా వాంతులుండును. కొంతసేపు ఆమముతో కూడి వుండును. కొంతసమయం వాంతులు విరేచనాలు ఒకేసారి కలుగును. కలరా ఆకస్మికంగా వచ్చును.

**ఇంద్రియజ్ఞానము :** శరీరమంత మంట వుండునట్లును కొంతకాలం చలితో వుండునట్లు భావించును.

**నాడి :** నీరసించి బలహీనంగ వుండును

**శరీరము :** చమటలు పట్టుటతో చల్లగా నుండును.

ఈ మందు ఒకపాదు ఆకుల గింజలనుంచి తయారు చేయుదురు. డాక్టర్ ఎస్.సి.ఘోష్ మొదటిసారిగ మందును పరీక్షించి రుజువు చేసెను.

## 42. ల్యూకస్ ఎస్పెర (LEUCUS ASPERA)

**రోగిలక్షణాలు :** విడుపుజ్వరాలు ఉబ్బసం దగ్గు గ్రహిణి కామెర్లు ప్లీహము(స్ప్లీను) కాలేయం. పెద్దదగుట విషపురుగు కాట్లకు గజ్జి చిడుము చర్మవ్యాధులు మొదలగు లక్షణాలు పనిచేయును. పాముకాటు : పాముకాట్లకు గురైన కేసులలో ఈ మందు మదురుటించరును. పైకి లోపలికి వాడవలయును. పూటకు 10నుంచి 15 చుక్కల మందు 15, 20 నిముషాలకొకసారి రోగి కోలుకొనేంతవరకు యివ్వవలయును. తేలుకుట్టిన వారికి కూడా ఈ మందు ఉపయోగపడును. దీనిని పైకి లోపలికి వాడిన మంట నొప్పి బాధ స్వల్పకాలంలోనే తగ్గిపోవును. ఈ మందు ద్రోణ, తుమ్మిద్రోణపుష్పి దీని తెల్లని పువ్వులు శివుని పూజకు కూడ వాడుదురు. ఈ చెట్టునుంచి మందు తయారు చేయుదురు.

## 43. మకరధ్వజ (MAKARADHWAJ)

గుండెవ్యాధులు, మానసిక సంబంధించిన వ్యాధులు, నరాలు లాగుట, కాళ్లుచేతులు లాగుట, ధాతునష్టం, ఉధృతంగా గుండెదడ, స్త్రీ బాహ్య జనేంద్రియానికి సంబంధించిన వ్యాధులకు పనిచేయును. అజీర్ణం తలత్రిప్పుట మొదలగు లక్షణాలపై పనిచేయును. నిస్సత్తువ, మేహము నిక్కాక తిమ్మెరలు కాళ్లుచేతులు మంటలు దగ్గు వయసుమళ్లినవారికి రాత్రిపూట వచ్చు శ్వాసకోశ సంబంధించిన వ్యాధులకు పనిచేయును. చాలాకాలం నుంచి ఉండువ్యాధి తిరుగుముఖం పట్టి వ్యాధిని వారించేవరకు త్వరితంగా అవయవములు చేయుపనిని ప్రోత్సహించినట్లు చేయుమందు, శుక్రనష్టంను నివారించుటలో, శక్తివంతంగా పనిచేయును. పురాణ జ్వరాలను నివారించును.

## 44. మెనిస్పెర్నం (MENISPERNUM)

**రోగిలక్షణాలు :** ఋతుస్రావం అమితంగా అత్యధికంగా విస్తారంగా స్రవించుట.

**మనసు :** నిరాశగవుండును. మానసికంగా కృంగును.

**తల :** తల త్రిప్పును, చెవులలో ఎడతెగని శబ్దం వుండును.

**రక్తస్రావము :** అమిత రక్తస్రావంచే ఆమె చాలా నీరసించును. కదలికచేగాని కదలునపుడుగాని ఋతుస్రావంకాని రక్తస్రావంకాని అధికమగును. నిత్యం గర్భకోశంనుంచి రక్తం మెల్లగ స్రవించును. రక్తం విస్తారంగా నుండి అతి ఎర్రగా నుండుమ. కుదుపులతో నుండును. ప్రసవానంతరం కలుగు అమిత రక్తస్రావంనకు ఉపయోగపడును. నోరు గొంతుక పొడిగనుండును. దాహముతోను, ఆకలి లేకపోవుటతోను అజీర్ణ విరేచనాలగుచుండును. అస్థిమితంతో పార్శ్వపు నొప్పి, తలనొప్పి ఆవులింతలు వళ్ళు వరపులుండును. శరీరమంతయు పొడిగ, దురదగా నుండును. నాలుక ఉబ్బునట్లుండి లాలాజలమధికంగా నుండును. ఋతుస్రావం అత్యధికం ఉండు స్త్రీలకు ఈ మందు అద్భుతంగా పనిచేయును. ఈ మందు రక్తకాంతాలి చెట్టునుంచి తయారుచేయుదురు.

## 45. మొమోర్డిక చెరన్షియా (MOMORDICA CHARANTIA)

పెద్దమ్మవారు, మశూచిరోగము వేపపువ్వు, అనెడి చిన్నమ్మవారు ఎర్రని చిన్న నూకల వంటి తట్టుతో కూడిన అంటువ్యాధి జ్వరము జలుబుతో బాధపడునపుడు త్వరగ ఉపశాంతి కలిగించును. ముక్కుకండ్లు నుంచి నీరు కారుట, అరికట్టును. దగ్గు వికారం మలబద్దం అతిసార విరేచనాలు కలుగునపుడు అద్భుతంగా పనిచేయును.

ఈ మందు పొట్టికాకర, కాకరచెట్టు ఆకులనుంచి తయారు చేయుదురు.

డాక్టర్ జి.కె.కోహిలీ(పాట్నా) మొదటిసారిగా ఈ మందును పరీక్షించి రుజువుచేసెను.

## 46. నిక్టాంతెస్ అర్బోర్ ట్రియోటిస్ (NYCTANTHES ARBORTRIOTIS)

**రోగి లక్షణాలు:** నియమితకాల వ్యవధులలో హెచ్చుచు తగ్గుచుండు రెమిటెంటు జ్వరాలు, కీళ్లవాతము సయాటిక(తొడ నరంలాగుట) మలబద్దం తలనొప్పి.

**మనస్సు:** ఆందోళనగ నుండును. విశ్రాంతి లేకపోవుట.

**తల:** మొద్దుగ నుండు తలనొప్పి తల తిరుగుట చుండ్రు.

**నోరు:** నాలుకమీద తెల్లగ లేక పచ్చగ జిగటగల పూతవుండును.

**కడుపు:** కడుపులో మంట చల్లనినీరు త్రాగినగాని కడుపుకు అంటించిన గాని ఉపశమనం కలుగును. వికారం పైత్యరసంతో వాంతి యగుట.

**ఉదరము:** కాలేయం తాకిన చాల బాధగా ఉండును. కాలేయ మండలంలో సూదితో కుట్టినట్లుండును. కాలేయం నొప్పిగ వుండును.

మలము: విరేచనాలు: మలబద్ధం విరేచనాలు పైత్యరసంతో విస్తారంగ వుండును.

మూత్రం: మూత్రం పచ్చగగాని, ఎర్రగగాని వుండును.

జ్వరం: చలికలుగుముందు, చలియందును దాహముండును. చలితగ్గినపుడు, వాంతియగును.

విడుపు(మలేరియా) జ్వరాలు చమటలు అధికంగ నుండదు. పైత్యరసాధిక్యత లక్షణాలుగల అన్ని రకాల జ్వరాలకు గొప్పగ పనిచేయును. నీరు త్రాగుటచే వాంతియగును. జ్వరములలో కలుగు ఉబ్బును పోగొట్టును. ఈ మందును పారిజాత, సెఫాలిక్, మార్నింఘార్ ఇది మల్లెజాతికి చెందిన చిన్న వృక్షం వసంతకాలంలో దీని ఆకుల రసం నుంచి తయారుచేయుదురు.

డాక్టర్ ఎస్.సి.ఘోష్ 1899 లో మొదటిసారిగ స్వయాన పరీక్షించి రుజువుచేసెను.

## 47. సిజిజియుం జాంబొలనం (SYZYGIUM JAMBOLANUM)

మధుమూత్రవ్యాధికి గొప్పమందు, అధిక దాహం , నీరసం శుష్కించుట, విస్తారంగమూత్రం విసర్జించుట, మూత్రపు విశిష్టసాంద్రత హెచ్చుగ నుండుట, మొదలగు లక్షణాలుండును. నోరుచాల పొడిగ నుండును.మూత్రంలో చక్కెర అధికంగా నుండును. ఈ మందు మూత్రంలోని చక్కెర పరిమాణం తగ్గించును. మధుమూత్ర రోగులందు కలుగు పుండ్లకు మేలు చేయును. దీర్ఘకాలికంగా వుండు పుండ్లను కుదుర్చును.

గ్రహిణి రక్తవిరేచనాలు దీర్ఘకాలపు విరేచనాలు గొంతుక నొప్పి ఇగుళ్ళ ఉబ్బుట, కుసుమ మొదలగు వ్యాధులలో పనిచేయును. నాలుక పగిలియుండుట చిన్న పిల్లలందు విరేచనాలు పైత్యపువాంతులు నివారించును.

దీర్ఘకాలికంగ వుండు అజీర్ణం నివారించును. మధుమూత్ర రోగులలో కలుగు దీర్ఘకాల అజీర్ణం అమితదాహం అద్భుతంగ పనిచేయును. ఈ మందు మూత్రమందలి చక్కరను తగ్గించి విశిష్టసాంద్రతను తగ్గించును. శరీరపైభాగంలో వుండు ఉష్ణం తగ్గించును. ఎర్రని దద్దులు నవ్వలు జ్వరం వుండని లేకపోని నివారించును.

ఈ మందు నేరేడు చెట్టుగింజల నుంచి తయారుచేయుదురు.

## 48. సొలానంజాంతో కార్పమ్
## (SOLANUM XANTHOCARPUM)

**రోగి లక్షణాలు :** దగ్గుతో గొంతుక బొంగురుపోవుట జలుబుచే కలుగు జ్వరం ఛాతీ నొప్పి, శ్వాస సంబంధమైన వ్యాధులతో స్వరం పోవుట, చిన్న శ్వాసనాళాలు ప్రథమమున వాచి తదుపరి ఊపిరితిత్తులకు కలుగు న్యుమోనియా (వాపు) మూత్రం బంధించుట, శ్వాసనాళాలవాపు (బ్రొంకైటిస్) ఉబ్బసమునకు గొప్పగా పనిచేయుమందు. ఈమందు మశూచి వ్యాధిరాకుండా వ్యాధి నిరోధకంగ పనిచేయును.

**శ్వాస సంబంధించిన లక్షణాలు :** దగ్గుతో స్వరం బొంగురుపోవుట శ్వాసనాళాలవాపు, (బ్రొంకైటిస్) న్యుమోనియా (ఊపిరితిత్తులవాపు) బ్రొంకొన్యుమోనియా ఉబ్బసము మొదలగు శ్వాసావయ వ్యాధుల మీద గొప్పగ పనిచేయును.

**జ్వరం :** జ్వరంలో దాహం ఆహారంపై అయిష్టత శరీరమంతయు మంట ప్రక్కటెముకలలో నొప్పి, నడుమునొప్పి వాంతి జ్వరాల నివారించును.

**మూత్రావయవములు :** మూత్రనాళం లోపలి రంధ్రం సన్ననగుట, మూత్ర విసర్జన కష్టంగ వుండునపుడును మూత్రం అణగారునపుడును, మూత్రం బంధించినపుడును, మూత్రంలో రాళ్ళు పడునపుడును మేలు చేయును.

ఈ మందు పిన్నములక, కంటుకారి, వాకుడు అను మొక్కనుంచి తయారుచేయుదురు.

# 49. ఒల్డెన్‌లాండియాహెర్బాసియా

## (OLDENLANDIA HARBACEA)

**రోగి లక్షణాలు :** రక్త ప్రసరణ నీరసంగవుండి శరీరం చల్లగ జిగురుగ తడిగనుండి నాడి మండలం కృంగియుండునట్టి జ్వరాలు, జీర్ణకోశానికి సంబంధించిన వ్యాధులు. నాడీమండలం కృంగియుండును. కామెర్లు మొదలగువ్యాధులు నివారించును.

**జ్వరాలు :** జ్వరానికి గొప్పగ పనిచేయును. శరీరమంత మంట పైత్యరస లక్షణాలు ప్రాముఖ్యంగ నుండుటతో జీర్ణశక్తిని కృంగదీయును. సన్నిపాత జ్వరం (టైఫాయిడ్) మలేరియా విడుపు జ్వరాలను నివారించును. చలి, దాహం, తలనొప్పి ముఖం కన్నులు కాళ్ళు పాదాలు మంటగ నుండును. పైత్యరసం వమనమగును. పైత్యరస సంబంధమగు విరేచనాలు కలుగును. జ్వరం ఒకరోజు తీవ్రంగాను మరుసటిరోజు స్వల్పంగ వుండును. జ్వరం సాధారణంగా ఉదయంపూట వచ్చును. నాడీమండలం కృంగియుండును. కామెర్లు కాలేయవ్యాధులు మూత్రోత్పత్తి వృద్ధిచేయును. దీర్ఘకాల మలేరియాను కుదుర్చును.

కడుపు, ప్రేగులకు సంబంధించిన లక్షణాలు : పైత్యరసంతో వాంతులు, విరేచనాలు కలుగునపుడు పనిచేయును. ఈ మందు క్షేత్రపర్పాట మొక్క నుంచి తయారుచేయుదురు. డాక్టర్ పి.పి.బిశ్వాస్, మొదటిసారిగా ఈ మందును పరీక్షించి రుజువుచేసెను.

# 50. నేట్రం మూర్‌బిట్ (NATRUM MUR BIT)

ఆకస్మికంగ జ్వరోద్రేకం చలితో ఉదయం 10-11 గంటల సమయంలో వచ్చును. తాత్కాలికంగా వుండును. ఉధృతమగు చలితో వణుకుచుండును. తీవ్రమగు దాహం తలనొప్పితో ఏమీ తెలియని అయోమయ స్థితిలో వుండును. పెదవులు గోళ్లు నీలివర్ణంగ మారుట ఉష్ణం వున్నంతవరకు తీవ్ర నొప్పులుండును. తలనొప్పితో వాంతులు కలుగుట, చమటలు పట్టుట వలన అన్ని రోగ లక్షణాలు తగ్గిపోవును. వ్యాధి కలుగుటకు కొలది ముందుగా కాలేయం ప్లీహముతో తీవ్రమగు నొప్పి కలుగును. నాలుకపై మచ్చలుండును. పెదవులపై బొబ్బలు పొక్కులుండును. ఉప్పు సుగంధద్రవ్యములపై అతిగ కోరికవుండును. రొట్టెపై అయిష్టత వుండును. జ్వరంతో చర్మవ్యాధులు, పొక్కులు సంభవించును.

# 51. ఎన్డెర్సోనియా రోహితక (ANDERSONIA ROHITAKA)

**రోగి లక్షణాలు :** దీర్ఘకాలికంగ జ్వరం, శరీరమంత బలహీనంగా వుండుట, గ్రంధులు ఉబ్బును. స్ప్లీన్ (ప్లీహము) కాలేయానికి సంబంధించిన వ్యాధులు, కుసుమ లేక తెల్లబట్ట కలుగును.

**మనస్సు :** జ్ఞాపకశక్తి లోపించుట, అక్షరాలవర్ణక్రమంలోను, స్థలాలు మొదలగు వాటిని చెప్పుటలోను తప్పులు దొర్లుచుండును. ఏవిషయంగాని మనస్సు నిలకడ లేకపోవుట. సులభంగ కోపం వచ్చును.

**తల :** నడినెత్తిలో ఉష్ణం వుండును. తల త్రిప్పును. ఉష్ణంతో కణతలలో నొప్పి యుండును. చల్లనిగాలి, చల్లనినీరు, చల్లని బట్ట అతికించిన తగ్గిపోవును.

**ముఖం :** వేడిచే ముఖం ఎర్రగ మారును. ముఖం కండ్లు మంటగా వున్నట్లుండును.

**నోరు :** నోటిలో రుచిలేకుండా చప్పగ వుండును. ఉదయం దుర్వాసన రుచి చేదుగనుండును.

**ఉదరము :** కడుపులో మంట, కాలేయం స్ప్లీన్, పెద్దదై నొప్పిగ నుండును. వికారము, వాంతులు చేసికొనును.

**జ్వరం :** తలనొప్పితో జ్వరం వచ్చినట్లుండును. నొప్పులు బాధగనుండును. చేతులు పాదాలు కాళ్లు మంటగానుండును. తరుణ దీర్ఘకాలికంగవుండు మలేరియా జ్వరాలను నివారించును.

మలేరియా జ్వరం సాయంత్రం 4-4.30 గంటలకు వచ్చును.

నాడి : అతివేగంగ కొట్టుకొనును. మలబద్ధం, ఆహార వాంఛవుండదు. వీపులో నొప్పివచ్చి పైకి ఎడమ ఊపిరితిత్తికి వ్యాపించును. కుడివైపు నొప్పి భోజనానంతరం శీతలూపశమనంవలన తగ్గును. అపానవాయువు అతిగ నుండి మలం తగ్గును. కుడిరెక్క, గూటికి వెనుపాముకు మధ్య నొప్పి. తిరుగుచున్నట్లు, రైలు ప్రయాణంచేయుచున్నట్లు కలలు వచ్చును. జీర్ణకోశం పులియును. శరీరం వేడిగనుండి స్నానం చేయుగోరును. ఎండలో సహించలేడు. కామెర్లు ఒంటికి నీరు పట్టి ఉబ్బినపుడు మేలు చేయును.

ఈ మందు హరిన్హార, రోహితక, పిత్వరాజ అను వృక్షంనుంచి తయారు చేయుదురు. డాక్టర్ పి.పి.బిశ్వాస్, ప్రప్రథమంగ ఈ మందును పరీక్షించి రుజువుచేసెను. డాక్టర్ చంద్రనాథ్ దాసు, డాక్టర్ ఎస్.ఎన్.బరితియార్ (సెర్పూర్) 1912లో ఈ మందు తామె స్వయంగా తీసుకొని పరీక్షించి రుజువు చేసినట్లు తెలిపారు.

## 52. ఒసిమమ్ సాన్క్టం (OCIMUM SANCTUM)

**రోగి లక్షణాలు :** ఉబ్బసం, రొంప, జలుబు, పడిశము, దగ్గు, జ్వరం సూక్ష్మక్రిముల సంబంధించిన వ్యాధులు.

**మనస్సు :** మతిమరపు, మనస్సు నిలకడలేకపోవుట, ఏ విషయం మీదను మనస్సు కేంద్రీకరించలేకపోవును. చిన్నపిల్లలు చిరచిరలాడుచుండుట కేకలు వేయుట వలన వైద్యుడు సంరంక్షించుటకు అంతరాయం కలుగును. పడకపైన పరుండుటకు యిష్టపడకుండును. సాగిలపడియుండుట, పూర్తిగ శక్తిపోయినట్లుండును. నిద్రమత్తు ప్రశ్నలకు సమాధానం చెప్పుచూ నిద్రపోవును.

**తల :** తలనొప్పి భారంగ వుండును. భయంకరమైన తలనొప్పి, తలలో మేకులు గ్రుచ్చుకొనునట్లుండును. తలకు బట్టకట్టుకొనుటవలన నొప్పి తగ్గును. నడుచునపుడు తల తిరుగును. నడినెత్తిన ఉష్ణం వుండును. తలపై చల్లని నీరు పోయుటవలన, పానుగాలివల్లను విసరుకొనుటవలన తగ్గును. రక్తప్రసరణాధిక్యతచేగాని, జలుబుచేగాని, ఇన్ఫ్లూయంజాచేగాని, ఇతర జ్వరాలచేగాని తలనొప్పి వచ్చునపుడును, కదలికవల్ల తలనొప్పి అధికమగునపుడును మేలుచేయును.

**కన్నులు :** ఎర్రగ, నొప్పిగ నుండును. కన్నుల నుంచి నీరు కారును. కండ్ల కలక ఏదైనా వస్తువును తదేకంగా చూసినపుడు కన్నుల ముందు పొగమంచు వున్నట్లుండును. వెలుగును చూడలేడు. కన్నులు అంటుకొని పిసురు కట్టునపుడు పనిచేయును.

**చెవులు :** చెవులలో శబ్దం వుండును. పెద్ద శబ్దంవలన బాధకలుగును. చెవులనుంచి నీరులాగ రసికారును. చెవుల నుంచి వచ్చు చీము దుర్వాసనగ నుండును. చెవుడు, జలుబుచే చెవులు నొప్పిగ ధనారింపుగ నుండును. చెవుల నుంచి వేడి పరంపరలు వచ్చుచుండును.

**ముక్కు :** ముక్కు నుంచి నీటి వంటి స్రావం కలుగును. ముక్కు రంధ్రాలు పుండు పడును. ముక్కు నుంచి రక్తస్రావం వచ్చును. తరచుగ తుమ్ములతోను తెల్లని, పీచుని స్రావంతో నుండు జలుబును నివారించును.

**ముఖం, నోరు :** పెదవులు అతి ఎర్రగ, పొడిగ నుండి ముఖం ఎర్రగగాని పాలిపోయినట్లుగాని వుండును. ముఖం వేడిగ నుండును. నీటివంటి లాలాజలం స్రవించును. నోటియందు రుచి కుళ్ళుగను చేదుగనుండును. నోటిపుండు, నోటిలో తెల్లని చిన్న పుండ్లుండును. చిన్న పిల్లలనోరు, నాలుక పుండుపడును. నాలుక అంతయు ఎర్రగ నుండవచ్చును. నాలుక మధ్యభాగం చాల తెల్లగ నుండి అంచులు ఎర్రగ నుండవచ్చును.

పెదవులు పొడిగ నల్లగ నుండును. పంటినొప్పి ఘోరంగ వుండును. పంటినొప్పి రాత్రిపూట

అధికమై స్పర్శవలన, చల్లదనంవలన ఉద్రేకం చెందును. నోటినుంచి దుర్వాసన వచ్చుచుండును. లాలాజలం దుర్వాసనగ నుండును.

**గొంతు :** గొంతులో నొప్పి, గుటకవేయునపుడు నొప్పి, బాధ వుండును. దగ్గునపుడు తుమ్మునపుడు, నడచునపుడు గొంతుకలో నొప్పిగ నుండును. గొంతులోపలివైపు ఎర్రగ నుండును. టాన్సిల్సు పెద్దవగును. గొంతుపుండు గొంతు స్వరం మారును. గొంతుక బొంగురుపోవును.

**ఛాతీ :** దగ్గునపుడు, తుమ్మునపుడు ఛాతీలో నొప్పి, అధికమగును. ఛాతీ ఇరువైపుల నొప్పి వుండును. రోగి ప్రశాంతంగా పరుండలేడు. ఛాతీలో ప్లూరా వాపు వచ్చుటవలన కలుగునొప్పులు, ఉబ్బసం సంభవించుచుండును. శిశువులకు, చిన్నపిల్లలలో కలుగు ఉబ్బసానికి అద్భుతంగ పనిచేయును. ఛాతీలో శబ్దం, గురకవేయునట్లుండును. ఉబ్బసమందు రోగి వీపుమీద పరుండలేడు. పరుండిన శ్వాస చాలా కష్టంగ వుండును. రోగి ముందుకు వంగి తలను చేతులమీదగాని, మోచేతులు, మోకాళ్ళ మీద పెట్టుకొనుట, ముందుకు వంగి చేతులను టేబుల్‌మీదగాని బల్లమీదగాని, చేతులపై తలనుపెట్టుకొనుట, శ్వాస కొంతవరకు ఉపశమనం కలిగించునట్లుండును. రొమ్మెముక మధ్యభాగంలో నొప్పిగనుండును.

**కడుపు, ఉదరము :** ఉదరకుహరం వాయుపూరితమై ఉబ్బరించును. తేన్పులు ఆకలిలేకపోవుట, ఎక్కిళ్ళు వుండును. ఉదరకుహరంలో గుడగుడలుండును. ఉదరకుహరం బరువుగనుండి తరచు మలవిసర్జన చేసినను ఆ బరువు తగ్గదు. ఉదరంలో శూలవంటి నొప్పి యుండవచ్చును. కాలేయంలోను, ప్లీహంలోను నొప్పి, కుడివైపు పొత్తికడుపులో నొప్పిగ వుంటూ నొక్కిన గుడగుడ శబ్దం కలుగును. ప్రేగులలో జీర్ణకోశమందలి అమత్వక్కువాపుతో జ్వరం విరేచనాలుండును. తరచు మలవిసర్జన చేసినను ఉదరకుహరపు ఉబ్బరం తగ్గదు. ఈలాంటి విరేచనాలు జ్వరం జలుబు దగ్గు న్యూమోనియా బ్రోంకైటిస్ మొదలగు ఎలాంటి వ్యాధితోనున్నను, ఈ మందు నివారించును. వానాకాలమందు ఆకురాలు కాలమందు కలుగు విరేచనాలు. చిన్నపిల్లలలో కలుగు క్రిములను నిర్మూలించును. క్రిములతో చిన్నపిల్లవాడు క్షోభంగ నుండి నిద్ర నుంచి ఉలికిపాటున లేచును. చిన్నపిల్లవానిని వైద్యుడు పరీక్షించుటకు అంతరాయం కలిగించును. చిన్నపిల్లలు ప్రక్కలో మూత్రం అప్రయత్నంగపోయుదురు. మూత్రం విసర్జించునపుడు మూత్రనాళంలో మంటగ నుండును. మూత్రం ఆమముతోగాని చీము వంటి పదార్థంతోగాని యుండును. తరచుగ మూత్రం విసర్జించాలని వుండును. చంటిపిల్లవాడు క్షోభంగ నుండి ఏడ్చుచుండును. ఎత్తుకొని త్రిప్పుటచే ప్రశాంతంగ వుండును.

**జ్వరం :** నొప్పులతో కూడిన జ్వరం. ఇన్‌ఫ్లూయంజా (శీతజ్వరం) విషపడిశం అంటువ్యాధిగ ప్రబలు జలుబు తలనొప్పి వుండును. దగ్గు విరేచనాలు, న్యూమోనియా బ్రోంకైటిస్, బ్రోంకోన్యూమోనియా, ఉబ్బసంతోవుండు విడుపుజ్వరాలు, సన్నిపాతజ్వరం, సంధితో కూడిన జ్వరంతో రోగి నిద్రమత్తుగ నుండును. ఎముకలలో నొప్పులుండును, శరీరమంత మంటలాగ వుండును. కండరాలు పుండ్ల నొప్పులతో నుండును. అమిత చలితో జ్వరం మధ్యాహ్నం కలుగుచుండును. హస్తములు, పాదాలు అతిచల్లగ నుండి తిమ్మిరతోను జిలతోనుండును. ఎండలో కూర్చొనిన చలి తగ్గును. దాహంవుండవచ్చు వుండకపోవచ్చును.

**మలము, విరేచనాలు :** విరేచనాలు నీటివలె విస్తారంగ వుండి దుర్వాసనగ నుండును. పచ్చగగాని, ఆకుపచ్చగగాని రేగడిమన్ను రంగుగగాని యుండును. గ్రహిణి, చీము రక్త విరేచనాలు తీవ్రజ్వరంతో రోగికి తెలియకుండగనే విరేచనాలు కలుగును.

**మూత్రము :** చిన్నపిల్లలు ప్రక్కలో మూత్రం అప్రయత్నంగ పోయుచుందురు. మూత్రం విసర్జించునపుడు మూత్రనాళంలో మంటగనుండును. మూత్రం ఆమముతోగాని చీము వంటి పదార్థంతోగాని యుండును. తరచుగ మూత్రం విసర్జించాలని కోరుట.

**ఋతుస్రావములు :** ప్రసవానంతరం కలుగు మైల చాలా దుర్వాసనగ నుండి సహజ

రంగుతో వుండక చాలాకాలం స్రవించుచుండును. ప్రసవానంతరం విస్తారమగు రక్తంతో స్రావములు కలుగును. స్రావం చీమువలె నుండి చేపలు కడిగిన నీటివలె నుండును. ఋతువు క్రమంగ నుండక చాలాకాలం స్రవించును. కుసుమ తెల్లబట్ట గర్భకోశవ్యాధులు మొదలగువాటికి ప్రసవానంతరం ఈ మందును వాడిన కలుగకుండ అరికట్టును.

ఈ మందు తులసిచెట్టు నుంచి తయారుచేయుదురు. డాక్టర్ మూరె ప్రప్రథమంగ ఈ మందును పరీక్షించి రుజువుచేసెను. డాక్టర్ రామప్రసాద్ జి, డాక్టర్ కుమార్ బట్టాచార్య ఈ మందును ప్రప్రథమంగ పరీక్షించి రుజువు చేసినట్లు కొన్ని పుస్తకాలలో తెలిపారు.

## 53. ఒసిమం గ్రాటిస్సిమం (OCIMUM GRATISSIMUM)

మూత్రం విసర్జించునపుడు మంటగనుండును. మూత్రం చీముతో కలిసి వుండును. మలబద్ధం పిల్లలకు వచ్చు జలుబు దగ్గు జ్వరాలకు మేలు చేయును. సెగ (గనోరియా) మూత్రకోశం నుంచి కలుగు రక్తస్రావాలు. గ్రహిణి శుక్రనష్టం నివారించును. ఈ మందు రామతులసి చెట్టు నుంచి తయారు చేయుదురు. డాక్టర్ హరిదాస్ పలీత్ (లెహరియాసరాయ్) 1920లో ప్రప్రథమంగ పరీక్షించి రుజువుచేసెను.

## 54. ఒసిమం కారియో ఫైల్లాటం(OCIMUM CARYOPHYLLATUM)

మూత్రకోశం, మూత్ర పిండాలు మూత్రనాళాలకు సంబంధించిన వ్యాధులకు గొప్పగ పనిచేయగల మందు. మూత్ర పిండాల వాపు మూత్రపిండాలకు రక్త ప్రసరణాధిక్యత, రక్తంతో కూడిన మూత్రం, మొదలగు వ్యాధులకు ఈ మందు మేలు చేయును. సెగ ప్రథమ దశలో ఉపయోగపడును. మూత్రం విసర్జించినపుడు అమితంగ మంట యుండును. తరచుగ మూత్రం విసర్జించుట ఈ లక్షణాలతో జ్వరం కూడ వుండవచ్చును. మూత్రంలో చీము వుండును. శుక్రనష్టానికి, సెగకు చాల మేలు చేయును. గ్రహిణి, ప్రసవాంతర నొప్పులుండును.

## 55. టినోస్పొరకార్డిఫోలియా (TINOSPORA CORDIFOLIA)

**రోగి లక్షణాలు :** అమిత శుక్రనష్టంచే నీరసించుట, తరచుగ జ్వరాలు వచ్చుట. విడువుజ్వరాలు కామెర్లు స్ప్లీన్ (ప్లీహము)నకు చెందిన వ్యాధులు. కుష్ఠు తెల్లబట్ట కీళ్ళవాతము. చర్మవ్యాధులు రెండవ దశలో సిఫిలిస్ (సవాయి) వ్యాధి, సెగ (గనోరియా) వలె జనేంద్రియాలకు మూత్రావయవాలకు వచ్చుట, మూత్రవిసర్జన బాధగనుండుట మొదలగు వ్యాధులకు పనిచేయును.

**జ్వరం :** తరుణ, దీర్ఘకాలికంగవుండు జ్వరాలు. చలితోగాని వణుకుతోగాని శరీరోష్ణం సాధారణంగ మధ్యాహ్నం ప్రకోపించును. పైత్యపు వాంతులు. దాహంతో తలనొప్పి రోగిని మెల్లగ పీడించు దీర్ఘకాలిక జ్వరాలలో అద్భుతంగ పనిచేయును. అమిత శుక్రనష్టంచే నీరసించిన వారికి జ్వరం తరచుగ సంభవించుటచే నీరసించిన వారికి ఈ మందు గొప్పగ పనిచేయును. క్వినైను అమితంగ వాడినవారలలో జ్వరం తగ్గక ముఖం కాళ్ళు చేతులు మంటగా వుండును. కాలేయ ప్లీహం పెద్దదగుట, కామెర్లతో కండ్లు పచ్చగ మారుట, తలనొప్పి ఆహార హితవు లేకపోవుట. వివిధరకాల వాంతులు ముఖ్యంగా పైత్యపు వాంతులందీ మందు గొప్పది.

**మూత్రం :** మూత్రం విసర్జించునపుడు మంట, మూత్రం తరచుగ చుక్కలు చుక్కలుగ విసర్జించుచుండును. మూత్రం చీముతో కలసియుండును. మూత్ర విసర్జన బాధగ నుండును. సెగ సవాయి రెండవదశలో ఈమందు అద్భుతంగ పనిచేయును.

**గుండె :** అమిత నీరసించిగాని, అమిత శుక్రనష్టంచేగాని గుండె దడ హెచ్చుగ నుండును. అనేక రకాల చర్మవ్యాధులకు కుష్టు కీళ్ళవాతము క్రిములు మూలశంక బోద మొదలగు వ్యాధులందు ఉపయోగపడును. ఈ మందు తిప్పతీగె, గులాంచ, గులూచి, మూన్‌సీడ్ చెట్టు నుంచి

తయారుచేయుదురు. డాక్టర్ జె.యన్.సింహా, (లహిరియాన్ రాయ్) 1930-31లో ప్రప్రథమంగ పరీక్షించి రుజువుచేసెను.

## 56. ట్రికోసాంతస్ డియోయిక (TRICHOSANTHES DIOICA)

**రోగి లక్షణాలు :** దీర్ఘకాలికంగ యుండు మలేరియా జ్వరం. ఉష్ణమండలంలో కలుగు అపాయకరవ్యాధి, వికారం, వాంతులు.

**మనస్సు :** మానసికంగ కృంగి నిరాశగనుండును.

**తల :** శయ్యలో పరుండినపుడు తల తిరుగుచు దొర్లుచున్నట్లుండును. జ్వరం వుండునపుడు భయంకరమైన తలనొప్పివుండును.

**కన్నులు :** కన్నులు పచ్చగ నుండును. కనుపాప విపులీకరించనట్లుండును

**నోరు :** దాహం గొంతు ఆర్చుకొని పోవునట్లు పొడిగనుండును. లాలాజలం జిగటగనుండుట చెడు రుచి నోటి నుంచి ఎడతెగకుండ నీరు ఊరుచుండుట. నోటి రుచి చేదుగనుండును.

**గొంతు :** గొంతులో నొప్పి గొంతు వ్యాధులకు పనిచేయును.

**వాంతులు :** తేన్పులు ఎక్కిళ్లు వికారం వాంతులు నోటి నుంచి నీరూరుట గుడగుడలుండుట తాగే సాగెడి ఆమము వాంతియగును. పైత్యపు వాంతులు నీరుతాగిన తదనంతరం తేన్పులు వాంతియగును. రక్తం పలురకాలు రంగుతో వాంతియగును.

**ఆకలి :** అమితమైన ఆకలి వుండును. ఉదయంపూట ఏదో ఒక ఆహారంగాని, చల్లని పదార్థాలుగాని తినాలని కోరిక యుండును.

**మంట :** శరీరమంత మంటలాగ వుండును. దాహం వుండును.

**ఉదరము :** ఉదరంలో శూన్యంలాగ వుండును. ఉదరం ఉబ్బును. కాలేయం పెద్దదై నొప్పి వుండును. ఉదయం 11 గంటలకు ఉదరంలో వేడిగా వున్నట్లు భావించును. తుమ్ములు దగ్గు విరేచనాలు మొదలగు వాటివలన రోగ లక్షణాలు ఉధృతమగును.

**మలము, విరేచనాలు :** కలరావంటి విరేచనాలు గ్రహిణి కలరా విరేచనాలు పల్చగ విస్తారంగ వచ్చును. పచ్చగ, ఆకుపచ్చగ కలుగును. పైత్యరసంతోగాని ఆమముతోగాని యుండును. రక్తవిరేచనాలు వలన అధిక నిస్త్రాణ కలుగును. విరేచనాలు నురుగుగ వెడలునపుడు నొప్పి బాధ వుండును. విరేచనానంతరం చాలాసేపటివరకు విరేచనానుమానం కడుపునొప్పి తగ్గదు. విరేచనంగాని రక్తవిరేచనం గాని అప్రయత్నంగ నగును. విరేచనం శబ్దంతో వెడలును. గుదస్థానం మంటగ నుండును.

**మూత్రావయములు :** వాంతులు విరేచనాలతో మూత్రమనగారును. మూత్రం చాలా తక్కువగను, ఎర్రగనుండును.

**కాళ్లు :** కాళ్ల పాదాలు ఉబ్బినట్లు వాపుతో యుండును.

**జ్వరం :** జ్వరం ఉదయం 11నుంచి 12 మధ్య చలితోవచ్చును. జ్వరం వుండునపుడు శరీరమంత మంట యున్నట్లుండును. ఉష్ణం ప్రకోపించినపుడు తలనొప్పి దాహం మొదలగు బాధలుండును. తరుణజ్వరంలో వికారం వాంతులుండును. అజీర్ణంచే నోటిలో నీరూరుచుండును. మరుసటిరోజు తీవ్రజ్వరం వుండును. పైత్యసంబంధించిన అన్ని జ్వరాలకు సంబంధించిన లక్షణాలు ప్రబలినపుడు ఉపయోగపడును. తలనొప్పి, వికారం నోటిలో నీరూరుట, ముఖ్య కీలక లక్షణాలు. కాలేయం ప్లీహం పెద్దదై దీర్ఘకాలికంగ వుండు జ్వరాలకు మేలు చేయును. ఈ మందు పొట్ల, పటోల కోమంపొట్ల చెట్టునుంచి తయారు చేయుదురు. డాక్టర్ పి.పి. బిశ్వాస్ ప్రప్రథమంగ ఈ మందును పరీక్షించి రుజువుచేసెను.

## 57. టెర్మినాలియా చెబూల (TERMINALIA CHEBULA)

రోగి నిత్యం ఆవులిస్తూ అలక్ష్యంగ నుండును. తలత్రిప్పు తీవ్రంగ నుండి తల వెనుక భాగంలో ప్రారంభించి కుడి భాగానికి వ్యాపించును. తల త్రిప్పు రాత్రి పగలు గంటల కొలది వుండును. ఎండవలన, గట్టిగ నొక్కుటవలన కదలుటవలన తలత్రిప్పు అధికమగును. చన్నీటి స్నానం వలన పొడిగనుండు శీతల గాలివలన భుజించుటవలన నిద్రయందు తగ్గును. త్రిప్పుతో తలనొప్పి లాలాజలం విస్తారంగ స్రవించుట. శీతోదకమును త్రాగాలని కోరికయుండును. ఇగుళ్లు ఉబ్బి గట్టిగ నుండును. నోటి నుంచి దుర్వాసనవచ్చును. తేన్పులు గాని వచ్చుచుండును. నాలుక గోధుమవర్ణంగ నుండి ఉబ్బును. నాలుక సచ్చి పుండులాగ వుండును. కడుపు నిండుగ నున్నట్లు వాయువుచే ఉబ్బరించి యుండును. కడుపులో నొప్పి గుడగుడలుండును. కుడివైపు నడుం నొప్పి తీవ్రంగ నుండి కూర్చుండలేరు. పరుండుటవలన నిద్రించుటవలన నడుం నొప్పి తగ్గును. మెడ వెనుకవైపు నొప్పి, ఛాతిలో కుడివైపు తీవ్రంగ నొప్పి కాలేయంలో నొప్పి నొక్కుటచే తాత్కాలికంగా నొప్పి తగ్గును. గుండెకు సంబంధించిన భాగంలో నొప్పి మల విసర్జనకై తరచుగ వాంఛ కలుగును. మలం తక్కువగ వెడలును లేక వెడలదు. మల విసర్జనకు చాలా ప్రయత్నించాలి. మల విసర్జించినపుడు చమటలు పట్టును. పురీషనాళంలో నిండుగ నున్నట్లు దురదగ నుండును. మలబద్ధ మందు మలం గట్టిగను కొలదిగ వచ్చును. విరేచనాలు పల్చగనుండి కొలదిగ నగుచుండును. కడుపుమంట ఉదరం ఉబ్బుట మూత్రం తక్కువగ వుండును. రాత్రిపూట మూత్రం తరచుగ విసర్జించును. కుడి భుజం కీళ్ళవాతంచే నొప్పిగనుండును. దురద గోకుటచే తగ్గును. రోగి బాధలు ఎండకదలిక గట్టి నొక్కుట అలసటవలన అధికమగును. చన్నీటిస్నానం వలన సాయంత్ర కాలపు పొడి శీతల గాలివలన నిద్రయందు భుజించునపుడు కన్నులను మూయుటవలన మానసిక శారీరక విశ్రాంతి వలన తగ్గును.

హరీతకి, కరక, అభయ చెట్టు కాయల బెరడు నుంచి మందు తయారు చేయుదురు.

## 58. టైపోఫెబ్రినం (TYPHOFEBRINUM)

## (సాహి లేక సాహిల్‌కి ఆల్)

దీర్ఘ కాలిక విడుపు జ్వరాలు సన్నిపాతజ్వరం నివారించును. ఉష్ణం వుండునపుడు చల్లనినీరు చలి వున్నపుడు వేడి నీళ్ల త్రాగును. కాళ్ళు చేతులకు చమటలు పట్టును. మలం నల్లగాను గట్టిగ వుండుట వుండలుగా బాధగా వచ్చును. మానసికాందోళన వుండును. తల తిరుగుట బరువుగ నుండుట, నాలుక ఎర్రగాను నల్లగాను దళసరిగ పుండ్లతో వుండును. కండ్లనుంచి నీరుకారుట, మంటలు నొప్పులు కనురెప్పలు వాపుతో నుండును. న్యూమోనియా దగ్గు దగ్గునపుడు ఊపిరాడకపోవుట, తల నొప్పిగ నుండుట, లక్షణాలపై అద్భుతంగ పనిచేయును. జీర్ణావయములపై చక్కగ పనిచేయును. రోగి ఉద్రేకంతోను, కోపంతోను వుండును. రక్తపోటు ఉబ్బులు, వాపులుండును. కుక్కకాటుకు పనిచేయును. మృత్యువు సమీపించునేమోయని తరచుగ విచారం చెందుచుండును. నిద్రలేమికి పనిచేయును. ఈ మందును డాక్టర్ కె.కె.భట్టాచార్య ప్రప్రధమంగ తానే స్వయంగ పరీక్షించి రుజువుచేసెను.

## 59. ఎల్లియం సెపా (ALLIUM CEPA)

**రోగి లక్షణాలు :** తరచుగ తుమ్ములు ముక్కు నుంచి వేడిగ బరువును కలిగించునట్టి నీరుకారును. వెచ్చని గదిలోనికి వెళ్లుటచే ఉధృతమగును. ఆరుబయట గాలిలోకి వెళ్లిన ఉపశమనం కలుగును. ముక్కునుంచి నీళ్ళవంటి స్రావం విస్తారంగ స్రవించును. కండ్లలో నీరు ఎక్కువగ వుంటూ కారుచుండును. దెబ్బతగులుటవలన కలుగు నరాలవాపు బాధ దీర్ఘకాలికంగ వుండునపుడు

మేలు చేయును. ముక్కు గొంతు మూత్రకోశంలోను చర్మం మంటగ నుండును. శరీరంలో ఏదో ఒక భాగంలో మండుతున్నట్లుండును.

**తల** : తలనొప్పి లలాట మందు తరచుగవచ్చును. వెచ్చని గదిలో అధికంగ వుండును. ముఖంపై క్రిములు ప్రాకునట్లుండును. ఋతుస్రావం కలుగుసమయంలో తలనొప్పి తగ్గిపోవును. ఋతుస్రావం ఆగిపోయిన తదనంతరం మరల తలనొప్పి వచ్చును.

**కన్నులు** : ఎర్రగ మంటగ నీరుకారుచుండును. వెలుతురులో సహనశక్తి లేకపోవుట, కండ్లలో నీరుండుట, బాధకలిగించకుండ విస్తారంగ నీరుకారుట, ఆరుబయట గాలిలో తగ్గును. కనురెప్పలలో మంటగ నుండును.

**చెవులు** : చెవినొప్పి చెవిపోటు కర్ణాంతరనాళంలో శూలనొప్పి వుండును.

**ముక్కు** : వెచ్చని గదిలో ప్రవేశించగానే తుమ్ములు వచ్చును. దుర్వాసన గల స్రావం వచ్చును. ముక్కు రంధ్రంలోపల ఉబ్బినట్లుండును. రోగులకు పుప్పొడి మొదలగు వాటివలన జలుబు తుమ్ములు గొంతుక ముక్కులోపల వాచును. ఇది ఏడాదికి ఒకసారి గాని అప్పుడప్పుడుగాని కలుగును. అమిత పడిశంవలన తలనొప్పి దగ్గు, స్వరం బొంగురుపోవును. ముక్కులో కంతి పెరుగును.

**కడుపు** : విపరీతమైన ఆకలి, జీర్ణకోశానికి సంబంధించిన భాగంలో నొప్పి దాహం తేన్పులు వికారం వుండును.

**ఉదరము** : ప్రేగులలో వాయువు వుండుటవలన గుడగుడ ధ్వని వుండును. అపాన వాయువు దుర్వాసనగవుండును. పొత్తికడుపు ఎడమభాగంలో నొప్పి. కూర్చుండిన నొప్పి ఎక్కువగును. కదలిన మెల్లగ వుండును:

**మలాశయం** : దుర్వాసనతో అపానవాయువు విరేచనాలు కలుగును. మలాశయంలో కుట్టు చున్నట్లు నొప్పి, గుదస్థానం పగుళ్ళు బారును. దురద, నవ్వవుండును. మలాశయంలో మండుతున్నట్లుండును.

**మూత్రానికి సంబంధించిన** : మూత్రాశయం మూత్రవిసర్జన నాళంలో బలహీనంగ వుండుట. జలుబుతోపాటు మూత్రనాళంలో మూత్రం ఎక్కువ కూడి యుండును. మూత్రనాళంలో మూత్రపు వత్తిడి మాత్రం ఎర్రగ మంటగ నుండును.

**శ్వాసమండలం** : స్వరం బొంగురుపోవుట, చల్లనిగాలి పీల్చుకొనేందుకు ఆవేశం చెందును. తరచుగ దగ్గు వచ్చును. స్వరపేటికలు గలభాగంలో గిలిగింతలు పెట్టినట్లుండును. ఊపిరి పీల్చునపుడు భారంగను, ఛాతీ మధ్యభాగం నుంచి వత్తిడి యుండును. ఉపజిహ్వ నాలుక వెనుకనుండు పల్చని ఆకువంటి ఉపాస్థికి సంబంధించిన భాగంలో పిండినట్లుండునని భావించును. చెవుల వరకు నొప్పి వ్యాపించును. కాళ్ళు , చేతులు కుంటితనం కీళ్లకు సంబంధిం చిన వ్యాధులు కాలి మడిమమీద పుండ్లు వ్రేళ్ళు వ్యాధి వలన నొప్పులు గోళ్ల వరకు నుండును. కాలు చేయి మొదలగు అవయవం కోసిన పిమ్మట శరీరంతో మిగిలియున్న భాగం నరాల నొప్పులతో బాధపడును. పాదములు తడిగ నుండుటవలన చెడు లక్షణాలు కలుగును. కాళ్ళు, చేతులు ముఖ్యంగా చెయ్యికి సంబంధించిన భుజం పుండుతో నొప్పి వున్నట్లు భావించును. అలసట చెందును.

**నిద్ర** : తలనొప్పితో ఆవులించుట నిద్రమత్తుగా నుండును. గాఢనిద్రలో నోరు తెరచి ఆవులించినట్లుండును. కలలు, వేకువజామున రెండు గంటలకు మెలుకువ వచ్చును.

**లక్షణాలు మార్చువట్టి పరిస్థితి** : వెచ్చని గదిలోను సాయంత్రం వేళలోను బాధలధికంగా వుండును. ఆరుబయట గాలిలోను, చల్లని వాతావరణం గల గదిలోను బాధలు తగ్గిపోవును. ఈ మందును ఎర్రగడ్డ లేక నీరుల్లి నుంచి తయారుచేయుదురు.

# 60. ఎనకార్డియం ఒరియెంటాలిస్ (ANACARDIUM ORIENTALIS)

**రోగి లక్షణాలు :** నరాల శక్తి క్షీణించుట, మానసిక, శారీరక నిస్త్రాణ, అలసట మందకొండి తనం, ఏ పని చేయుట యిష్టం లేకపోవుట, అస్థిమితం, కోపం, తలనొప్పి, నిద్రపట్టకపోవుట, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, స్పర్శ, వాసన, చూపు, వినికిడి తగ్గిపోవుట భోజనం చేసిన మూడు గంటలకు కడుపునొప్పి రావడం జరుగును. ప్రతిది ఇతరులకు వ్యతిరేక స్వభావం గల మనస్తత్వం వుండును. ప్రతిదానికి అనుమానం కలుగు స్వభావం వుండుట, గుద స్థానంలో బిగించినట్లుండును. కడుపులో ఖాళీ వుండునట్లుండును. అరచేతులలో వుండు పులిపిరికాయలు నొప్పి, మంట, దురద, చిడుము, గజ్జితో బాధపడు రోగులకు చక్కగా పనిచేయును.

**మనస్సు :** స్థిరమైన అభిప్రాయాలు నడుచునపుడు ఆతృతగా అనుసరించుట నిజంగా లేనివాటిని వున్నట్లు భావించుట. తన ఆరోగ్యం గూర్చి అమితాందోళనతో కృంగియుంకుట. శాపం పెట్టుట, తిట్టుట మొదలగు దుర్మార్గ పద్ధతులుండును. మెదడు శక్తికి మించి అలయుటచే నిద్రపట్టకపోవుట, అస్తిమితం, మనసు పనిమీద గాని చదువుమీదగాని కేంద్రీకరించలేకపోవుట, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, పరధ్యానంలో వుండుట, సులభంగా కోపగించుకొనుట, ద్వేషంగా వుండుట, ఇతరులపైగాని, తనంతకుతానుగా నమ్మకం, విశ్వాసం లేకపోవుట, అనుమానం పొందుట, మానసిక శక్తులు సిధిలమైనట్టి ఒకరకపు ఉన్మాదం వలన సకాలమునకు ముందుగానే వృద్ధాప్యం వచ్చుట.

**తల :** తలత్రిప్పు, నొక్కినట్లు నొప్పియుండుట, ఒక బిరడా నుంచి అదిమినట్లుండు నొప్పి, మానసికంగా, శారీరకంగా అలసట వలన నొసట బాధగానుండును. తల వెనుక భాగం కణతలు నడినెత్తి బాధలుండును. ఆహారం తీసుకొను సమయంలో బాగుండును. కపాలం కప్పియుండు కేశములు గల చర్మంపై దురద, చిన్న చిన్న కురుపులు వుండును.

**కన్నులు :** కనుగ్రుడ్లు వుండే ఎముకల గూడుపైన బిరడా అదిమినట్లుండును. చూపు అస్పష్టంగా వుండును. వస్తువులు దూరంగా వుండునట్లు కనపడును.

**చెవులు :** చెవులలో బిరడా మూతినుంచి అదిమినట్లుండును. గట్టిగా శబ్దం వినపడి నట్లుండును.

**ముక్కు :** తరచుగా తుమ్ములు, చెడువాసన వచ్చుట. ముఖ్యంగా వయసుమళ్ళిన వారిలో జలుబుతో గుండెవడిగ బలంగ కొట్టుకొనును.

**ముఖము :** కన్నులచుట్టు నీలిరంగు చారలుండుట, ముఖం పాలిపోయినట్లుండును.

**నోరు:** నోటిలో బొబ్బలు నొప్పితో వుండును. దుర్గంధమైన వాసనవచ్చును. నాలుక వాచి నట్లు భావించును. మాట్లాడునపుడు అంతరాయం కలుగుట, విరేచనాలు కలుగునపుడు ఆటంకం కలుగుట, నోటినిండా లాలాజలం నిండియుండును. మెరియాలనుంచి పెదవులచుట్టు మంటగా వుండును.

**కడుపు :** కడుపునిండినట్లు , ఉబ్బినట్లుండి జీర్ణశక్తి బలహీనంగవుండును. కడుపు ఖాళీగా వుండునట్లు భావించును. తేన్పులు, వికారం, వాంతులు వుండుట, త్రాగినపుడు, ఆహారం తిన్నప్పుడు ఊపిరాడకుండును. ఆహారంగాని, పానీయంగాని ఆతృతగా మ్రింగుట కష్టంగా వుండును.

**ఉదరము :** ప్రేగులు, వాయువుచే గుడ గుడ ధ్వని చేయునట్లుండును. నొక్కునట్లును, గిల్లునట్లు నొప్పియుండుట, శూల నొప్పి యుండును.

**పురీషనాళం :** ప్రేగులు పనిచేయలేకపోవుట, వ్యర్థమైన ఆశతో వుండుట, బిరడాపై వత్తిడి వున్నట్లైతే పురీషనాళం బలహీనంగా వుండినట్లుండును. గుదస్థానద్వారం మూత్రద్వారం కండరాలు ముడుచుకొనిపోవుట ఈ కారణంగా సాధారణంగా విరేచనాలు కలుగుట కష్టంగా వుండును. గుద

స్థానంలో దురద, పురీషనాళం మంచు తేమగా అగుపడును.

**పురుషుడు** : ఇంద్రియలోలుడైన వారికి కలుగు దురద, కోరికలు అధికమగుట, కలలు లేకనే ఇంద్రియస్ఖలనమగుట, మల విరేచన సమయంలో శక్తి అంతమయిపోవుట.

**స్త్రీ** : తెల్లబట్ట, కుసుమ, నవ్వనొప్పితో వుండుట, ఋతుస్రావం కొంచెం కొంచెం స్రవించుట.

**శ్వాస సంబంధమైన** : ఛాతీలో వత్తిడి భారంగా వుండుట, శరీరంలో ఉష్ణం ఉంటూ ఆతృతగానుండును. బయట గాలిలో డ్రైవింగు చేసినట్లుండును. మాట్లాడుటవలన దగ్గు ఉధృతమగుట, పిల్లలలో చాలా ఉద్రేకం చెందినట్లుండును. కపాలంలో నొప్పి, ఆహారం భుజించిన తదనంతరం వాంతులు కలిగి దగ్గు వచ్చును.

**గుండె** : రోగికి తెలియునట్లు గుండె వడిగా, బలంగా కొట్టుకొనుట, వృద్ధాప్యంలో కలుగు జలుబులు, జ్ఞాపకశక్తి నశించుట, గుండె ప్రాంతంలో కుట్టుచున్నట్లు నొప్పి, గుండెను చుట్టియుండు రెండు పొరలుగల తిత్తి వాతం వలన రెట్టింపుగా కుట్టినట్లు బాధ వుండును.

**వీపు** : మెడ వెనుక భాగం బిర్రబిగియుట, బరువుగా నుండుట వలన భుజాలలో వత్తిడి మందముగా నుండును.

**కాళ్లు, చేతులు** : చేతి బొటన వ్రేలి నరాల నొప్పి, పక్షవాయువుల వలన కలుగు బలహీనత, మోకాళ్లకు పక్షవాయువున్నట్లు భావించుట, కట్టుకట్టినట్లుండుట. అరచేతులు, చేతులపైనగల పులిపిరి కాయకు పనిచేయును. వ్రేళ్ల వాపుతోను, బొబ్బలు పొక్కులతో వుండును.

**నిద్ర**: కలలు వలన ఆతృతగా వుండును. ఆఖరికి కొన్ని రాత్రులు నిద్రలేక ఆకృతిగ వుండును.

**చర్మము** : మానసికమైన ఉద్రేకంతో దురద, గజ్జివుండును. బొబ్బలు, పొక్కులు వాపుతో వుండును. గులతో కూడిన తట్టు సింధూర వృక్షమునకు చెందిన విషపూరితమైన చర్మవ్యాధి దద్దులు, చేతులపైన గల పులిపిరికాయలు మోచేయి మొదలు వ్రేళ్ల చివరి వరకు పుండ్లు ఏర్పడుట.

ఈ మందు జీడి మామిడి లేక నల్లజీడి గింజల నుండి తయారు చేయుదురు.

## 61. ఎస్పరాగస్ అఫిసినాలిస్ (ASPARAGUS OFFICINALIS)

**రోగి లక్షణాలు** : వాతనొప్పులు ముఖ్యంగా గుండె ఎడమ భాగం, భుజం నొప్పిగా వుండును. నడుచునపుడు ఉద్రేకం చెందును. మూత్రంలో ద్రవపదార్థాలు కూడిన లక్షణాలుండును. గుండె ప్రాంతంలో వాపు వచ్చి బలహీనతచెంది కృంగదీయును.

**తల**: మానసిక కలవరము. ఒకదానిని మరొక దానిగా భావించుట, జలుబు విస్తారంగా స్రావం స్రవించుట, ముక్కు అంతర్భాగంలోను, నొసట నొప్పిగా నుండును. ఉదయం పూట పార్శ్వపు తలనొప్పి వలన చూపులో ఒక భాగం అగపడక పోవుట. గొంతులో దగ్గు వుండునట్లు భావించుట, విస్తారంగా కాండ్రించుట వలన గొంతునుంచి కళ్లి జిగటవచ్చును.

**మూత్రం** : మూత్రాశయ ద్వారం నుంచి తరచుగా మూత్రం విసర్జించుట, కుట్టుచున్నట్లు నొప్పి, మంట, దుర్వాసన వచ్చుట మూత్రకోశపువాపు, జిగట, చీములాగ స్రవించుట శరీరంలో ఉత్పత్తియగు ద్రవములందు ఘన పదార్థం ఏర్పడుట.

**గుండె**: గుండెవడిగా రోగికి తెలియునట్లుగావేగంగా కొట్టుకొనుట, ఛాతీలో భారంగవుండుట, నాడులు విడిచి విడిచి పనిచేయును. ఎడమ భాగం భుజం గుండెనొప్పిగా వుండుట, గుండెకు సంబంధించిన తిత్తి పనిచేసేందుకు అంతరాయం ఏర్పడుట, ఊపిరి పీల్చుకొనుటకు భారంగా, కష్టంగా వుండును. ఛాతీకి నీరు పట్టుటకు మేలు చేయును.

**కాళ్లచేతులు** : వీపులో వాతనొప్పి, ముఖ్యంగా భుజం, కాళ్ల దగ్గర నొప్పి, ఎడమ భాగంలో

నాడి బలహీనత వలన దుర్బలంగా వుండు సందర్భంలో పనిచేయును. పలు రకాల పంటినొప్పికి పనిచేయును. ఈ రోగి నీటిని చూసినను, నీటి శబ్దం వినినను, తినుటకు, త్రాగుటకు ప్రయత్నించినను, గొంతుకలో ఈడ్పులు కష్టంగా వుండును. ఈ మందు శతమూలీ సతావర్ నుంచి తయారు చేయుదురు.

## 62. బుఫోరాన (BUFO RANA) - (POISON OF THE TOAD)

**రోగి లక్షణాలు :** నరాలు చర్మంపై పనిచేయును. గర్భకోశ సంబంధమైన లక్షణాలు, శోషరసనాళాలు క్రుళ్లి వాచుట, కండరాలు నిత్యం వణుకుచుండుటతో నుండు పక్షవాతానికి సంబంధించిన లక్షణాలు, వాతానికి సంబంధించిన లక్షణాలు చెప్పదగినవిగా నుండును. మత్తుపానీయాలు త్రాగుట కోరుట వలన నపుంసకత్వం , పిల్లలలో మానసిక దుర్బలత, ముందుగానే ముసలితనం వచ్చినట్లుండును. మూర్ఛకు సంబంధించిన లక్షణాలు రాత్రిపూట నిద్రలో పొర్లు, కంపనములు పట్టుకొనునట్లుండును. స్త్రీలు ఋతుస్రావం సమయంలో జననేంద్రియోద్రేకం చెందుట, గర్భకోశం మూత్రకోశం పల్చనగుట, ఏకాంత ప్రదేశంలో వుంటూ హస్తప్రయోగం చేసుకొనువారికి మంచి మందు.

**మనస్సు :** ఆరోగ్యం గురించి తాపత్రయం చెందుట, దుఃఖము విశ్రాంతి లేకపోవుట, ఇష్టం వచ్చినట్లు కరుచుట, కుయ్యో మొర్రోయని అరచుట, ఓర్వలేని తనం వుండుట, నరాల దుర్బలత, ఏకాంతవాసం వుండగోరుట, మానసిక దుర్బలత వుండును.

**తల :** తలపై వేడివలన ఎర్రగా ఆవిరియై పోయినట్లు తలంచుట, మెదడు తిమ్మిరిగను, స్పర్శజ్ఞానం కోల్పోయినట్లుండును. ముఖంపై చమటలు స్నానం చేసినట్లుగా వుండుట,ముఖము ఎర్రగా వుంటూ ముక్కు నుంచి స్రావం స్రవించుట, నొసట నొప్పి, ముక్కు నుంచి స్రావం స్రవించిన వెంటనే ఉపశమనమగును.

**కన్నులు :** వస్తువులు చూసేందుకు చక్కగా చూపుకనపడకపోవుట, కన్నులపైన చిన్న చిన్న పొక్కులు ఏర్పడినట్లుండును.

**చెవులు :** చెవులలో సహించరాని సంగీత నాదస్వరంలాగ వుండును. ప్రతి చిన్న శబ్దంకూడా కష్టంగా వుండును.

**గుండె :** సాగినట్లు భావించుట, గుండె వేగంగా కొట్టుకొనుట, గుండె నొక్కివేయునట్లు ముడుచుకొని పోయినట్లు వుండుట. నీటిలో గుండె ఈత యాదినట్లు తలంచుట.

**స్త్రీ :** ఋతుస్రావం త్వరితంగా నగుట, రక్తపు గడ్డలులాగ విస్తారంగా అకాలంలోవచ్చుట, నీళ్లలాగ తెల్లబట్ట విసర్జించుట, మూర్ఛకు సంబంధించిన లక్షణాలు సోకి ఉద్రేకం చెందుట, ఋతుకాలంలో మూర్ఛవచ్చుట, స్తనాలలో పుండు (కాన్సరు) పుట్టరణము. ఉపశాంతి కలుగజేయును. గర్భాశయంలోను, అండాశయంలోను మంట వుండును. స్త్రీ గర్భకోశపమెడ పుండ్లతోవుండుట, రక్తం దుర్వాసనతో స్రవించును. కాళ్లనుంచి నొప్పులు వచ్చును. పాలు రక్తంలాగ వుండును. నరాల వాపు, గర్భకోశం, యోని, పురీషనాళం, ముక్కు మొదలగు అవయవాల అమత్వక్కునుంచి కలుగు కాడవంటి భాగం గల మెత్తని కంతి.

**పురుషులు :** శుక్రం అప్రయత్నంగా స్ఖలనమగుట, అతి త్వరగా విసర్జించుట, నపుంసకత్వం, సంభోగ సమయంలో ఈడ్పుట గజ్జలలోని, చంకలలోని శోషరస గ్రంధులు వాచి పెద్దవగుట, అవయవమును చేత పట్టుకొను స్వభావముండును.

**కాళ్లు చేతులు :** నడుము, వీపులో ప్రక్కటెముకలకు కటి ప్రదేశమునకు మధ్యభాగం నొప్పి, కాళ్ళు, చేతులు తిమ్మిరిగా వుండుట, కండరాలు బాధతో ముడుచుకొని పోవునట్లుండుట, నడుచు విధానం ఆశ్చర్యంగా వుండుట, ఎముకలు వాపుతో నుండును.

**చర్మం :** చర్మం మచ్చలుంటూ స్పర్శజ్ఞానం లేకపోవుట, గోరుచుట్టు భుజంపై నొప్పిగా

వుండుట, సూక్ష్మక్రిములచే కలుగునట్టి చీము పట్టిన రాచకురుపు. ప్రతి చిన్న గాయానికి చీము పట్టినట్లుండును. బొబ్బలతో కూడిన చర్మవ్యాధి. అరికాలు అరచేతులలో పొక్కులు కలిగి వుండుట, దురద , మంట వుండును. రాచ పుండుకు పనిచేయును. ఈ మందు బోదురుకప్ప వీపునందుండు గ్రంధులు, చర్మం ద్వారా విసర్జించు విషం నుండి తయారు చేయుదురు.

## 63. కెన్నబిస్ ఇండిక (CANNABIS INDICA)

**రోగి లక్షణాలు :** కపాలంలో అర్థభాగం సరిగా వృద్ధిచెందక ఒక భాగం నొప్పి యుండుట, పార్శ్వపునొప్పి ఉధృతంగా వుండుట. ఇంద్రియాల ద్వారా తెలియని వాటిని తప్పుగా గ్రహించుట, లేని శబ్దం వినిపించుట, లేనివి అగుపడునట్లుండుట, ఆకాశం, భూమి తల్లక్రిందులుగా కనపడుట, ఉద్రేకం చెంది ఎక్కువ ఆనందంగా వుండుట, కాలం ఎక్కువగా వున్నట్లు భావించుట, ఏమి మాట్లాడేదీ అతనికే తెలియని విధంగా వాగుతూ వుండుట, ఆకస్మికంగా మూగతనంగా వుండుట, కదలికలు రోగి యిచ్చలో వుండవు. బుద్ధిహీనతతో జంటగా వుండునట్లు తలంచను , నిద్రపోవు స్వభావం వుండును. పక్షవాతం సంభవించబోవునట్లుండును. శరీరంలో ఏ ఒక చిన్న భాగం కూడా పెద్దగా మందంగా వున్నట్లుండును. గుదస్థానం ఉబ్బి ఒక బంతిపై కూర్చున్నట్లుండును. చదువుతూ వుండు సందర్భంలో అక్షరాలు ఒక దాని వెంట ఒకటి పరిగెత్తునట్లుండును, నాడి వేగం తగ్గుట, నత్తివుండును. కనుగ్రుడ్లు ముందుకు త్రోసుకొని వచ్చినట్లుండుట, మెడ యందలి థైరాయిడ్ గ్రంధి పెద్దదగుట.

**మనస్సు :** చైతన్యం కోల్పోయి పడినట్లుండుట, అసమర్థతవలన మనసులోని ఆలోచనలు మరల పుట్టుకవచ్చుట, అతిగ వదరుట లేక వాగుట, ఆత్మశక్తి అతిశయంగ వుండుట, కాలం చాల దూరంగా వుండునట్లు రెండవదశ వృద్ధాప్యం సంభవించినట్లుండును. కొన్ని కట్టి బెత్తములు దూరంగా వుండునట్లుండుట, నిరంతరం ఊహాజ్ఞానంలో వుండుట, ఆతృత జబ్బు స్థితి వుండుట, నిరంతరం భయం వలన పిచ్చిపట్టినట్లువుండుట. వెర్రి అనేది నిరంతరం కదలించుచుండుట, అతిగ మరచిపోవుట, వాక్యం పూర్తి చేయలేకపోవుట, అడ్డగించ శక్యంగాని నవ్వు వుండుట, భయంకరమైన మూర్ఛ దివ్యదృష్టి ఉద్రేకం చెందు స్వభావం వుండుట, మనస్సు శీఘ్రంగా మార్చుకొనుట, వాస్తవాలను గుర్తించలేకపోవుట, నీటిపై వెళ్ళునపుడు తల త్రిప్పును.

**తల :** మెదడు నుంచి అదురుపాటు చెందుట, యురేమియాచే కలుగు తలనొప్పి, తల వెనుక భాగంలో ధనారింపు భారంగా వుండుట, జీర్ణకోశం; ప్రేగులు గాలితో ఉబ్బరించుటవలన తలనొప్పివచ్చుట, తల దానంతట అదే కదలునట్లుండుట, రోగి అమితంగా వాగుతూ వుండుటవలన పార్శ్వపు తలనొప్పి సోకి బాధపెట్టుతూ యుండును.

**కన్నులు :** స్థిరంగా వుండుట చదువునపుడు అక్షరాలు ఒకదాని తరువాత ఒకటి పరిగెత్తుతూ ఉన్నట్లుండును. దివ్యదృష్టి దయ్యాల భీతివల్ల ఇంద్రియాల ద్వారా తెలియని వాటిని తప్పుగాగాని, భ్రాంతిగా గాని గ్రహించుట.

**చెవులు :** ధనారింపు శబ్దం, తేనెటీగల వలె 'హుం' అను శబ్దం చేయుచుండుట, శబ్దం ఎడతెగకుండా వుండును. పొయ్యిమీద వేడి నీరు ఉడుకు శబ్దం లాగవుండును. చెవులలో శబ్దానికి సహనశక్తి లేకపోవుట.

**ముఖము :** ముఖాకృతి ద్వారా మనో భావాలను వెల్లడిచేయుట, లేక తెలుసుకొనుట, నిద్రమత్తు, తెలివితక్కువగా నుండుట, పెదవులు జిగటగ బంకలాగ కలిసినట్లుండుట, నిద్రలో పండ్లు కొరుకుట, ముఖం, పెదవులు పొడిగా వుండుట, లాలాజలం జిగటగా నురుగులాగ అంటుకొనినట్లుండుట.

**కడుపు :** ఆకలి ఎక్కువగుట, గుండెకు సంబంధించిన ద్వారాలలో నొప్పి, వత్తిడివలన ఉపశమనం కలుగుట, ఉబ్బినట్లుండుట, జీర్ణకోశపు అధోద్వారానికి ఈడ్పులు కలుగుట,

ఉదరకోశమునకు సంబంధించిన భాగంలో రక్తనాళాలు అమితంగా బిగించినట్లుండుట, కడుపులో వాపు వచ్చి బ్రద్దలగునట్లు భావించుట.

**పురీషనాళం** : ఒక బంతిపై కూర్చుండినట్లయితే గుదస్థానంలో జ్ఞాన స్పర్శేంద్రియాలచే తెలియబడు రసరూప గంధ స్పర్శాదులు తెలియునట్లుండును.

**మూత్రానికి సంబంధించిన** : తరుచుగా మూత్ర విసర్జన సమయంలో సాయంత్రం పూట, మంటగ నుండును. కుట్టినట్లు నొప్పి, మంట వుండును. మూత్ర విసర్జన ముందుగా తరువాత విసర్జించు సమయంలో నొప్పి వుండును. గనేరియా సెగ వ్యాధిచే జననేంద్రియం నుంచి తెల్లగా, పచ్చగా స్రావం కారుట, మూత్రకోశం నుంచి గట్టిగా జిగురులాంటిది పిండునట్లు అమత్వక్కు చీముకారును. మూత్రం విసర్జించిన తదనంతరం, బొట్టుబొట్టులుగా మూత్రం కారుట.

**పురుషుడు** : సంభోగానంతర వీపునొప్పి పురుషులలో శిశ్నాగ్రభాగం నుంచి తెల్లని జిగురులాంటి అమత్వక్కు చీముకారుట. పురుషులందు కలుగు పట్టశక్యంగాని తీర్పుశక్యంగాని రతివాంఛ, ఇందుచే ఇంచుమించు నిత్యం శిశ్నం ఉద్రేకించి వుండి తరచు శుక్రస్ఖల నమగుచుండును. మానసికోద్రేకం కాలయాపన జరుగుట శిశ్నముద్రేకించి బాధాకరంగా క్రిందికి వంగుట, సాధారణంగా సెగలో ఇట్లు కలుగును. తొడలమధ్య గుదం నుంచి జననేంద్రియం వరకు గల భాగంలో వాపు వున్నట్లు తలంచుట, గుదస్థానం సమీపంలో వుండుట, కూర్చున్నట్లయితే బంతిమీద వున్నట్లుండును.

**స్త్రీ** : నల్లగ గడ్డలు లేకుండా ఋతుస్రావం విస్తారంగా నొప్పితో వుండును. ఋతుస్రావం కలుగు సమయంలో వీపులో నొప్పి, గర్భకోశంలో శూల నరాల బాధవలన అతిగా ఆందోళన చెందుట, నిద్రలేమి, వంధ్యత్వం, గొడ్రాలితనం, జననేంద్రియ వాంఛ ఋతుశూలవుండుట.

**శ్వాసమండలం** : వాతావరణ మందలి తేమ వలన వచ్చు ఆయాసం, ఉబ్బసం, ఛాతీలో భారంగా వుండుట, ఊపిరి పీల్చుట, కష్టంగా వుండుట, బాధలుండును.

**గుండె** : గుండెదడ వల్ల మేల్కొలుపును. తీక్షణమైన నొప్పి ఛాతీలో భారంగా వుండుట, నాడులు నీరసించినట్లుండును.

**కాళ్లు చేతులు** : కాళ్లకు కుడిచేయికి పక్షవాతం వుండుట, విశ్రాంతి కల్పించిన ఉపశమనం కలుగును. కాళ్లకు సంబందించిన అన్ని భాగాలలో పక్షవాతం సంభవించినట్లుండును. సులభంగా నీరసించిపోవుట, కొద్దిపాటి నొప్పులతో ఇచ్ఛాధీన కండరాల కదలికలు సమన్వయముగా నుండని వ్యాధి. ఇది వెన్నుపామునుంచివచ్చు నరాలకు సంబంధించిన వ్యాధి. కాళ్లలో మెరుపుతీగ వంటి బాధకలుగును. ఇంద్రియజ్ఞానములు సరిగనుండవు. నడుచునపుడు కాళ్లు సక్రమంగా పనిచేయక తూలుచూ నడుచును. కాళ్లు ఏ పరిస్థితిలో వుండునది రోగికి తెలియదు.

**నిద్ర** : అతినిద్ర, ఏ పనిచేయలేకుండుట, నిద్రపట్టని మొండి వ్యాధి, అపస్మారరోగం కలలో చనిపోయిన శవాలు లేక పీనుగులు వచ్చుట, భవిష్యత్‌ను చెప్పుట, నిద్రలో ఊపిరాడకపోవుట, అమితభయంతో ఛాతీలో భారంగా వుండుట. ఈ మందును గంజాయినుంచి తయారు చేయుదురు.

## 64. కెన్నబిస్ సతివ (CANNABIS SATIVA) (HEMP)

**రోగి లక్షణాలు** : సెగ వ్యాధి సోకిన వారికి ప్రారంభ దశలో పనిచేయును. జననేంద్రియాల నుంచి చీము వంటి స్రావం వచ్చుట, మూత్రం వెడలుట చాలా కష్టంగా వుండును. స్త్రీకి గర్భకోశపు మెడ వాపు వుండుట, గుదస్థానం గుండె భాగం తలపైన నీటి బిందువులు పడినట్లుండును. క్షయ వ్యాధిలో ఊపిరితిత్తుల దోషం పోగొట్టును. మూత్ర విసర్జన సమయంలో భీతి, నడుచునపుడు కాళ్ళు వంకరపోతూ నొప్పి వుండుట, చెవులలో హోరుమను శబ్దం వుండుట, నత్తి వుండును. మాట్లాడునపుడు, ఉపన్యసించునపుడు తన ఆలోచనలను, భావాలను ఒకదానికి బదులు మరొకటిగా మాట్లాడుట, నిలకడలేని మాటలు, సందిగ్ధమైన ఉపన్యాసం వుండుట, ఆతృతగా విరుద్ధంగా మాట్లాడుట, భోజనం చేసిన తరువాత అలసినట్లుండుట.

**తల :** తల తిరుగుట, తలపై నీటి బిందువులు పడినట్లుండుట, ముక్కు మూల భాగంలో అదిమినట్లుండుట.

**కన్నులు :** కంటిలో పువ్వువేయుట, కార్నియా మీద అపారదర్శకమగు పొర ఏర్పడుట, నరాలకు సంబంధించిన వ్యాధి వలన కంటి పొరలు వచ్చుట, పొగాకు, సారాయి త్రాగుట వలన తిట్టుట, పూర్తి గుడ్డివానిలాగ అయిపోతినని రోగి తలంచుట, దృష్టిలేక చూపు పొగమంచులాగ కనపడుట, కండ్ల వెనుక భాగం నుంచి వత్తిడి ఎక్కువై ముందుకు వచ్చినట్లుండుట, సెగవ్యాధి వలన కండ్లకలక వచ్చుట, కనుగ్రుడ్లు నొప్పిగా వుండుట, గ్రంథులు పెద్దవగుట, క్షయ స్వభావంతో నుండు తత్వంగల రోగులలో కలుగు కండ్ల వ్యాధులకు పనిచేయును.

**మూత్రం :** మలబద్ధం మొండి వ్యాధిలాగ వుండుట, మూత్ర విసర్జన బద్దలు కొట్టినట్లు నొప్పితో వుండుట, మూత్రనాళంలో కుట్టుచున్నట్లు బాధ, నొప్పి, వాపు, ఉబ్బినట్లుండుట, తాకిన పుండులాగ వుండుట, సెగవ్యాధి తరుణ దశలోను మూత్ర విసర్జన నాళం చాల సున్నితంగా వుండుట, కాళ్ళతో నడుచునపుడు ప్రత్యేకత యుండును. వృషనాళాలలో లాగుచున్నట్లుండును. మూత్రనాళం చివర వాపు వుండుట, అమిత జననేంద్రియోద్రేకం వుండుట, చీము అమత్వక్కు కలుగుట వలన మూత్రనాళం బంధించుట.

**స్త్రీ :** శారీర సంబంధమైన శక్తి అమితంగా శ్రమించుట వలన ఋతుస్రావం అగుపడకుండా పోవుట, మలబద్ధం వుండును.

**శ్వాస సంబంధమైన :** ఊపిరిపీల్చుట చాలా భారంగా వుండుట, గుండెదడ వుండుట, తప్పనిసరిగా లేచి నిలిచియుండుట, ఛాతీలో బరువుగా నుండుట. ఊపిరిపీల్చునపుడు గుడగుడ మని పిల్లమ్రోతలు లాగ శబ్దం వచ్చుట, దగ్గు ఆకుపచ్చని కళ్ళి జిగురులాగ వచ్చుట, రక్తం పడుట, కఫం కూడి వుండుట, దగ్గుట వలన కళ్ళి పైకివచ్చి ఉమ్ముట.

**గుండె :** గుండెనుంచి చుక్కలు పడుతూ వున్నట్లు భావించును. ఆకస్మికంగా గుండెపోటు వచ్చుట, గుండెదడ, బిగించినట్లుండుట, గుండెను చుట్టియుండెడి వెలుపలి పొరల వాపు వుండుట.

**నిద్ర :** భయంకరమైన కలలు వచ్చుట. ఉదయంపూట చాలా అలసట చెందినట్లుండుట, పగటిపూట నిద్రబోవు స్వభావం వుండుట.

**కాళ్ళు చేతులు :** బెనుకులు కలిగిన తదనంతరం వ్రేళ్ళు ముడుచుకొనిపోవుట, మేడ ఎక్కునపుడు మోకాలిచిప్ప స్థానం తప్పుట, మేడ ఎక్కునపుడు పాదాలు బరువుగా, భారంగా వుండునట్లు భావించును. పక్షవాతం సంబంధమైన నొప్పులు చీల్చునట్లుండుట.

ఈ మందును భంగాకు నుంచి తయారుచేయుదురు.

## 65. కాప్సికం (CAPSICUM)

**రోగి లక్షణాలు :** స్థూలకాయులు, బద్ధకస్తులు గలవారికి మంట చురుకుగా వుండుట, అమత్వక్కుతో వాపు, మలమూత్ర విసర్జన సమయంలో మంట, ఆరుబయట వెళ్ళేందుకు యిష్టపడకపోవుట, లేక భయపడుట, ఎల్లపుడు చలిచలిగా వుండుట, స్థూలకాయులు చూసేం దుకు అసహ్యంగా వుండును. పెద్ద ధ్వనితో దగ్గినపుడు వచ్చు దుర్వాసనలపై పనిచేయును. ఎడతెగని దగ్గు వచ్చినపుడు నొప్పివుండుట, మల విసర్జనానంతరం దాహముండుట ఏదైనా ద్రవపదార్థాలు త్రాగినపుడు ప్రతి గుటకకు గడగడ వణుకుడు పుట్టుట, రెక్కగూడుల మధ్య చల్లగా వుండుట, కడుపులో అపానవాయువు వెడలక ముందు నొప్పిగా వుండుట, మత్తు పానీయాలపై ఇచ్ఛలేకుండా చేయును. చెవి ముందుభాగం కురుపు, రక్త విరేచనాలు, నడుమునొప్పి, స్థూలకాయులు, చల్లని గాలిని సహించలేరు. కదలిక వలన భయంగా వుండుట.

**మనస్సు :** సులభంగా అమిత కోపం వచ్చు స్వభావం వుండును. ఇంటికి తొందరగా పోవలయుననెడి వాంఛచే బెంగగా, ఆందోళనగా వుండుట, నిద్రలేమి, ఆత్మహత్య చేసుకొను

స్వభావం లేక మనస్సు వుండుట, ఒంటరిగా వుండగోరుట, తీక్షణమైన మనస్సుగల లేక మెరియంవంటి లక్షణంగల మనస్సు వుండుట, అమితంగా త్రాగుటచే కలుగు ఉద్భృతమగు సంధి (వాగుడు) కలిగియుండుట.

తల: బ్రద్దలగునట్లు తలనొప్పి వుండుట, దగ్గినపుడు బాధ ఎక్కువగా వుండుట, ముఖం వేడిగా వుండును. దవడలు లేక చెంపలు ఎర్రగా వుండును.

చెవులు : చెవులలో మంట, తీవ్రమగు నొప్పియుండుట, చెవులు వెనుకవైపు వాపు, నొప్పి యుండును. స్తనాగ్రపు ఆకృతిగ్గల ఎర్రనివాపు వుండుట, కణత ఎముక క్రింద ఎత్తగు భాగం సన్నితంగా వుండుట, పెద్దగా పుండు ఏర్పడి తాకిన సున్నితంగా సహించలేని విధంగా వుండుట, చెవిలో పుండు ఏర్పడి చీముపట్టి రసి కారుచుండుట.

గొంతు : గొంతులో వేడిగా వుండునట్లు భావించుట, తరుణ దీర్ఘవ్యాధి మధ్యస్థితి కంఠ కర్ణనాళం లేక కర్ణాంతర నాళంలో ఎర్రని వాపు నొప్పితో వుండుట, గొంతుకలో పొడిగా, నొప్పిగా వుంటూ చెవుల వరకు వ్యాపించును. బీడీ, సిగరెట్లు, మత్తుపానీయాలు త్రాగువారిలో కలుగు గొంతుక వ్యాధి, మంట, దగ్గరకు నొక్కివేయునట్లుండుట, మ్రింగుట కష్టంగా వుండుట, అంగుడులో చిరునాలుక లేక కొండనాలుక వాచి ఎర్రగా వుండుట, ఉబ్బి సడలునట్లుండుట.

నోరు : పెదవులపై ద్రవపు పొక్కులు కలిగి తదనంతరం అచట పుండ్లు పడును. నోటియందలి అమత్వక్కు వాపు యుండుట, నోటినుంచి సరిపడని వాసన వచ్చుట, నోటినుంచి దుర్వాసన కొట్టుచున్నట్లుండును.

కడుపు : నాలుక చివరి వరకు మంట, జీర్ణశక్తి నీరసించియుండుట, ముఖ్యంగా బలహీనంగావుండు స్థితిలో కడుపు వాయుపూరితమై ఉబ్బినట్లుండుట, ఉత్తేజకరంగా వుంటూ తీవ్రమైన వాంఛ లేక కోరిక యుండుట, వాంతులు ఉదరకుహరంలో రొమ్ము ఎముక క్రింది భాగం కృంగినట్లుండుట, అతిగా దాహం త్రాగుట వలన గడగడ వణుకుచుండుట, తీవ్రమగు భయంచే ఉద్భృతంగా కంపించునట్లుండుట.

మలము లేక విరేచనము : విరేచనాలు రక్తం, చీముతో వచ్చును..మంటగా బాధగా వుండుట, మల విసర్జనానంతరం వెనుకవైపు లాగుచున్నట్లు నొప్పియుండుట, మలవిసర్జనానంతరం అమితంగా దాహం, విస్తారంగా రక్తస్రావంతో మూలశంక వ్యాధితో బాధపడుట, గుదస్థానంలో పుండ్లులాగ వుండుట, మలవిసర్జన సమయంలో తీవ్రమగు నొప్పి, బాధ యుండును.

మూత్రం : మూత్ర విసర్జన అణగారుట, మూత్ర విసర్జన బాధగా వుంటూ చుక్కలు చుక్కలుగా పడుట, మూత్రం తరచుగా విసర్జించుట మొత్తంపైన ఉత్తేజం చెంది సరియైన ఫలితం లేకపోవుట, మూత్రద్వారం మంటగా వుండుట, ప్రారంభంలో చుక్కలు చుక్కలుగా విసర్జిస్తూ తరువాత ప్రవాహంలాగా వచ్చుట, మూత్రకోశపు ద్వారం ఈడ్పులవలన ముడుచు కొని పోవునట్లుండుట, ద్వారంగుండా అమత్వక్కు వెలువడుటకు అంతరాయం ఏర్పడుట.

పురుషుడు : అండకోశం చల్లగా వుండుట, నపుంసకత్వం వృషణాలు బలహీనంగా వుండుట, వృషణాలలో స్పర్శజ్ఞానం లోపించుట, మెత్తగా, సన్నగా అగుట, క్షీణించుట, సెగవ్యాధి వలన శిశ్నం ఉద్రేకించి బాధాకరంగా క్రిందికి వంగుట, ప్రోస్టేటు గ్రంధిలో నొప్పి, అతిగా మంట వుండుట.

స్త్రీ : ముట్లుడుగు కాలంలో నాలుక చివర మంట వుంటూ అంతరాయం కలుగును. స్త్రీకి ముట్లుడుగు కాలంలో గర్భకోశానికి సంబంధించిన స్రావం వాంతులు వికారంతో కలుగు నట్లుండుట, అండాశయానికి చెందిన భాగంలో కుట్టుచున్నట్లు నొప్పి వుండునట్లు భావించుట.

శ్వాస సంబంధమైన : ఛాతీలో నొక్కివేయుచున్నట్లుండుట, శ్వాస బంధించుట, స్వరం బొంగురుపోవుట, గుండె అడుగుభాగం చివర నొప్పి, తాకిన బాధగా వుండును. తరచు వస్తూ వుండు హ్రస్వమగు దగ్గు, ఊపిరితిత్తులనుంచి దుర్వాసన బయటకు వచ్చినట్లుండుట, శ్వాస

కష్టంగా నుండుట, ఛాతీ, తల ముక్కలు ముక్కలుగా ఎగిరిపోవునట్లుండుట, మందుగుండు సామగ్రి ప్రేలునట్లు పెద్ద శబ్దంతో దగ్గు వుండుట, ఊపిరితిత్తులలో సంభవించబోవునట్లుండుట, గాంగ్రేను తగ్గినపుడు మూత్రకోశం, కాళ్లు, చెవులు మొదలగు అవయవములన్నియు నొప్పికలిగి వుండును.

**కాళ్ళు, చేతులు :** తుంటి, తొడల ఊర్ధ్వభాగంనుంచి పాదాల వరకు నొప్పులుండుట, తుంటినుంచి కాలుకు దిగునట్టిసయాటిక నరం నొప్పి. ఈ నొప్పి తుంటిలో కలిగి ఒక్కొక్కప్పుడు మోకాలికి, పాదానికి కలుగును. పిరుదులు, తొడ వెనుక భాగం, పిక్కలు బాధకు గురియగును. వెనుకకు వంగినట్లుండి బాధ కలిగినట్లుండును. దగ్గినపుడు బాధ మోకాలు బిర్రబిగిసినట్లుండి బాధ కలిగినట్లుండి నొప్పులుండును.

**జ్వరం :** చలి, కోపంతో వుండు నీరుగాని మద్య పానీయాలుగాని త్రాగిన తరువాత వణుకుచున్నట్లుండును. చలి వాపు నుంచి ప్రారంభించును. ఉష్ణం వలన ఉపశమనం కలుగును. చలి వచ్చు ముందు దాహం అతిగా వుండును.

ఈ మందును మిరపకాయనుంచి తయారు చేయుదురు.

## 66. కార్బొవెజట బిలిస్ (CARBO-VEGETABILIS)

**రోగి లక్షణాలు :** ఈ రోగి బద్ధకస్తుడుగను, క్రొవ్వు పదార్థం అతిగా. గలవారుగాను, సోమరిపోతులాగా వుండుట, దీర్ఘకాలికంగా వుండునట్లు తెలియజేయును. రక్తకేశనాళికలలో రక్త ప్రవాహం నిలిచిపోయినట్లుండును. ఈ కారణంగా చల్లగా మారుట, నీలిరంగు గల నల్లని మచ్చలు ఏర్పడుట, శరీరం నల్లగా మారుట, మంచుగడ్డలాగా కలిగినట్లుండును. సన్నిపాత జ్వరం మొదలగు సూక్ష్మజీవులు వున్నట్లు కనుగొనుట, తెలుసుకొన్నపుడు ఇతర వ్యాధుల వలనను, వృద్ధాప్య దశలో వున్నవారలకు ఇంద్రియ దౌర్బల్యం, కలరా, టైఫాయిడ్ వ్యాధుల వలన బలహీనత, శారీరక నాడీమండల నిస్త్రాణ చెందిన వారలకు, రుద్రవాతము, అతిగా గాలి పీల్చుటకు యిష్టపడుట, ముక్కు చల్లగాను, ముఖం పాలిపోయినట్లుండును. కాళ్ళు చేతులు చల్లగా వుండుట, అవసానదశలో ఉష్ణవాయువును కోరుట, మోకాళ్ళ వరకును, చంకలో చల్లగా వుండుట, కడుపులో వాయువు ఎక్కువగా వుండునపుడు వచ్చు కడుపు నొప్పి, పుల్లని తేన్పులు అజీర్ణం, గుండెలో మంట, రోగి అవసానదశలో చమటల ద్వారా నీరు అమితంగా కారుట, రొంప సంబంధమైన లక్షణాలతో గొంతుక, కండ్లు, ముక్కులు, ఛాతీ, జననేంద్రియాలు, మూత్రపిండాలు, ప్రేగులు, కడుపు సంబంధించిన దోషాలను హరించును. రక్తనాళాలు ఉబ్బుట, పెదవులు, చేతులు ఉబ్బి నీరసించుట, మాంసము, క్రొవ్వుపదార్థాలు జీర్ణం కాకపోవుట.

**మనస్సు :** చీకటి అంటే అయిష్టత, దయ్యాలు, పిశాచాల వలన భయం, ఆకస్మికంగా జ్ఞాపకశక్తి కోల్పోవుట.

**తల :** జననేంద్రియ లోలత అతిగా వుండుట వలన నొప్పి వచ్చుట, సులభంగా కేశములు రాలిపోవుట, వెంట్రుకల అడుగుభాగం పుండ్లులాగా వుండుట, పడకలో పరుండినపుడు కపాలమును కప్పియుండు కేశములు గల చర్మము దురదగా వుండుట, తల భారంగా అదిమి నట్లుండుట, వికారం, వాంతులు, చెవులలో గంటనాదం గల శబ్దం వుండుట, ముఖం నొసట మొటాలుండును.

**ముఖము :** ముఖం ఉబ్బినట్లుండి నీలిరంగులాగా మారినట్లుండుట, ముఖం పాలిపోయి కృంగి నల్లగా మారుట, చమటలుపట్టి చలి కలిగించునట్లుండుట, నీలిగా మారుట, భయాందోళనతో విచారంగా వుండుట, చెంపలు వివిధ రంగుల మచ్చలు కలిగియుండుట, ముక్కు ఎర్రగా మారుట.

**కన్నులు :** గాలిలోగాని నీటిపైగాని తేలెడు నల్లని మచ్చలులాగా కనపడుట, కంటి కండరాలు నీరసంచే చూపు దుర్బలంగా వుండుట, కండ్లలో మంట, కండరాల నొప్పులు.

చెవులు : చెవులనుంచి రసి, చీము స్రావంతోపాటు చర్మవ్యాధులుండుట, చెవులు పొడిగా వుండుట, అస్వభావికంగా ఏర్పడు చెవిలో గుమిలి వలన చెవి రంధ్రాల నుంచి చర్మవ్యాధి వలన చర్మం పొరలు పొరలుగా ఊడిపోవుచుండును.

ముక్కు : ముఖం పాలిపోయినట్లుండి ముక్కులనుంచి రక్తస్రావం కలుగుట, వ్యాధి కాల నియమంగా కలుగుచుండుట, శక్తికిమించి పనిచేసిన తదనంతరం రక్త స్రావం కలుగుట, ముక్కు మొనయందు ఎర్రగా పక్కుగట్టిన గజ్జిలాగా వుండుట, ముక్కు రంధ్రాల చుట్టూ దురద వుండుట, ముక్కుపై శిరలు శాశ్వతంగా ఉబ్బినట్లుండుట, ముక్కులో ఒక మూల దద్దులు, బొబ్బలు వుండును. ముఖ్యంగా వెచ్చని వాతావరణంలో తడిగావుంటూ దగ్గుతో జలుబు వుండును. తుమ్ములకు సరియైన ఫలితం యివ్వనపుడు ఈ మందు పనిచేయును.

నోరు : నాలుకపై తెల్లని పుండ్లు కలిగి నాలుకపై తెల్లని లేక పచ్చని, బూడిదరంగు కలిగియుండుట, పండ్లతో నములుచున్నట్లు చాల సున్నితంగా వుండుట, ఇగురులు వెనుకకు పోయినట్లుండుట, లాలాజలం సులభంగా కారుచుండును. పండ్లు శుభ్రం చేసుకొను సమయంలో చిగురులనుంచి రక్తం చమర్చుచుండుట, పండ్లలో మెత్తలనుంచి ఇగుళ్ళనుంచి చీము స్రవించుట.

కడుపు : తేన్పులు, భారంగా వుండుట, నిండినట్లుండుట, నిద్రమత్తు, జీర్ణకోశం, ప్రేగులు గాలితో ఉబ్బినట్లుండి నొప్పి, బాధగా వుండును. ఆహారం తీసుకొన్న తదనంతరం, పానీయాలు త్రాగిన తరువాత తేన్పులు వచ్చుట, తేన్పులవలన తాత్కాలికంగా ఉపశమనం కలుగును. అమిత దుర్వాసన, పుల్లని వాసన, కుళ్లిన వాసన గల తేన్పులు వచ్చుట, అజీర్ణంచే నోటిలో నీరు అధికంగా ఊరుట, ప్రేగులు ఉబ్బి ఊపిరి పీల్చుటకు ఆయాసంగా వుండుట, ఉదయంపూట వికారం, కడుపులో మంట, మంట వీపు వరకు వ్యాపించి వెన్నుపాము వరకు ప్రాకినట్లుండుట, ఉదరం ఉబ్బుతో వుండుట, ఛాతీ వరకు నొప్పి వ్యాపించి ముడుచుకొనిపోవునట్లుండుట, కడుపు మూర్చపోయినట్లుండుట, ఆహారం తీసుకొన్నప్పటికీ ఉపశాంతి కలుగకపోవుట, వణుకుతో కూడిన నొప్పుల వలన రోగి వంగినట్లుండుట, ఆహారం తిన్న అర్ధగంటకు కలత చెందినట్లుండుట, మెల్లగా జీర్ణమగును. పాలు, మాంసం, క్రొవ్వుపదార్థాలపై అయిష్టత వుండుట, కడుపు మండలానికి సంబంధించిన భాగంలో చాలా సున్నితంగా వుండుట, శిశువుల పెంచు స్త్రీలలో వచ్చు కడుపునొప్పికిని, అతిగా ప్రేగులు గాలితో ఉబ్బరించినట్లుండి దుర్వాసనతో పుల్లని తేన్పులు వచ్చుట.

ఉదరం : బరువు ఎత్తునట్లుండు నొప్పివుండుట, శరవేగంగా పోవునట్లు శూల ఉండుట, అతిగ ప్రేగులనుంచి దుర్వాసనతో అపానవాయువు వచ్చుట, ఉదరం నడుముచుట్టు, బట్టలు బిగుతుగ వుండిన సహించలేకపోవుట, ఉదరం పెద్దగ ఉబ్బినట్లుండుట, గాలిపోతూ వుండిన తగ్గును. వాయువుగల కడుపు ఉబ్బరం ఉంటూ నొప్పివుండుట, కాలేయంలో నొప్పి చిన్నప్రేగుల రంధ్రాల ద్వారా కొన్ని వ్యాధులు సంభవించుట.

పురీషనాళం పెద్దప్రేగు చివరిభాగం మరియు విరేచనాలు : జీర్ణకోశంలోవేడి, తడిగవుండుట, అపానవాయువు దుర్వాసనతోవచ్చుట, పురీషనాళంలో దురద, మంట, కొరుకుకు తినుచున్నట్లుండు తీవ్రనొప్పి చురుక్కుమనుట, పురీషనాళం నుంచి తడిగ వుంటూ శరీర ధాతువు నాశనం చేయును. బూజుపట్టి తడిగ జిగురులాగ స్రవించుట, గుదం నుంచి జననేంద్రియ భాగంలో తేమగ తేమగ వుంటూ నవ్వురద, పుండులాగ నొప్పి రాత్రిపూట వుండును. పురీషనాళం నుంచి రక్తం కారుట, గుదం మంట, సిరలు ఉబ్బిమంట, వృద్ధాప్యం దాపురించిన వారలలో నొప్పితో విరేచనాలు కలుగుట, తరచుగ ఎడతెగకుండ పసుపువలె పాలిపోయి వుండుట, విరేచనాలు దుర్వాసన, మంట, మూల శంక, గుదం నుంచి చర్మం ఊడినట్లుండుట, మూలవ్యాధిలో మంట, నల్లగవుండుట, విరేచనాలు కలిగిన తదనంతరం నొప్పి వుండుట

**పురుషుడు** : ప్రోస్టాటిక్ గ్రంధి నుంచి వచ్చెడి పల్చనిద్రవం విరేచనాల ద్వారా వచ్చుట, తడి, దురద తొడ అండకోశం దగ్గర వుండుట.

స్త్రీ : ఋతుస్రావం ముందుగగాని అకాలంలోగాని విస్తారంగ స్రవించుట, రక్తం పాలిపోయినట్లుండుట, స్త్రీ బాహ్య జననేంద్రియం ఉబ్బినట్లుండుట, నోరు, నాలుక జననేంద్రియంలో కలుగు తెల్లని చిన్నపుండ్లు, ఋతుస్రావం కలుగుముందు తెల్లబట్ట, జిగటగ, ఆకుపచ్చగ పాలవలె ఒరువు కలిగియుండుట, ఋతుస్రావం కలుగు కాలంలో చేతులు, అరికాళ్లు మంటలుండును.

శ్వాససంబంధమైన : స్వరపేటికలుగల భాగంలో దురద, దగ్గు ఉండుట, ఈడ్పులు, నోరు తెరచుకొనినట్లుండుట, శ్లేష్మంతో వాంతులు కలుగుట, ముఖ్యంగ ప్రారంభదశలో కోరింత దగ్గు వుండును. స్వరం బొంగురుపోవుట, మాట్లాడునపుడు సాయంత్రం బాధలధికమగుట, సాయంత్రం ఊపిరి పీల్చుట కష్టంగా వుండుట, ఛాతీలో రాపిడి పుండులాగ నొప్పి, ఆయాసం, ఛాతీలో శ్లేష్మం గుడగుడ శబ్దంతో వుండుట, చాలసేపు దగ్గినగాని కళ్లెపడకపోవుట, దగ్గినపుడు ఛాతీలో మంట, ఆరుబయట గాలిలోను, ఆహారం తిన్న తరువాత బాధలధికమగును. దగ్గినపుడు ఈడ్పులు, ముఖం నల్లగ మారుట, కళ్లె దుర్వాసనతో వచ్చుట, నిర్లక్ష్యం వలన ఊపిరితిత్తులు వాపుతో వుండుట, శ్వాస తడిగా వుండుట, తప్పనిసరిగా గాలి విసరమని అడుగుట, గాలి కోరుట, ఊపిరితిత్తుల నుంచి రక్తస్రావం కలుగుట, వయసుమళ్ళిన వారిలో చర్మం నల్లగా మారి ఆయాసం వచ్చును.

**కాళ్లు చేతులు :** భారంగా వుండుట, బిర్రబిగియుట, పక్షవాత స్థితియున్నట్లు భావించుట, కాళ్లు చేతులు నీరసించి కండరాలు శక్తి కోరుట, కీళ్లు బలహీనతగా వుండును. మోకాలి ఎముకలు నొప్పిగా వుండును. పాదాలు ముడుచుకొనిపోవునట్లుండును. పాదాలు, కాళ్లు చెమటలు పట్టి తిమ్మిర్లుగా వుండును. మోకాలు క్రింది భాగం చల్లగా ఉండును. కాలివ్రేళ్లు ఎర్రగ వాచినట్లుండును. కాళ్లు చేతులు, ఎముకలు మంట, నొప్పి..

**జ్వరం :** దాహంతో చలి, మధ్యాహ్నం చలివచ్చుట, పలు భాగాలలో మంట, ఆహారం తిన్నవెంటనే చెమటలు పట్టుట, క్షయ జ్వరం, నిస్త్రాణ కలిగించు చెమటలు పట్టుట.

**చర్మము :** నల్లని తేమగల కుముకు మచ్చు లేర్పడుట, పలు రకాల వర్ణములు గల సిరలు ఉబ్బినట్లుండుట, దురద, సాయంత్రం బాధలధికమగుట, వెచ్చని పడకలో చర్మం తేమగ వుండుట, చెమట బిందువులు వేడిగ వుండుట, దీర్ఘకాల శయ్యాగతుడైన రోగికి కలుగు ప్రక్కపుండ్లు పుండ్ల నుంచి రసికారుట, ముసలితనంలో ప్రారంభదశలో కాలివ్రేళ్ళకు కలుగు కాంగ్రేను, సాధారణ బలహీనత వలన వెంట్రుకలు రాలిపోవుట, సాధారణంగా నొప్పిలేనట్టి మెల్లగ మానునట్టి పుండ్లు కలుగుట, మంట, నొప్పి వుండును. పుండ్ల నుంచి రసి దుర్వాసనగ విసర్జించుట, సిరలు శాశ్వతంగ ఉబ్బి పుండ్లు ఏర్పడుట, రాచపుండు, ఇది సెగ్గెడ్డకన్న పెద్దదిగ నుండి అనేక తూట్లుపడి చీము స్రవించును. సెగ్గెడ్డకు ఒకే తూటు పడి చీము స్రవించును. దీనితో సాధారణంగ జ్వరం ఉండును. ఈ మందు బొగ్గు, కూరగాయలకు సంబంధించిన బొగ్గునుంచి తయారుచేయుదురు.

## 67. కాలోఫైలం (CAULOPHYLLUM)

**రోగి లక్షణాలు :** ఇది స్త్రీలకు సంబంధించిన మందు. స్త్రీలకు గర్భకోశం బలహీనతవలన-గర్భస్రావం జరుగును. ఋతుశూల నొప్పులు, చర్మం రంగు మారుట, మణికట్టు, వ్రేళ్లు, చిన్న కీళ్ళలో మేహవాత నొప్పులుండుట. ప్రసవమునకు కొన్ని వారాలకు ముందు నుంచి వాడిన బాధలేకుండా ప్రసవించును. గర్భకోశపుమెడ బిరుసుగ ఉండుటవలన సాగకపోవుటచే ప్రసవించలేకపోవుట, ప్రసవవేదనలో నొప్పులు సరిగ రాకుండట, నొప్పులు తీవ్రంగా వున్నను ప్రసవించకపోవుట, తెల్లని బట్ట స్రవించుట, స్త్రీలలో వచ్చు దొంగనొప్పులకు పనిచేయును.

**కడుపు :** గుండె ప్రాంతం నొప్పి, గుండెలో మంట, కడుపు పొర్లు, ఈడ్పులు కలిగియుండుట, ఈడ్పులలో అజీర్ణం కలిగియుండుట.

**స్త్రీ :** ప్రసవ సమయంలో గర్భకోశం బిర్రబిగిసి విపులీకరించకపోవుట, ఇందుచే ప్రసవము కానేరదు. తీవ్రమైన ఈడ్పులు, నొప్పులుండుట, అన్నివైపులకు పైకి ఎగురునట్లుండుట, అభివృద్ధి

లేకుండ వణుకుచుండుట, దొంగనొప్పులుండుట, మరల ప్రసవనొప్పులు కలుగునట్లు చేయుట, ప్రసవించేందుకు పురోభివృద్ధి చెందుట, నొప్పుల తదనంతరం తెల్లబట్ట గర్భకోశానికి సంబంధించిన భాగం నీరసించుటవలన గర్భవిచ్ఛిన్నమునకు అలవాటుపడుట, గర్భకోశపు మెడ యందు సూదులతో పొడుచునట్లు నొప్పియుండుట, ఋతుశూల, ఇతర భాగాలకు కూడ నొప్పులు ప్రాకినట్లుండుట, దీర్ఘకాలం నుంచి స్త్రీ జననేంద్రియం నుంచి స్రవించుస్రావం, అధికంగా నీరసం వుండును.

చర్మం : గర్భకోశానికి సంబంధించిన వ్యాధులు, ఋతువుకు సంబంధించిన వ్యాధివలన స్త్రీ చర్మం రంగు మారినట్లుండుట.

కాళ్ళు చేతులు: చిన్న కీళ్ళలో బిగుసుకుపోయినట్లుండుట, చేతివ్రేళ్ళు కాలివ్రేళ్ళు చీల మండలు మొదలగునవి తీవ్రంగా లాగుతూ యున్నట్లు నొప్పులుండుట, మణికట్టులో నొప్పి, చేతులు కోయుచున్నట్లు నొప్పులుండుట, ప్రతికొన్ని నిముషాలకు శరీరంలో నొప్పులు మారుతూ ఉండునట్లుండును. ఈ మందు బ్లూకోహోస్ మరియు స్క్వారూట్ నుంచి తయారు చేయుదురు.

## 68. అశ్వగంధ (ASHWAGANDHA)
## (WITHANIA SMNIFERA)

రోగి లక్షణాలు : అశ్వగంధ మానసిక వ్యాధులకు ఒక గొప్ప శక్తివంతమైన మందు. బుద్ధిమాంద్యం, జ్ఞాపకశక్తి క్షీణించుట, ఏ కారణంచేతనైనను మనసునకు శాంతి నశించుట, ధాతు దౌర్బల్యం వలన ఏ పని చేయలేకపోవుట. ఇష్టం ఉండకపోవుట, యవ్వనదశ క్షీణించి వృద్ధాప్యదశ వచ్చినట్లుండుట, సిఫిలిస్ (సవాయి) గనేరియా (సెగవ్యాధి) మొదలగు వ్యాధుల వలన దౌర్బల్యం సంభవించినపుడు పనిచేయును. నరాల బలహీనత పురుషాంగం లేపనశక్తి తగ్గిపోవుట. నపుంసకత్వం వుండుట, స్త్రీలలో ఋతుస్రావం సక్రమంగా కలుగకుండుట, గర్భకోశవ్యాధులు, తెల్లబట్ట, గుండెదడ, విద్యార్థి ఒక విషయంపై మనస్సును కేంద్రీకరించ లేకపోవుట, తాను ఏమి చదివినది తెలపలేకపోవుట, లక్షణాలకు ఈ మందు గొప్ప స్నేహకారి. కండరాలు నరాల బలహీనత, సిఫిలిస్, గనేరియా లక్షణాలు గలవారికి ఎడతెగకుండ నిరంతరం వాడదగ్గ మందు. శుక్రనష్టం గలవారలకు సహాయకారిగ పనిచేయును. అన్నిరకాల ఇంద్రియ లోపం వలన కలిగిన నపుంసకత్వానికి ఇంద్రజాలంలాగ పనిచేయును. వంధ్యత్వం నివారించును. సాధారణంగావచ్చు అన్నివిధాల బలహీనతలకు ముఖ్యౌషధం. ఈ మందు పెన్నేరు గడ్డి నుంచి తయారుచేయుదురు.

## 69. అల్స్టోనియా స్కాలారిస్ (ALSTONIA SCHOLARIS)

రోగి లక్షణాలు : మలేరియా జ్వరంతోపాటు విరేచనాలు, గ్రహిణి రక్తక్షీణత, జీర్ణశక్తి క్షీణించుట, బలహీనతవలన ఉదరం కడుపులో కృంగునట్లుండుట, జ్వరాలు వచ్చిన తదనంతరం క్షీణించినవారికి బలం చేకూర్చి కోలుకొనేటట్లు చేయును.

క్వైనైన్ మందుకంటే చాల చురుకుగా పనిచేయును. క్వైనైను మలేరియా జ్వరాన్ని అణిచి వేయును. అల్స్టోనియా మందు మలేరియా జ్వరాన్ని సమూలంగ శాశ్వతంగా నివారించును. అన్ని రకాల విడుపు జ్వరాలను క్వైనైన్ కంటే అతిత్వరగా నివారించును.

ఉదరము : జీర్ణకోశంలో ఆహారపదార్థాలు జీర్ణంగాక గుడగుడమంటూ అవస్థపడు సమ యంలో పనిచేయును. భోజనం చేసిన వెంటనే విరేచనాలు కలుగును. ప్రేగుల క్రింది భాగంలో ఉష్ణం చిరచిరలాడునట్లుండును. మురికినీరు, మలేరియా నుంచి విరేచనాలు కలుగుట. నొప్పి లేకుండ నీళ్లమాదిరి విరేచనాలు కలుగుట. అతిసార వ్యాధివలన ఆందోళన చెందుట, ప్రేగులలో కండరాలు ముడుచుకొని పోయినట్లుండును.

## 70. రాన్‌వాల్ఫియా సర్పెంటిన (RANWOLFIA SERPENTINA)

రోగి లక్షణాలు : అధిక రక్తపోటు (బి.పి.), రోగి కోపము, విసుగుచెందును. కేంద్రీయ నరాలు

పద్ధతి ప్రకారం స్థితిలో లేకుండుట. ఉన్మాదం, పిచ్చి ఉధృతమైన పిచ్చివాని లక్షణాలుండును. ప్రసవ సమయంలో బాలింతలందు అధికమగుచుండు ఉన్మాదం, బాలింతతనముగయుండు సమయంలో జ్వరం వుండుట, నిద్రవచ్చునట్లు పనిచేయు మందు. ఈ మందు సర్పగంది మూలికనుంచి తయారుచేయుదురు.

## 71. చెనొపోడియం (CHENOPODIUM)

**రోగి లక్షణాలు** : ఆకస్మికంగ తలతిరుగుట, తల త్రిప్పు కలుగుచుండు అంతర్గత కర్ణవ్యాధి, రుద్రవాతం, మెదడులోని రక్తనాళాలు పగులుటచే కలుగు పక్షవాతం, కుడిభాగాన కలుగు పార్శ్వవాయువు, ఒక వైపు సోకు పక్షవాయువు భావాలను మాటలతో తెలుపలేకపోవుట, గురకగ శబ్దంతో నుండు శ్వాస, చెవికి సంబంధించిన నరాలు ఉద్రేకం చెందుట, కొంకి క్రిమివ్యాధి, ప్రేగులందుండు ఏలికపాములు చెనొపోడియం ఆయిల్ (నూనె) లోపలికి వేసిన నయమగును.

చెవులు: చెవికి సంబంధించిన నరాలు అమిత శబ్దత్వ స్థితిలో వుండుట, ధ్వని శబ్దం చెవుడుకు తగినది. వాహనాలు వెళుతూయున్నపుడు వచ్చు శబ్దం సహించలేకపోవుట, చెవులలో హోరుమను శబ్దం వుండుట, టాన్సిల్సు వాపు, చెవివ్యాధుల వలన వచ్చు తలత్రిప్పుకు మేలుచేయును.

**వీపు : వెనుకవైపు** : ఛాతీద్వారా కుడి భుజాల కోణము వెన్నుపాము రెక్క గూడు మధ్య తీవ్ర నొప్పియుండుట, కూర్చుండిన ఎక్కువగును, వెనుకకు వంగిన తగ్గును.

మూత్రము : మూత్రవిసర్జన నాళంలో చురుకుతో ఉండునట్లు స్పర్శజ్ఞానం ఉండుట, పచ్చగ నురుగులాంటి మూత్రం విస్తారంగ విసర్జించుట, మడ్డిలాగ పచ్చగవుండుట, మూత్రం అప్రయత్నంగ పోవుట.

ఈ మందు తోట ఆకుకూర నుంచి తయారుచేయుదురు.

## 72. కాకస్ కాక్టి (COCCUS CACTI)

**రోగి లక్షణాలు** : కోరింతదగ్గులు, కంపనములతో నుండు పరిణామాలకు ప్రత్యేకతగల మందు. కోరింతదగ్గు వలన వాంతివచ్చుట, మూత్రాశయం జలుబుతో ఉండుట, మూత్ర పిండాలలో ఈడ్పులతో నొప్పులుండుట, ఉదరకుహరంలో మలవిసర్జనగాని, మూత్రవిసర్జనగాని బాధతో ముక్కునట్లు ప్రయత్నంచేయుట, మూత్రోత్పత్తి లేకపోవుట, ఉదరకుహరానికి నీరుపట్టుట, శిశువు ఉదయం లేవగానే కోరింత దగ్గు కలుగును. నోటి నుంచి కళ్ళి తీగవలె వ్రేలాడునట్లుండును. గొంతులో ఉధృతంగ గుల, గర్భకోశం నుంచి మూత్రపిండాల నుంచి కలుగు రక్తస్రావాలు అరికట్టును. స్వరపేటికల వెనుక ఏదో ఉండినట్లుండును. ఋతుస్రావం కాల నియమాలకు ముందుగ అగుపించు విస్తారంగ నల్లగ చిక్కగ నుండును. వంటికి నీరుపట్టుట, కొండనాలుక పెద్దదై బాధపెట్టును. ప్రతిది గుండెవైపు పోటుగా వుండునపుడు పనిచేయును.

**మనసు** : వేకువజామున మధ్యాహ్న కాలంలో రోగి దుఃఖంగాను విచారంగ వుండుట.

**తల** : నిద్ర తరువాత ఆలసట, బాధలధికంగ ఉండుట, తల వెనుకకు వంచిన బాధలధిక మగును. తల ఎత్తుగ ఉంచిన బాధలు తగ్గును. ఉదయం పూట కుడి కంటిమీద మందంగ నొప్పి ఉండుట, పైకనురెప్పకును కనుగ్రుడ్డుకును మధ్యలో ఏదో పదార్థం ఉండి బాధించునట్లుండుట.

**శ్వాససంబంధమైన** : సాగిన కొండనాలుక నుంచి ఎడతెగకుండ కాండ్రించినట్లుండుట, జలుబుతో నోటినుంచి ఫారింగ్సు వరకు గల గొంతుకు దీని ఊర్ధ్వభాగం మెత్తని అంగుడు, క్రింది భాగం నాలుక వాచినట్లుండుట. జిగురులాంటి కళ్లి కూడి దానిని అతి కష్టంపైన బయటకు వచ్చునట్లు చేయుట, స్వరపేటిక రొట్టెముక్క ఉండినట్లుండును. నిరంతరం తప్పనిసరిగ మింగుతూ వుండుట. పండ్లు తోముట కారణంగ దగ్గువచ్చును. ఊపిరాడ నీయకుండ, గొంతుకను నొక్కి ఊపిరాడకుండచేసి బాధపెట్టుట, ఊపిరాడకుండునట్లు చేసి చంపుట, ఉదయం ఈడ్పులు గల

దగ్గును, కోరింత దగ్గు సంభవించి కఠినమైన శ్లేష్మంతో వాంతి కలిగినపుడు తగ్గిపోవును. దీర్ఘకాల జలుబు ఉండుట. అమితంగా ఆల్బుమిన్ వుండుట. నడుచునపుడు గాలికి వ్యతిరేకంగ ఆవలవైపు శ్వాస పీల్చుకొనవలయును.

గుండె : గుండెను చెడుమార్గానికి త్రిప్పునట్లుండును. గుండెనుంచి రక్తం గడ్డలు లాగ స్రవించుటతో గుండెలో తీవ్రమగు నొప్పి కలిగియుండుట. గుండెకు సంబంధించిన ప్రతిభాగంలో నొక్కినట్లుండును.

మూత్రం : మూత్రవిసర్జన వత్తిడి కలిగించుట, ఇటుక పొడిరంగులాగ మడ్డివుండుట, మూత్రకోశంలో రాళ్ళవంటివి ఏర్పడుట. మూత్రకోశంనుంచి రక్తస్రావం కలుగుట, మూత్రి కామ్లం యూరిక్ యాసిడ్ యందుండు ఒక పదార్థముండుట. మూత్రపిండాల నుంచి మూత్రాశయం వరకు శూల, నొప్పియుండుట. ముదురురంగుగాను, జిగటగాను మూత్రం ఉండుట, మూత్ర విసర్జన బాధవుండును.

స్త్రీ : ఋతుస్రావం చాలముందుగాను, అమితంగా నల్లగ జిగటగ కలుగును. నల్లని గడ్డలు ఋతుస్రావం బాధతో ఉండును. విడిచి విడిచి ఋతుస్రావం కలుగుట. సాయంత్రం, రాత్రిపూట ప్రవాహంలాగ ఋతుస్రావం విసర్జించుట, నీటి ప్రవాహం ఉన్నపుడు పెద్ద రక్తపు గడ్డలు తప్పిపోవుట. పెదవులు వాచి ఎర్రబారినట్లుండుట.

ఈ మందును కొబ్బరి కాయనుంచి తయారుచేయుదురు.

## 73. క్రోటన్ టిగ్ (CROTON TIG)

రోగి లక్షణాలు : విరేచనాలు అరికట్టుటలో విలువైన మందు. వేసవికాలంలో వచ్చు వ్యాధులకు ముఖ్యంగ విరేచనాలు చిమ్మినట్లు వేగంగ వచ్చుట, విరేచనాలు పసుపువర్ణంగాని పసుపు ఆకుపచ్చగగాని వుంటూ నీరులాగ కలుగుట, ఎలాంటి ఆహారపానీయాల వలన గాని కదలికవలనగాని అధికమగును. వేసవికాలంలో కలుగు చిన్నపిల్లల విరేచనాలు కలరా లక్షణాలుండుట, గజ్జిమంత్రపు పొక్కులు దురద గోకిన దురద తగ్గును. ఎడతెగని దగ్గు కీళ్ళవాపు ఉంటూ తారుమారగుచుండును. పరుండగనే దగ్గు కలుగును. ఆహారనాళంలో మంట, దగ్గుతో ఉబ్బసం, ఆయాస లక్షణాలుండుట.

తల : నుదుట నొక్కినట్లు నొప్పి, ముఖ్యంగ కనుగ్రుడ్డు వుండెడి ఎముకల గూటికి సంబంధించిన నరాల బాధ.

కన్నులు : కనురెప్పలకు చిన్న గింజలు లాగ ఉండుట. కనుగ్రుడ్డు ముందుభాగంలోను గట్టిగ నుండు ద్రవం గల భాగంలో గజ్జి మొదలగునవి ఉండుట. ఎర్రని పక్కంరానివిగా కనపడుట, వెనుకకు లాగునట్లు భావించుట, కండ్ల చుట్టు దద్దులుండుట, కనులొత్తలేక కనుగ్రుడ్డు ఉండెడి ఎముకలగూడు కుడి భాగంపైన నొప్పివుండును.

మలము మరియు విరేచనాలు : ఎక్కువ వత్తిడితో విరేచనాలు నీళ్ళులాగ విస్తారంగ వచ్చుట. ఎల్లపుడు బలవంతంగ చిమ్మినట్లు బయటకు వచ్చుట. ప్రేగులలో గుడగుడయను శబ్దం ఉండుట, ఆహారం తిన్నపుడు కొద్దిపాటి నీరుమాత్రం త్రాగును. బాధగ వుండును. ప్రేగులలో నీటి కెరటం వలె లేచిపడుచుండు శబ్దం ఉండునట్లు తలంచును.

మూత్రం : రాత్రిపూట నురుగులాగ మూత్రం వచ్చుట, నల్లగ నారింజ రంగులాగ విసర్జించుట, నిలిచినపుడు మడ్డిలాగ బురదవచ్చును. ఒక ప్రక్కనుంచి విసర్జించినపుడు జిడ్డులాగ నీటిపై తేలియాడునట్లుండును. తెల్లని మడ్డితో పాలిపోయినట్లు పగటిపూట మూత్రం విసర్జించును.

ఛాతి : ఎడమ ప్రక్క ఛాతీలో నుంచి వీపు వైపువరకు లాగునట్లు నొప్పి యుండుట. దగ్గుతో ఆయాసం వుండుట, ఛాతీవరకు ప్రాకునట్లుండుట. శిశువును పెంచుతల్లికి శిశువు స్తనం నుంచి పాలు త్రాగునపుడు స్తనాల వెనుకవైపు నొప్పి. స్తనాలు ఎర్రగ వాచినట్లుండుట.. దగ్గు తలగడ తాకినట్లు స్పర్శ కలగగానే పీలున్నంత తొందరగలేచును. శ్వాసను లోతుగ పీల్చుటను

సహించలేకపోవుట.

**చర్మము :** చర్మం ఎండిపోవుటవలన, శరీర పోషకాహారం లేకపోవుటవలన వీపుకు ప్రక్కటెముకలకు చర్మం దగ్గరగ అంటుకొనిపోవుటచే ఆ చర్మం లాగినను పైకిరానట్లు భావించుట, తీవ్రమైన దురద, గోకుతూ ఉన్నట్లు, నొప్పి చీముతో కూడిన పొక్కులు, దద్దులు, ముఖం, జననేంద్రియాలపై ఉండును. దురద భయోత్పాతంగ ఉండుట, నొప్పి, మంట లుండును. పొక్కులు ఒక దానితో ఒకటి కలిసివుండి చమర్చుచుండుట, ద్రవపొక్కులు కలిగి తదనంతరం అచట పుండుపడును. దురద అధికంగ వుండుట, పొక్కులు దద్దులు తీవ్రమగునొప్పి, మంటగ కుట్టుచుండునట్లు నొప్పి వుండును.

ఈ మందు సేపాలపు గింజల నుంచి, సేపాలపు గింజల నూనె నుంచి తయారుచేయుదురు.

## 74. క్యుబెబ (CUBEBA)

**రోగి లక్షణాలు :** సెగ (గనోరియా)కు అద్భుతంగ పనిచేయు మందు. ఇతర మందులచే వాపుస్థితి తగ్గినను మూత్రవిసర్జనానంతరం మంట తగ్గకుండా యుండి స్రావం చిక్కగగాని చీమువలెగాని యుండును. గొంతులో మంట మండునట్లుండును. పురీషనాళం మూత్రనాళం జననేంద్రియాలలో మంటగ ఉండుట. నోటిపూత, అరికాళ్లపగుళ్లు గ్రుచ్చుకొనునట్లుండును. ప్రొస్టేటు గ్రంధివాపు, వృషణాలవాపు, కీళ్లవాతం, గ్రహిణి, విరేచనాలు, మలబద్ధకం, పైత్యప్రకోపం, చెందుట, సంభోగం కొరకు తీవ్ర వాంఛతో స్త్రీ జననేంద్రియం దురద, కుసుమ విస్తారంగ పచ్చగ ఆకుపచ్చగ చాల దుర్వాసనగ నుండి మంట వరుపు కలిగించును. చిన్నపిల్లలలో మంట వరుపు కలిగించు కుసుమ, తెల్లబట్ట తరుచుగ మూత్రం విసర్జించుచుందురు.

**మూత్రం :** మూత్రవిసర్జన నాళపువాపు ముఖ్యంగ స్త్రీలలో అమత్యక్కు గల భాగాల నుంచి స్రవించెడి ద్రవంతో చాలా వుండుట. మూత్రవిసర్జనానంతరం కోయుచున్నట్లుండుట, దగ్గరకు ముడుచుకొని పోయినట్లుండుట, మూత్రకోశం నుంచి రక్తస్రావం కలుగుట. ప్రొస్టేటు గ్రంధి వాచుట, జిగటగ పచ్చనిస్రావం కారుట, మూత్రకోశపు వాపు, తరుణ స్థితియందు పొత్తికడుపులో నొప్పులుండి మూత్రకోశంలో తీవ్రబాధగ నుండును.

**శ్వాససంబంధమైన :** రొంప పడిశము జలుబు ముక్కుల నుంచి స్రావం ఉండును. గొంతువాపు, కళ్లి కఫము దగ్గుట వలన బయటకు వచ్చునపుడు, దుర్వాసనగ ఉండును. ముక్కు వెలుపల నుంచి లోపలవరకు గల రంధ్రాల నుంచి మెల్లగ శ్లేష్మం కారుట. గొంతుక పుండులాగ ఉండి బొంగురుపోయినట్లుండును.

ఈ మందు చలువ మిరియాలు లేక తోక మిరియాలనుంచి తయారుచేయుదురు.

## 75. మెలిలోటస్ ఆల్బా (MELILOTUS ALBA)

**రోగి లక్షణాలు :** ముఖం ఎర్రగ ఉండుట, ముక్కునుంచి రక్తస్రావం అమితంగ స్రవించుటచే ఉపశమించుట, మెడయందలి రక్తనాళాలలో ధనారింపుగ నుండును. రక్తస్రావం కలుగు సన్నిపాతం, న్యూమోనియా, ఊపిరితిత్తులకు రక్తప్రసరణాధిక్యత కలిగి ముఖము, కన్నులు ఎర్రగ నుండి కొలది నిముషాలకొకసారి ముక్కునుంచి రక్తం స్రవించుట, తీవ్ర జ్వరం నిత్యం ఉధృతంగ దగ్గు, శ్వాస కష్టంగ ఉండుట, జ్ఞాపకశక్తి లోపించుట, ఆలోచనలు అయోమయంగ ఉండి కన్నీరు కార్చును. భీతి, విచారం, ఉన్మాదం మూర్ఛ రోజా సాయంత్రం 4 గంటలకు తలనొప్పి రావటం విరేచనాలు కలుగుట. కణతలలో నొప్పి, తేన్పులు, వాంతులు, కాళ్ళు చేతులు చల్లనగుట, చూపుపోవుట, చంటిపిల్లవానికి పళ్ళు వచ్చునపుడు ఈడ్పులు, పార్శ్వ పైత్యప్రకోపంచే కలుగు శూల గుండెదడ బుతుశూల, బుతువు తక్కువగ నుండి మధ్య మధ్య ఆగుచుండుట, ఛాతీపైన స్వరపేటికలలో గురగురమంటూ దగ్గు ఉండుట, కీళ్ళవాత నొప్పులు, మోకాళ్ళ నొప్పులు, తిమ్మెర లక్షణాలుండును.

మనస్సు : మనస్సు స్థిమితం లేకపోవుట, జ్ఞాపకశక్తిపై విశ్వాసం లేకపోవుట, స్పృహ పూర్తిగా గాని కొంతవరకుగాని పోవుట, పరిగెత్తి దాగుకొనుటకు యిష్టపడుట, రోగి మానసికంగ అగుపడునవి నిజమైనవనియే నమ్మును. ఎటునైపో చూస్తూ సమాలోచనలు చేస్తూయుండుట, గట్టిగ మాట్లాడుటకు భీతి చెందుట, పారిపోయేందుకు ఇష్టపడుట, మొదలగు లక్షణాలకు పనిచేయును.

తల : వాంతిచేసికొనుటకు ప్రయత్నించుటలో తలనొప్పివచ్చుట, వాంతులు, కనుగ్రుడ్డు ఉండెడి ఎముకలగూడు అంతయు నొక్కినట్లుండుట, పాలిపోయినట్లుండుట, చేతులు కాళ్ళు పాదాలు చల్లగ ఉండుట, కన్నుల ముందు భాగంలో నల్లని మచ్చలుండుట, భారంగ ఉండుట, భరింపశక్యంగానంత భారంగ ఉండుట. నుదిటికి సంబంధించిన భాగంలో ధనారింపుగ కొట్టుకొనుచుండుట, మెదడులో కెరటంవంటి కదలికలుండినట్లు భావించుట, జబ్బుతో కూడిన తలనొప్పి. ఋతుస్రావం స్రవించుటవలన బాధలు తగ్గును. తల అంతయు నిండినట్లుండుట, కన్నులు భారంగ ఉండుట, చూపు అస్పష్టంగ ఉండుట, ఉపశాంతి కోసం కన్నులు గట్టిగ మూసుకొనును. కుడిభాగం తల మెడ నరాల బాధలుండును.

ముక్కు : పొడిగ ఉండుట, ఊపిరి నోటి ద్వారా పీల్చుట, అంతరాయం కలుగుట, ముక్కులో గట్టిగ ఘల్లుమని శబ్దం ఉండుట, ముక్కునుంచి రక్తం విస్తారంగ కారుట.

ముఖం : మెడయందలి యిరువైపులగల రెండు ప్రధాన ధమనులు ధనారింపుతో ముఖం తీవ్రంగా ఎర్రగ ఉండుట.

మలవిసర్జన విరేచనాలు : కష్టంగ ఉండుట, నొప్పితో ఉండుట, మలబద్ధకం, గుదస్థానం ముడుచుకొనిపోయినట్లు భావించుట, పూర్తి ధనారింపుతో కొట్టుకొనునట్లుండుట. అధికంగ ప్రొగైకూడ నంతవరకు కోరిక యుండదు.

స్త్రీ : వికారంతో ఋతుస్రావం కొంచెం స్రవించుట, విడిచి విడిచి వచ్చుట, వెలుపలిభాగంలో పొడుచునట్లు నొప్పి ఉండుట, ఋతుశూల, అండాశయానికి సంబంధించిన నరాలనొప్పులుండుట.

శ్వాససంబంధమైన : ఊపిరాడకుండ ఉండునట్లు భావించుట, కాలుసాచుటకు యిష్టపడుట, అయితే బాధలు తగ్గవు. కీళ్ళనొప్పులు, చర్మం, కాళ్ళు చేతులు చల్లగ నుండుట, తిమ్మెర్లు మోకాళ్ళలో నొప్పులుండుట.

ఈ మందు మెల్లలోటస్ ఆల్బామొక్క నుంచి తయారుచేయుదురు. స్వీట్ క్లోవెర్ అని పిలిచెదరు.

## 76. నూపర్ ల్యూటియం (NUPHAR LEUTEUM)

రోగి లక్షణాలు : నపుంసకత్వానికి దివ్యౌషధం. పురుష జననేంద్రియానికి ఏమాత్రం శక్తి లేకపోవుట, శిశ్నోద్రేకంగాని, రతివాంఛగాని ఏమాత్రం వుండదు. కొంతకాలం రతివాంఛయే లేక వ్యతిరేక స్థితి కలుగును. రతివాంఛ యున్నప్పటికి శిశ్నోద్రేకం కలుగదు. తలనొప్పి, నిద్రలో స్ఖలనమగుచూ నీరసం ఏర్పడును. జననేంద్రియ పటుత్వం ఏమాత్రం వుండదు. రమించగల శక్తియుండదు. రమించిన మరుసటిరోజు బాధ లధికమగును. శిశ్నం చిన్నదై ముడుచుకపోవును. మలమూత్ర విసర్జనలో శుక్రం పోవును. విరేచనాలు పచ్చగ నీళ్ళులాగ దుర్వాసనతో వుండును. విరేచనాలు కలుగుట వలన నీరసం ఏర్పడి శక్తి హీనులుగ ఏర్పడును. సన్నిపాత జ్వరం మొదలగు ఎటువంటి వ్యాధులనైన ఈ మందు కుదుర్చును. ఏ కొంచెంగాని ఆహార పానీయాలు అధికమైన విరేచనాలు కలుగును. శరీరంలో వివిధ భాగాలపై ఎర్రని బొబ్బలు దురద సాయంకాలం హెచ్చును.

పురుషులు : సంపూర్ణంగ జననేంద్రియోద్రేకం లేకపోవుట, శిశ్నం వెనుకకు పోవుట, లేక ముడుచుకొనిపోవుట, నపుంసకత్వం మలమూత్ర విసర్జన సమయంలో శుక్ర స్ఖలనమైపోవుట, శుక్రనష్టం, వృషణాలలోను శిశ్నం నొప్పిగ వుండుట.

మల విసర్జన, విరేచనాలు : చిన్నప్రేగులు పెద్దప్రేగులు వాచుట పశుపుపచ్చని రంగుతో

విరేచనాలు కలుగుట, ఉదయంపూట బాధలు అధికంగ వుండుట, సన్నిపాత జ్వరం వచ్చు సందర్భంలో విరేచనాలు కలుగుట.

## 77. నక్స్‌మోస్కాట (NUX-MOSCHATA)

**రోగి లక్షణాలు :** చలి, దాహం లేకపోవుట, నిద్రమత్తు, దాహం లేకపోవుటతో నోరు-నాలుక అమితంగ పొడిగ ఉండుట, శోషిల్లు స్వభావం, హిస్టీరియా స్త్రీ గర్భవతిగ ఉండునపుడు రక్తస్రావం వుండుట. తల చాల పెద్దగ బరువుగ ఉండునట్లుండును. చూపు స్పర్శ చాల సున్నితంగ ఉండుట, గత జీవితం గూర్చి పూర్తిగ మరిచిపోవును. అయోమయంగ మతిమరుపు, ఉన్మాదం కలలో వున్నట్లుండును. ఎల్లపుడు నిద్ర కోరును. నిద్రమత్తుగా ఉండుట, నిద్రమత్తుగా ఉండు ఏ వ్యాధికైనా ఈ మందు మరువకూడదు. చల్లదనం, తేమవలన బాధలధికమగును. అంగుడు అంటుకొని పోవుట, అజీర్ణవ్యాధులుండుట, నోరు పొడిగ నుండుటతో నిద్రనుంచి మేల్కొంచును. చర్మం చాల పొడిగా ఉండును. చెమటపట్టదు, జ్ఞాపకశక్తి ఆకస్మికంగ పడిపోవుట, స్వల్పకారణాలచేతనైనను తేలికగ శోషిల్లుట, నిలిచిన రక్తం చూసిన విరేచనాలు అగుటతో శోషిల్లును. భుజించిన వెంటనే కడుపు కృంగినట్లుండును. ఉదరం అమిత వాయువు చాల దుర్వాసన, వర్షాకాలంలో విరేచనాలు తెల్లగ దుర్వాసన ఉండుట. చిన్నపిల్లలో వేసవికాలంలో కలుగు కలరా విరేచనాలకు ముఖ్యౌషధం. శూల క్రిములు మూలశంక దిగజారుట. సన్నిపాతం చలి జ్వరంలో కలుగు మగత స్పర్శజ్ఞానం, అధికంగ తినిన తలనొప్పివచ్చుట, తలనొప్పితో నిద్రమత్తు స్త్రీలకు అమూల్యమైన ఔషధం. స్తనాలు చదునుగ నుండి చిక్కి సన్నగనైన స్త్రీలకు ఇది గొప్పమందు. స్తనాగ్రభాగాలు లోపలికి పోవును. గర్భవతికి కలుగు పంటినొప్పి, దగ్గు కలిగి అయోమయంగ వుంటూ శోషిల్లును. ఉదరం ఉబ్బును. హిస్టీరియా లక్షణాలుగల స్త్రీలలో గర్భస్రావం మొండి రకపు రక్తస్రావం ఋతుస్రావం కాల నియమం లేకుండ అగుట, ఋతుశూల పొత్తికడుపులో క్రిందికి లాగునట్లు నొప్పి అధికంగ ఉండును. ఋతువుకు బదులుగ కుసుమ మాత్రం కలుగును. గర్భకోశంలో వాయువుకూడి పెద్దదిగనగును. గర్భకోశం దిగజారుట. స్థానం తప్పుట గర్భవతిగ వున్నపుడు ప్రసవ సమయంలో ప్రసూతిలో కలుగు పొర్లు మొదలగు బాధలు ఉండుట. మూత్రం తెలియకుండగానే పోవుట, సన్నిపాతమందు కలుగు రక్తస్రావాలు, కండరాలలో ఆకస్మికంగ అదురుపాట్లు, ఈడ్పులు, వణుకు, పక్షవాతం నాలుక కనురెప్పలు ఆహారనాళానికి కాళ్ళ చేతులు తిమ్మెర్లు, చెవులలో హోరు, స్వరం పోవుట, అజీర్ణం నడుము క్రిందభాగం నొప్పి ముఖ్యంగ బండిలో ప్రయాణం చేయునపుడు నొప్పులుండుట, చర్మం చల్లగ నుండి చెమటలు బట్టును. హైడ్రొజెనాయిడ్ తత్వంగలదు.

**మనస్సు :** మనస్సు నిలకడ లేకపోవుట, నవ్వుట, అరుచుట, ఒకదానిని మరొక దానిగ భావించుట, జ్ఞాపకశక్తి క్షీణించుట, మనస్సుకు వ్యాకులపెట్టినట్లు కలలో వచ్చుట, ఆమెకు రెండు తలలు ఉన్నట్లు భావించుట.

**తల :** బయటప్రదేశం గాలిలో నడుస్తూ ఉన్నపుడు తలతిరుగుట, కొద్దిగ గాని, అతిగగాని తింటూ వున్నపుడు తలనొప్పి, నిద్రమత్తుతో విస్తరించుతూ నున్నట్లు భావించును. తలలో ధనారింపుగ ఉండుట, తలలో చీల్చుచున్నట్లుండుట, తల పగిలినట్లు నొప్పి ఉండుట, కఠినంగ నొక్కిన ఉపశమించును.

**కన్నులు :** ఏదేని ఒక వస్తువు చూసేందుకు పొడవుగను, పెద్దగా కనపడును. చాల దూరంలో ఉండునట్లుండును. కనపడకపోవుట, కన్నుల ముందు మచ్చలుండుట, కనుపాప పెద్దదగుట.

**ముక్కు :** వాసన నుంచి ఏమాత్రం సహనశక్తిలేకపోవుట, ముక్కునుంచి స్రావం కారుట, నల్లని రక్తం కారుట, పొడిగ ఉంటూ శ్వాస నిలిచిపోయినట్లుండును.

**నోరు :** చాల పొడిగ ఉండుట, నాలుక నోటిపై అంటుకొని ఉండుట, అయితే నీరు త్రాగేందుకు యిష్టముండదు. లాలాజలం దూదిలాగ ఉండుట. గర్భవతులలో కలుగు పంటినొప్పి.

నాలుక తిమ్మెరగ ఉండుట, పక్షవాతం ఉండుట, గొంతుక పొడిగ ఆర్చుకొనిపోవునట్లుండుట.

కడుపు : అతిగ ఉబ్బినట్లుండుట, అజీర్ణం, కడుపు వాయువుతో నిండి యుండుట, ఎక్కిళ్ళు, కాల నియమం మేరకు ఆహారం అతిగ కోరుట, కడుపుకు సంబంధించిన దీర్ఘవ్యాధి లక్షణాలు తగ్గుట.

ఉదరం : ప్రేగులు పక్షవాతం వలన బలహీనత చెందుట, బ్రహ్మాండంగ ఉబ్బరించి నట్లుండుట, మలం మెత్తగ మృదువుగ నుండును. ఇది బయటకు వచ్చేందుకు కష్టంగ ఉండును. చాల శ్రమపడవలసివచ్చును. మల విసర్జన సమయంలోగాని తదనంతరంగాని నిస్త్రాణగ ఉండుట, మొలలు బయటకు త్రోసుకొని వచ్చినట్లుండును.

స్త్రీ : గర్భకోశం నుంచి రక్తస్రావం కలుగుట, ఋతుస్రావం చాల కాలం స్రవించుట, నల్లగ జిగటుగ ఉండును. తెల్లబట్ట బురదగ రక్తంతో అగుట, ఋతువు అణగారుట, మొండి వ్యాధిలో స్పృహపోయినట్లుండుట, నిద్రమత్తుగ ఉండును. ఋతుస్రావం మార్పుచెందుట, పరిమాణక్రమము కాలనియమము లేకపోవుట.

శ్వాసవంబంధమైన : గాలికి వ్యతిరేకంగ నడుచుటవలన కంఠస్వరానికి హానికలుగుట, వెచ్చని పడక నుంచి లేవగానే దగ్గువచ్చుట.

గుండె : పక్షిరెక్కలవలె కొట్టుకొనుచూ వణుకుట, గుండెను గట్టిగ చేతిలో పట్టుకొనినట్లు రోగి చెప్పును. రోగికి తెలియునట్లు గుండె వడిగ వేగంగ కొట్టుకొనుట, గుండె కొట్టుకొనుట ఆగినట్లుండుట.

కాళ్లు చేతులు : కుడిభాగంలో తుంటి నుంచి మోకాలు వరకు నొప్పి కదలికవలన బాధలు ఎక్కువగుట, ముఖ్యంగ మేడమెట్లు ఎక్కునపుడు అధికంగ ఉండును. కీళ్లనొప్పుల వలన పాదాలు తడిగ ఉండుట, ఒక కష్టమైన ఆటవలన బయటపడును. పొడిగ ఉండుట వలన కీళ్ళవాతం తగ్గును. మానసికంగ కలుగు అలసట, నీరసము ఉండును.

నిద్ర : అతిగ నిద్రమత్తు ఉండుట, నిద్రమత్తువలన దుఃఖపడుట, స్పృహలేకుండ పోయి నట్లుండుట.

జ్వరం : ఎడమచేయి నుంచి చలి ప్రారంభించును. చలి స్థితి వేడి ఉండుట, దాహం ఉండదు. చెమటలుపట్టుటకు కోరుకొనును. చర్మం పొడిగ ఉండుట, లోపలిభాగం కూడ ఉంటూ, కన్నులు, ముక్కు, పెదవులు, నోరు, నాలుక గొంతు మొదలగునవి పొడిగ ఉండును.

ఈ మందును జాజికాయచెట్టు నుంచి తయారుచేయుదురు.

## 78. బాంబూనినం (BAMBOONINM - BANSHOCHAN)

రోగి లక్షణాలు : పిల్లలకు వచ్చు ఎముకల వ్యాధి. కాళ్లు, చేతులు ఎముకలకు పుష్టి బలం నిచ్చును. పిల్లలకు వచ్చు అతిసారవ్యాధి, దగ్గు బలహీనత ధాతు క్షీణత ఉండును. ఈ మందులో ఎక్కువ కాల్షియం ఉన్నందున పిల్లల ఎముకల వ్యాధులపై చక్కగ పనిచేయును. పురుషులలో కలుగు ధాతు క్షీణతకు ఉత్తమ ఔషధం.

ఈ మందు వెదురు చెట్టు నుంచి తయారు చేయుదురు.

## 79. ఒరిగనం (ORIGANUM).

రోగి లక్షణాలు : రోగి ఒక క్షణం కూడ కాలయాపన చేయకుండ నిరంతరం ఏదో పని చేయాలని యిష్టపడుట. జననేంద్రియాలకు సంబంధించిన వ్యాధులకును, హస్తప్రయోగ అలవాటు పడినవారలకు, హిస్టీరియా, స్త్రీల వ్యాధులకును వంధ్యత్వంనకును ప్రశాంతంగ ఉండలేకపోవుట లక్షణాలను కుదుర్చును.

స్త్రీ : ప్రేమోన్మాదం, తీవ్ర కామోద్రేకంతో ఆలోచించకుండగనే పనిచేయు స్వభావం

ఉండుట, తెల్లబట్ట, హిస్టీరియా, కామాతురతగల భావాలు ప్రేమ కలలు వచ్చుట, వంధ్యత్వం జననేంద్రియోద్రేకం స్త్రీ, పురుషులలో రతివాంఛ తీవ్రమగుటచే హస్తప్రయోగాలకు అలవాటు పడుదురు. ప్రశాంతంగా ఉండలేరు.

ఈ మందు సుగంధ ద్రవ్యాల నుంచి తయారుచేయుదురు.

## 80. ప్లాంటాగో - మేజర్ (PLANTAGO -MAJOR)

**రోగి లక్షణాలు :** పంటిపోటు, పండ్లు పిప్పిపట్టి బాధ ఉండుట. చెవినొప్పి చెవిపోటు, ఒక్కొక్క సమయంలో పంటినొప్పి, చెవినొప్పి ఒకే సమయంలో వచ్చినపుడు పనిచేయును. పంటినరాలు, ముఖం నరాల బాధలు, నొప్పులుండుట, మొలల వ్యాధి, అతిమూత్రం మూత్ర విసర్జన నాళంలో చురుకు, నొప్పి ముక్కు నుంచి నీరుకారుట, అపాన వాయువు దుర్వాసనతో ఉండుట, గాయాలు, సరుకులు, జంతు కాట్లు, పాముకాటు, చలి, మంచులకు కలుగు వాపులకు, పుండ్లు దురదలు, పండ్ల లొత్తల (ఇగుళ్ళు) నుంచి చీముకారుట, పొగాకు మొదలగునవి అత్యధికంగ వాడుట వలన నిద్రపట్టక పోవుట, ఉత్సాహాదులు కృంగిపోవుట, ఈ కారణంవలన పొగాకుపై అయిష్టత కలుగును.

**తల :** కాల నియమంగ కలుగుచుండు ముఖనరాల నొప్పి, ఉదయం 7 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటలవరకుండును. కన్నీరు కారుచుండుట, వెలుగును సహించలేకపోవుట, నొప్పులు సూర్యకిరణాలవలె కణతలు, ముఖం క్రింది భాగం చుట్టు వ్యాపించుట.

**చెవులు :** చెవులో నొప్పి, శబ్దం ఉండుట, పొడుచుచున్నట్లు నొప్పి, చెవుల నరాల నొప్పి, నొప్పి ఒక చెవినుంచి తల వరకు ప్రాకినట్లుండుట, చెవి నొప్పితో పాటు పండ్ల నొప్పులుండుట.

**ముక్కు :** ఆకస్మికంగ పచ్చగ నీరులాగా కారుచుండుట.

**నోరు :** పండ్లనొప్పులు, తాకిన పుండులాగ బాధ ఉండుట, దవుడలు వాపుతో ఉండుట, లాలాజలం అధికంగా స్రవించుచుండుట, పండ్లు చాలా పొడవుగ వున్నట్లు భావించుట, చల్లని గాలిలో పండ్లను తాకినపుడు బాధగ ఉండును. ఆహారం తింటూ వున్నపుడు పంటి నొప్పి బాధ తగ్గును. పంటి నొప్పి కనురెప్పల నరాలు పైన కూడా ప్రతిబింబింపచేయును.

**మల విసర్జన, విరేచనాలు :** తరచుగ మలవిసర్జన కోరుతూ వెళ్ళును కాని రాదు. మొలలు గట్టిగ ఉంటూ చెడుపుచేయును. విరేచనాలు గోధుమరంగుతో నీళ్లలాగ కలుగును.

**మూత్రం :** విస్తారంగ ప్రవహించుట, రాత్రిపూట స్పృహలేకుండగనే శయ్యలో మూత్రం పోయుట.

**చర్మం :** దురద మంట ఉండుట. చిన్నపొక్కులు అధికంగ ఉండుట. వేడి, గుల్లలతో కూడిన తట్టులాగ ఉండుట. సీతలంచే చర్మం ఎరుపెక్కి వాచి తీవ్రమగు దురద మంటలుండును.

ఈ మందును అరటి చెట్టునుంచి తయారు చేయుదురు.

## 81. రిసినస్ కమ్యూనిస్ (RICINUS COMMUNIS)

**రోగి లక్షణాలు :** అమితంగ విరేచనాలు. బియ్యపు కడుగులాంటి కలరా విరేచనాలు, మూత్రవిసర్జన శరీరం చల్లనగుట, చలితో ఎడతెగని విరేచనాలు వాంతులు పిల్లలలో కలుగు పసుపు, ఆకుపచ్చ రంగుల విరేచనాలు, తీవ్రజ్వరంతో నిద్రమత్తు, నీరసం నొప్పులు, స్త్రీ జననేంద్రియం, స్తనాలపై గొప్పగ పనిచేయును. స్తన్యపాన మిచ్చు స్త్రీలలో పాల ఉత్పత్తి అధికంగా వృద్ధి చెందుట ప్రసవానంతరం స్తనాలలో పాల ఉత్పత్తి ఆలస్యమైన ఎడల ఆముదపుచెట్టు ఆకులను వెచ్చచేసి స్తనాలపై కట్టాలి. ఆకు కషాయంతో స్తనాలపై కాపడం చేసిన పాలు వెంటనే కలుగును. ఋతుస్రావం కాలనియమాలకు ముందుగ రావడం విస్తారంగ స్రవించుట, తెల్లబట్ట ఎక్కువకావడం నడుములో ప్రసవనొప్పులు వంటి నొప్పులుండును.

**తల :** తల త్రిప్పుట, తలవెనుక భాగం (కపాలం) నందునొప్పి, రక్త ప్రసరణాధిక్యతగల

లక్షణాలుండుట, చెవులలో హోరుమనుశబ్దం, ముఖం పాలిపోయినట్లుండుట, నోరు అదురు చుండునట్లుండుట.

**ఉదరం :** కడుపులో వాయువుచేరి గుడగుడమను శబ్దం ఉండుట. పురీషనాళం కండరాలు ముడుచుకొని పోయినట్లుండుట శూల ఎడతెగని విరేచనాలు కలిగి ఉండుట. చలితో ముడుచుకొని పోయి బియ్యపు కడుగు నీళ్ళులాగ విరేచనాలు కలుగుట.

**మలవిసర్జన విరేచనాలు :** నొప్పిలేకుండ ఎడతెగకుండ మలవిసర్జన ఉండుట, కాళ్ళు చేతుల కండరాలు ముడుచుకొని పోతూ నొప్పులతో వుండుట, మలద్వారం ఎర్రగ వాచి ఉండుట, మలం పచ్చగ రక్తంతో చిమ్మినట్లుండుట. జ్వరం శుష్కించుట, ఎండిపోవుట, నిద్రమత్తుగా ఉండును.

ఈ మందు ఆముదపు చెట్టు నుంచి తయారు చేయుదురు.

## 82. జిమ్నెమ సైల్వెస్టరు (GYMNEMA SYLVESTRE)

**మధుమూత్రానికి సిద్ధౌషధం :** మూత్రంలోని చక్కెర తగ్గించును. ఆకలిగుణం పుట్టించును. కండ పుష్టిని కలిగించి ఆరోగ్యంచేకూర్చును. ముఖం కళగ ఉండునట్లు చేయును. జననేంద్రియ పటుత్వం కలుగును. మధుమూత్ర రోగులకు వరప్రసాదం లాంటిది.

రోగి విచారంగ నిరాశగ ఉండును. కండరాల బిగిలేకపోవుట. మూత్రం చక్కెరతో నిండియుండును. మూత్రం అధిక పరిమాణం విసర్జించుటచే అధిక నీరసం కలుగును. మూత్రం విస్తారంగ తెల్లగ నుండును. విశిష్ట గురుత్వం అధికంగ ఉండి మూత్రంలో చక్కెర పరిమాణం అమితంగా ఉండును. రాత్రి పగలు తరచుగ మూత్ర విసర్జన కలుగుట. శరీర మంతయు మంట సెగ్గెడ్డలు, రాచపుండ్లు ఉండును. మధుమూత్రరోగికి శరీరంపై ఎచటనైన రాచపుండు సంభవించవచ్చు. నీటిని తరచుగ విస్తారంగ త్రాగును. నీరసం క్రమేపి అధికమగును. సంభోగం వలన మూత్ర పరిమాణం హెచ్చి మూత్రమందలి చక్కెర హెచ్చును. జననేంద్రియ శక్తి పూర్తిగ నశించును. మధుమేహ మూత్రావయవ దోషాలందు ఆయుర్వేద వైద్యులు వాడెదరు. పాముకాటుకు దీనివేరు చూర్ణం పైకి వాడుదురు. దీని కషాయం లోపలికి వాడిన మంచి గుణం యిచ్చునని చెప్పుదురు. క్రిమికీటకాల కాట్లు కాలేయ ప్లీహము పెద్దవగుట, జలుబుచే వచ్చు తలనొప్పి మూలశంక, జ్వరం, దగ్గులకు ఈ మందును వాడుదురు. ఈ మందును దుష్టపు తీగె లేక జట్టు పాకు నుంచి తయారు చేయుదురు.

## 83. జింజిబెర్ అఫిసినాలిస్ (ZINZIBER OFFICINALIS)

**రోగి లక్షణాలు :** అజీర్ణవ్యాధులు, మూత్రావయవములమీద, శ్వాసావయవముల వ్యాధులు, జీర్ణకోశం వాయువుతో ఉండుట, నొప్పి, విరేచనాలు, మత్తుపానీయాలు సేవించువారిలో వాంతులుండుట, అజీర్ణంచే కలుగు ఉబ్బసం, ఊపిరాడుటకు లేచి కుర్చుండవలెను. జలుబు ముక్కు పుండునుంచి రసి స్రవించుట. నాడీమండలోద్రేకం అస్తిమితం, చల్లగ నుండుట, రతివాంఛ అధికంగ ఉండుట, రాత్రిళ్లు స్ఖలనమగుట, బాధతో శిశ్నోద్రేకం ఉండుట, గర్భవతికి చేతులు పుండువలె వేడిగ ఉండుట. ఋతుస్రావం త్వరితంగ, విస్తారంగ స్రవించుట.

**తల :** కపాలంలో అర్ధభాగం సరిగ వృద్ధిచెందకపోవుట, ఆకస్మికంగ కండ్లముందు మిణుకు మిణుకుమనుట, ఏమియులేనట్లుగాను ఒకదానికి బదులు మరియొకటి భావించుట, కనుబొమలందు అధికంగ నొప్పి ఉండుట.

**ముక్కు :** పొడిగ, అంతరాయం కలుగునట్లు భావించుట, సహించరాని ~~దురద ఉండుట~~, ఎర్రని వాపుతో కూడిన పొక్కులుండుట.

**కడుపు :** ఆహారం రుచి చాలకాలంవరకు ఉండుట. ముఖ్యంగ బ్రెడ్, రొట్టె నుండును. ఒకటి





రాయిలాగ కడుపులో భారంగ ఉండుట. ? ప్మడిపండు, కర్బూజపండు పుచ్చకాయ మొదలగునవి. కలుషితమగు నీరు త్రాగుటవలన రోగాలు వచ్చునట్లు చెప్పును. పుల్లని ద్రవం ఉండుట, కడుపులో వాయువుతో ఉబ్బినట్లుండి గుడగుడమని శబ్దం ఉండును. ఖాళీగా ఉండినట్లుండి దాహం అతిగ ఉండుట, ఉదర కోసం, రొమ్మెముకలు ప్రక్కటెముకలలో నొప్పి, భుజించిన బాధ లధికమగును.

**ఉదరం :** శూల, విరేచనాలు, కలుషితమైన నీరుత్రాగుటచే విరేచనాలు కలుగుట, జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బరించి ఉండుట, కోయుచున్నట్లు నొప్పి ఉండుట ద్వారా సంకోచకండరం బిగి సడలినట్లుండుట, గర్భవతిగ ఉండుకాలంలో గుదస్థానంలో వేడిపుండులాగ నొప్పి ఉండుట, ప్రేగులలోని అమత్వక్కు వాపు.

**మూత్రానికి సంబంధించిన :** తరచుగ మూత్రవిసర్జన వాంఛ ద్వారంలో తీవ్రమగు నొప్పి, మంట ఉండును. మూత్రాశయం నుంచి పచ్చగ మూత్రవిసర్జన మూత్రం జిగటగ మడ్డిగ ఘాటైన వాసన ఉండుట, అణచివేయునట్లుండుట, సన్నిపాత జ్వరం తదనంతరం పూర్తిగ అణగారినట్లుండుట, మూత్రవిసర్జనానంతరం చుక్కలు చుక్కలుగా ఎడతెగకుండ కారును.

**పురుషుడు :** శిశ్నాగ్రభాగం దురదగ ఉండును. జననేంద్రియవాంఛ తేలికగ ఉద్రేకంచెందుట. శిశ్నం నిక్కి ఉబ్బుటవలన నొప్పి ఉండుట, స్ఖలనమగుట.

**శ్వాససంబంధమైన :** స్వరం బొంగురుపోవుట, ఊపిరిపీల్చుట కష్టంగ ఉండుట, స్వరపేటి కలకు క్రింది భాగంలో మంటగ ఉండుట, ఉబ్బసం, తొందరలేకపోవుట, ఉదయం పూట, బాధగ ఉండుట, గొంతుకలో గోకుతూ వున్నట్లు తలంచుట, ఛాతీలో కుట్టినట్లు బాధవుండుట, పొడిదగ్గు కళ్లెని పైకి తెచ్చుటకు ప్రయత్నించుట, కాండ్రించుట, ఉదయం పూట కళ్లె విస్తారంగ వచ్చుట.

**కాళ్లు చేతులు :** అన్నిరకాల కీళ్ళు చాల బలహీనంగ ఉండుట, వెనుక భాగం వంగినట్లుండుట, కుంటితనంగవుండుట, అరికాళ్లు అరచేతులు అప్రయత్నంగ ముడుచుకొనిపోవునట్లుండును. ఈ మందును అల్లం నుంచి తయారు చేయుదురు.

## 84. క్రోకస్ సటివ (CROCUS SATIVA)

**రోగి లక్షణాలు :** హిస్టీరియా, ఒకసారి సంతోషం మరొకసారి కృంగి ఉండును. మానసిక పరిస్థితులు త్వరితంగ మారుట. సంతోషంగ ఉండునపుడు పాడును. నృత్యం చేయును. గెంతును, ఈలవేయును. ప్రేమించును, ప్రతిసారి ముద్దుపెట్టుకోవాలని కోరును. కృంగినపుడు ఏడ్చును, తిట్టును, పిచ్చిఎక్కును, కోపగించును తదనంతరం పశ్చాత్తాపపడును. పట్టశక్యంగాని నవ్వు ఉండును. గుండెజబ్బుగల ఒక కన్యకు అతిగ నవ్వుసలగగా కుదుర్చును. కన్యలలో కలుగు హిస్టీరియా, ముక్కు గర్భకోశం ఊపిరితిత్తులు, కడుపు మొదలగు భాగాలనుంచి నల్లని జిగురువంటి రక్తస్రావాలు కలుగుట, జీర్ణకోశం, ఉదరకుహరం, గర్భకోశం, ఛాతీలో సజీవమైన ఏదో కదలుచున్నట్లు గెంతుచున్నట్లుండును. శిశువు కదలికలు అమితంగ ఉండిన గర్భవతికి మేలు జరుగును. గర్భవతియా కాదా సందేహమున్నపుడు ఈ మందు యిచ్చిన గర్భవతి కాని ఎడల కదలికలు పోవును. గుండె ఎగబ్రాకి శ్వాసకు అంతరాయం ఏర్పడును. కండరాలు కనురెప్పలు అదురుట, శరీర మంత ఎర్రగమారి ఎర్రమచ్చలేర్పడును. గాయాలచే కలుగు చెవుడు, కంతులకు ఫలితమిచ్చును. కండ్లు పొగలో ఉండునట్లుండుట, శరీరమంత దురద, క్రిములు ప్రాకునట్లుండుట, కుట్టుచున్నట్లు మలబద్ధం ఉండును.

**మనస్సు :** నిలకడలేకుండుట, చలాకిగ సంతోషంగ ఉన్మాదంతో ఉండుట, నవ్వుట, పాడుట, ప్రేమ, వాత్సల్యం, సంతోషంగ ఉండుట. కోపం ఉండుట, ఆకస్మికంగ ఉత్సాహం నుంచి విచారంగ మారుట, వినియుండిన సంగీతాన్ని స్పష్టంగ మరల స్మరణ చేసుకొనుట.

**తల :** స్త్రీ ముట్లుడుగు కాలంలో గుండె ధనారింపుగ కొట్టుకొనుట, ఋతుస్రావం కలుగు సమయంలో బాధలు అధికంగ ఉండును.

కన్నులు : విద్యుత్ అగ్నికణాలవలె కనపడుట. కన్నులలో అమత్యక్కు నీరు ఉండునపుడు తప్పనిసరిగ శుభ్రం చేసుకొనుట. వేగంగ కన్నీరు కార్చుచూ ఏడ్చుచూ కన్నులలో బాధ ఉన్నట్లు భావించును. చురుకైన సులోచనాల ద్వారా ఉన్నది ఉన్నట్లు చూస్తూ ఉండుట. పొగత్రాగునట్లు భావించుట. కనుపాపలు పెద్దవగుట, నిదానంగ ప్రతీకార చర్య జరుగుట, కనురెప్పలు భారంగ ఉండుట, కనురెప్ప నరంబాధ, కన్నులనుంచి నడినెత్తి వరకు నొప్పి ఉండుట. చల్లని గాలిలో ఉన్నట్లయితే కన్నుల ద్వారా వడిగ లేక వేగంగా పోవునట్లు భావించుట. కంటి కండరాల నీరసంచే చూపు దుర్బలంగ ఉండుట. వెలుగునందు భయం, మరియు సహించలేక పోవును. కనుగ్రుడ్డులోని బింక మధిక మగునట్టి కంటి వ్యాధి సంభవించినట్లుండుట. నేత్రపటలానికి రక్తం సరఫరా జరుగు కేంద్రంలో అంతరాయం ఏర్పడిన వాపు వచ్చును.

ముక్కు : రక్తస్రావం కారుట, నల్లగ గడ్డలు లాగ తీగలాగ సాగెడి రక్తం స్రవించుట, తీగలాగ సాగుతూ ముక్కు నుంచి క్రిందికి రక్తం వ్రేలాడునట్లుండుట.

ఉదరం : శిశువులలో కలుగు మలబద్ధం గుదస్థానంలో ప్రాకుచున్నట్లు, కుట్టుచున్నట్లు పొడుచుచున్నట్లు ఉండుట. ఉదరంలోను కడుపులోను మొదలగు చోట్ల ఏదో సజీవంగ ఉన్నట్లు వేదన చెందుట, ముఖ్యంగ ఎడమ భాగంలో ఉన్నట్లు భావించుట. ఉదరం ఉబ్బినట్లు ఏదో భారంగ ఉన్నట్లు భావించుట.

స్త్రీ : గర్భవిచ్ఛిన్నమగునని భయోత్పాతంతో ఉండుట. ముఖ్యంగ రక్తస్రావం నల్లగ తీగలాగ ఉండుట, జననేంద్రియాల నుంచి రక్తపువత్తిడి ఉండుట, ఋతుస్రావం నల్లగ జిగురుగ తరచుగ విస్తారం కలుగుట గర్భకోశం నుంచి రక్తస్రావం ఉండుట, రక్తస్రావం గడ్డలు గడ్డలు లాగను, పొడుగుగాను, తీగలాగ ఉండును. కదలికలు తక్కువగుటవలన బాధలధికమగును. ఎడమ స్తనం లోపలిభాగంలో చివుక్కున లాగునట్లు భావించుట, కుడి స్తనాగ్రభాగంలో ఏదో సజీవంగ ఉండినట్లుండుట.

శ్వాససంబంధమైన : దగ్గు, ఆయాసం, నురుగుతో కూడిన కళ్లెవచ్చుట, కళ్లె దారంలాగ కలుగును. ఊపిరి విడుచునపుడు దుర్వాసన వచ్చుట, జబ్బుతో కూడిన చెడువాసన ఉండును. హిస్టీరియా సంబంధమైన రోగులలో కొండనాలుక పెద్దదైనట్లు తలంచును.

వీపు : కాళ్లు చేతులు మంచులాగ చల్లగ ఉండును. ఆకస్మికంగా చల్లనైనట్లు భావించును. చల్లని నీరు అతిగ పోసినట్లుండును.

కాళ్ళు చేతులు : కొన్ని కండరాలు ఈడ్పులు కలిగి దగ్గరకు ముడుచుకొని పోవునట్లుండును. నొప్పియుండుట. కండరాలు అదురుచుండునట్లుండును. కండరాలు అప్రయత్నంగా అదురుచుండు నాడీమండల వ్యాధి (కొరియా). స్త్రీలకు కలుగు నాడీమండల సంబంధమగు వ్యాధి (హిస్టీరియా). ఒకదాని తరువాత ఒకటి వచ్చునట్లు భావించును. చేతులు మొదలగు అవయవాలకు తిమ్మెర్లువట్టి పడిపోయినట్లుండుట. మోకాలు తుంటి కీళ్ళలో పగులుట. శబ్దం వచ్చుట, మొకాళ్లు కాళ్లు బలహీనంగ ఉండుట. చీలమండలం అరికాళ్లు పాదాలు అడుగు భాగంలో నొప్పి వుండును.

ఈ మందును కుంకుమ పువ్వునుంచి తయారు చేయుదురు.

## 85. లాథరస్ సతివుస్ (Lathyrus Sativus)

రోగి లక్షణాలు : వర్షాకాలంలోగాని, చల్లని తేమ వాతావరణంలోగాని ఆకస్మికంగ రెండు కాళ్ళకు సంభవించు పక్షవాతం. చిన్న పిల్లలకు ఆకస్మికంగ వచ్చు పక్షవాతం. పిరుదులు, కాళ్ళు కండరాలు శుష్కించుట, నడుచునపుడు ఛాతీ ముందుకు వంగును. తూలుచూ వణుకుచు నడుచుట, తప్పటడుగులు వేయును. నిలకడగ నిలుచుటకు ప్రయత్నించిన ముందుకు ప్రక్కకు ఊగును. క్రిందికి పడకుండా ఉండేందుకు రెండు చేతులు తుంట్లపై ఉంచుకొనును. సాచుటకు ముడుచుటకు సంబంధించిన కండరాలు గట్టిపడును. కూర్చుండిన కాళ్ళు సాగవు. మోకాళ్ళకు

పక్షవాతం, మోకాళ్ళు బిగ్రబిగిసి వంగును. నడుచుటకు సాధ్యం కాకుండును. కాళ్ళు చల్లగ మంటగ ఉండును. కీళ్ళ వాత సంబంధమగు పక్షవాతం పిక్కకండరాలు బిగ్రబిగియును. ముందుకు వంగి కూర్చుండును. లేచుట చాలా కష్టం కాళ్లు బరువుగ చల్లగ ఉండి పాదాలు పైకెత్తుట కష్టంగ ఉండును. పాదాలు ఈడ్చుకొనుచూ కాళ్ళపై నడుచును. వేడి మంటగ ఉండును. కప్పును తీసివేయుటచే ఉపశమనం కలుగును. వెన్నుపాము రక్తక్షీణతచే తిమ్మెర తదనంతరం కాళ్ళలో నొప్పి, అడుగువేయలేడు. నరాల అనిచ్ఛా ప్రవర్తన అధికమగును. నంజువ్యాధి (బెరి-బెరి) కాళ్ళు చేతులను నిరంతరం కదలించుచుండును. ఇన్‌ఫ్లూయెంజ శుష్కింపచేసి నిస్త్రాణ నొందించును. వ్యాధుల తదనంతరం కలుగు నీరసం భారం నరాల శక్తి మెల్లగ కలుగునపుడు ఈ మందు చక్కగ పనిచేయును. కన్నులు మూసుకొని నిలిచినపుడు తల త్రిప్పును. మూత్రం తెలియకుండగనే పోవును. నపుంసకత్వం, శిశ్నోద్రేకం, స్ఖలనాలు, నడుమునొప్పి తీవ్రంగా ఉండి కదలలేడు. చేతులతో ఏదైన పనిచేసిన ఎడల చేతులు వణుకును.

**మనస్సు :** విచారంగ ఉండుట, కృంగుట, ప్రక్కటెముకల బాధ, కండ్లు మూసుకొని నిలిచిన తల త్రిప్పును.

**నోరు :** నాలుక చివర లేక కొనాన మంట, నొప్పి ఉండుట, నాలుక పెదవులు తిమ్మెరగ ఉంటూ ముళ్ళుగ్రుచ్చుకొనుచున్నట్లుండును. పుండ్లు ఉండుట.

**కాళ్లు చేతులు :** వ్రేళ్ళు చివరన తిమ్మిరిగ ఉండుట, నడుచునపుడు కాళ్ళు వణుకుచు తూలుచూ నడుచును. కాళ్ళు అతిగ బిగ్రబిగిసి నట్లుండును. నడుచునపుడు ఈడ్పులు కలుగును. నడుచునపుడు మోకాళ్లు ఒకదానికొకటి కొట్టుకొనుట, కాళ్ల చల్లదనం కలిగి బాధపడునపుడు కండరాలు బాధాకరంగ అప్రయత్నంగా ముడుచుకొనిపోవుట, పాదాలు చల్లగ నుండును. కూర్చుండునపుడు కాళ్ళు చాచడం కాని అడ్డంగ కాళ్ళు ముడుచుటకాని కష్టంగ ఉండుట, కీళ్ళవాతంతో పక్షవాతం వచ్చినట్లుండుట, కాళ్ళకు సంబంధించిన కండరాలు శుష్కించి ఉండుట. కాళ్ళు నల్లగ ఉండుట, కాళ్ళు క్రిందికి దింపి ఊగించినట్లయితే ఉబ్బినట్లుండును. చీలమండలం బిగ్రబిగిసినట్లుండి కుంటితనంగ ఉండుట, మొకాళ్ళు కాలివ్రేళ్ళు భూమినుంచి కదలించలేక ఉండుట, రోగి కూర్చుండినపుడు ముందుకు వంగును. చక్కగ నిలుచుటకు కష్టంగ ఉండును.

**మూత్రం :** మూత్రకోశంలో అసంకల్పిత ప్రతీకారం వృద్ధిచెందుట. తరచుగ అత్యవసరత ఉండుట లేదా వాటంతకు అదే విసర్జించుట.

ఈ మందును ఒకరకమగు బటానీ గింజనుంచి తయారు చేయుదురు.

## 86. లోబెలియా ఇన్‌ఫ్లాటా (LOBELIA INFLATA)

**రోగి లక్షణాలు :** రక్తనాళం బిగిని అదుపులో నుంచు నరాలను ఉత్తేజపరుచుట, గర్భిణీ స్త్రీలలో వడిగ వికారం వాంతులు కలుగునపుడు మంచి ఫలితం యిచ్చును. వేవిళ్లు, చల్లని చెమటలు ముఖంపై పట్టినట్లుండును. దీర్ఘకాలికంగ ఉండు వాంతులు, లాలాజలం విస్తారంగ స్రవించుట, వాంతులు కలిగిన తదనంతరం శక్తి అంతమయిపోయి సొగిలపడినట్లుండుట, వికారంతో తలనొప్పి పొగాకు నమిలిన తరువాత వాంతులు కలిగి చాలా అలసట చెంది బాధలెక్కువగుట, తేలికపాటి జలుబు కలిగినప్పటికి శ్వాస కష్టంగా ఉండును. వెన్నుపాము బాధలవలన వంగినట్లుండి ఏ మాత్రం సహన శక్తి లేకపోవుట. గుండెపోటు, సారాయి మత్తు పానీయాల వలన కలుగు దుష్టపరిణామాలను నివారించుట, ఉబ్బసం దగ్గు ఋతుశూల, నల్లమందు తిన్న వారికి కలుగు దుష్టఫలితాలపై పనిచేయును. కామెర్లు, జీర్ణకోశానికి చెందిన వ్యాధులు.

**తల :** తలత్రిప్పుట, చస్తానని భయపడుట, జీర్ణకోశానికి సంబంధించిన తలనొప్పి, వికారం, వాంతులు, నీరసించిపోవుట, మధ్యాహ్నం నుంచి అర్ధరాత్రి వరకు ఉండుట, పొగాకు వలన సంభవించు దుష్పరిణామాలు మందంగ ఉండుట, నొప్పులు భారంగ ఉండుట.

**ముఖం** : ఆకస్మికంగా పాలిపోయినట్లుండుట, చెమటలు చల్లటి నీళ్లతో స్నానం చేసినట్లుండుట.

**చెవులు** : స్రావం అణగారుటవలన, గజ్జి చిడుము అణగారుట వలన చెవుడువచ్చుట, గొంతు నుంచి చెవుల వరకు పోటు వుండుట.

**నోరు** : లాలాజలం విస్తారంగా స్రవించుట, రుచి చేదుగాను, మంటగ ఉండుట, పాదరసం సంబంధమగు రుచి ఉండుట, నాలుక తెల్లని పూత కలిగి ఉండుట, అమత్వక్కు జిగటగ ఉండును.

**కడుపు** : పుల్లగ ఉండుట, జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బి ఉండుట, ఆహారం తిన్నతరువాత శ్వాస తగ్గినట్లుండుట, లాలాజలం, విస్తారంగ ప్రవహించుట, గుండెలో మంట, వికారం, వాంతులు అతిగ ఉండుట, నీరసించిపోయినట్లుండును. కడుపు సంబంధంగ నిస్రాణ, నిస్సత్తువ గనుండును. ఆకలి అధికంగ ఉంటూ లాలాజలం విస్తారంగ స్రవించును. చెమటలు విస్తారంగ ఉంటూ సొగిలపడినట్లుండును. పొగాకు వాసనగాని, రుచినిగాని సహించలేకపోవుట. రుచి చేదు, మంటగ ఉండుట.

**శ్వాససంబంధమైన** : ఛాతీ చుట్టునొక్కివేసినట్లుండి దగ్గరకు ముడుచుకొనిపోవునట్లుండుటచే ఆయాసం ఉండును. ఎటువంటి అలసటవల్లనైనా బాధలధికమగును. ఛాతీలో భారం ఒత్తిడి కలిగినట్లుండును. వేగంగ నడుచుట వలన తగ్గినట్లుండును. గుండె ఆగిపోతుందేమోయని భావించుట. ఉబ్బసం సంభవించుట బలహీనంగ ఉండుట, కండరాలు ముడుచుకుపోయి నట్లుండుట, ఎడతెగని శబ్దంతో కూడుకొన్న దగ్గు, శ్వాస తగ్గిపోవుట, గొంతులో పట్టుకొన్న ట్లుండుట, ముసలివారిలో ఊపిరితిత్తులలోని గాలి గోళాలుబ్బినట్లుండుట.

**వీపు** : త్రికాస్థి నడుముకు క్రింది భాగంలో నొప్పి ఏ కొంచెం తాకినా భరించలేరు. ముందు వంగి కూర్చొనును.

**మూత్రానికి సంబంధించిన** : ఎర్రని రంగుతో మూత్రవిసర్జన, విస్తారంగ మడ్డిలాగ ఎర్రని రంగుగల మూత్రం విసర్జించుట.

**చర్మము** : సన్నని ముళ్ళుగ్రుచ్చుకొన్నట్లుండుట, దురద లేక నవ్వతో వాంతిచేసికొనునట్లుండుట.

ఈ మందు భారతదేశంలో పండు పొంగాకు చెట్టు నుండి తయారు చేయుదురు.

## 87. రూటా గ్రావియోలెన్స్ (RUTA GRAVEOLENS)

**రోగి లక్షణాలు** : ఎముక కన్న మెత్తగ నుండి కీళ్లవద్ద ప్రక్కటెముకల చివరలందు నాసికాగ్రం వద్ద వెలుపలి చెవియందు ఎముకను కప్పియుండు తెల్లని పీచువంటి పొర వాచుట, కన్నులు, గర్భకోశం, కంటికి సంబంధించిన కండరాలు సాగినట్లుండుట. శరీరం అన్ని భాగాలలో కుముకు దెబ్బలులాంటి నొప్పులుండుట, బెణకు లేక ఇరుకునొప్పి ఇరుకు తరువాత కుంటితనం వచ్చుట, కామెర్లు, తీవ్రంగా అలసట చెందినట్లు భావించుట, బలహీనత, నిరాశ, నిస్పృహ వుండుట, గాయాలు, కుముకు దెబ్బలు వలన ఎముకల నొప్పి కలిగి ఉండుట. గాంగ్రేనుకు సంబంధించి కంతి గర్భకోశంలో పుట్టరణం ప్రాణాపాయకరమగు ఉబ్బులకు చాలా మంచి ఫలితం యివ్వగల మందు. అవయవంగాని కీలుగాని స్థానం తప్పియుండుట, కీళ్ళనొప్పులు వుండుట.

**మనస్సు** : ఇతరులు చెప్పునది కాదనుట, జగడమాడుటకు యిష్టం ఉండుట ఇతరులవలనగాని తనవలనగాని అసంతృప్తిగ ఉండును. ఆతృత, మానసికంగ ఉత్సాహాదులు కృంగినట్లుండును. సాయంత్రానికి విచారంగ వుంటూ ఉండును.

**తల** : గోరునుంచి నొప్పి వుండుట, మత్తు కలిగించు పానీయాలు త్రాగిన తదనంతరం నొప్పివచ్చుట. ఎముకపై పుండు ఏర్పడి నొప్పి ఉండును. ముక్కు నుంచి రక్తం కారుట.

**కన్నులు** : తలనొప్పివలన కన్నులు సాగినట్లుండుట, శక్తికి మించిన పనిచేయుట బరువుగ

నుండును. కన్నులు వేడిగాను ఎర్రగనుండును. చదువుచున్న, కుట్టుచున్న నొప్పులు కలిగియుండును. చూపువలన కలత చెందుటను సరిపుచ్చును. చదువుతూ ఉండునపుడు అలసటవల్లవచ్చు నొప్పి, కనుగ్రుడ్డు ఎముకల గూడులో నొక్కుచున్నట్లుండును. కనురెప్ప యందలి పల్చని సందాయక ధాతువు సంబంధించి మృదులాస్థి ఉపాస్థి కుముకుదెబ్బలులాగ ఉన్నట్లు భావించును. కనుబొమలు అపారంగ పోటు ఉండును. కంటి కండర నీరసంచే చూపు దుర్బలంగ ఉండుట.

**కడుపు** : కడుపులో నొప్పి కొరుకుకు తినుచున్నట్లుండు తీవ్రనొప్పి స్పష్టంగ సూచించునట్లుండును.

**మూత్రావికి సంబంధించిన** : మూత్రవిసర్జనానంతరం మూత్రాశయభాగం మెడలో నొక్కినట్లుండుట మూసివేయునపుడు నొప్పి ఎడతెగకుండ మూత్రవిసర్జనకు ఉత్తేజపరుచును. మూత్ర కోశం భర్తీగ ఉన్నట్లు భావించును.

**పురీషనాళం** : మలవిసర్జన కష్టంగ ఉండుట, బలవంతంగ ముక్కినగాని మలవిసర్జన జరుగదు. మలబద్ధం జిగటగ నురుగుతో కూడిన మలవిసర్జన ఒకటి విడిచి ఒకటి కలుగుట మల విసర్జనలో రక్తం కారుట, కూర్చుండునపుడు పురీషనాళంలో చీల్చుచున్నట్లు కుట్టుచున్నట్లు నొప్పి ఉండును. క్రింద ప్రేగులలో పుట్టరణం వలన బాధలధికమగుట, ప్రేగులలో కదలిక కలిగినపుడల్ల గుదం దిగజారుట, తరచుగ మలవిసర్జనకు ఉత్తేజపరుచుటవలన ఫలితం లేక పోవుట, ముందుకు వంగుటవలన పురీషనాళం బయటకు త్రోసుకొనివచ్చును.

**శ్వాస సంబంధమైన** : దగ్గు విస్తారంగ ఉండుట, కళ్లి జిగటగ పచ్చగ దగ్గుటవలన బయటకు వచ్చును. ఛాతీ బలహీనంగ ఉండునట్లు భావించును. రొమ్మెముక ఛాతీ యందు భాగపు ప్రక్కటెముకలు నొప్పి కలిగి ఉండుట, ఛాతీ బిగుసుగ ఉండుటవలన ఊపిరి పీల్చుటకు ఇబ్బందిగ ఉండును.

**వీపు:** మెడ వెనుక భాగం నడుము వీపు ప్రక్కటెముకలకు కటి ప్రదేశానికి మధ్యభాగం వీపునొప్పిగ వుండును. వత్తిడివలన వీపులో నొప్పి తగ్గిపోవును. ప్రసవసమయంలో కలుగు దొంగనొప్పులకు పనిచేయును. ఉదయం లేచునపుడు నడుమునొప్పి బాధ ఉండును.

**కాళ్లుచేతులు:** వెనుపాము, కాళ్ళుచేతులు కుముకు దెబ్బలు తగిలినట్లుండుట, వీపులొ చిన్నెముకలు ఛాతీ ప్రక్కటెముకలు నొప్పిగ వుండుట, తుంటి తొడలు బలహీనంగ ఉండుట, వ్రేళ్ళు ముడుచుకొని పోవుట, మణికట్టు చేతులు బిగుసుకొనిపోయి నొప్పిగనుండును. నాడీమండలం తుంటకు చెందిన నరాలు రాత్రిపూట బాధలు అధికంగ వుండును. వీపుక్రింది భాగం నుంచి తుంటు తొడలవరకు నొప్పి ఉండును. తొడవెనుకభాగం కం డస్నాయువు చిన్న ది నట్లు భావించుట కండరాల చివరి భాగంలో వుండు నొప్పి ఉండును. మణవయొక్క బలమగు స్నాయువులో బాధ నొప్పి వుండును. కాళ్లుచేతులు సాచునపుడు తొడలలో నొప్పి వచ్చును. పాదాలు, కాళ్లు చీలమండలంలోని ఎముకలు నొప్పితే ఉండును. విశ్రాంతి లేక, మనస్సు స్థిమితం లేకుండ యుండును. ఈ మందు బ్రాహ్మి మూలికనుంచి తయారుచేయుదురు.

## 88. థియా (THEA-INDIAN TEA)

**రోగిలక్షణాలు** : నరాల బలహీనతవలన నిద్రపట్టకుపోవుట. గుండెకు సంబంధించిన వ్యాధులు, గుండె వేగంగ కొట్టుకొనుట, పూర్వం నుంచి టీ త్రాగువారిలో కలుగు అజీర్ణం అనారోగ్యంచే వచ్చుతలనొప్పి, అశ్లీలకు సంబంధించిన చెడ్డ కలవరింపులు వచ్చుట, ఆత్మహత్య చేసుకొనగోరుట. పుల్లనివస్తువులు తినగోరుట.

**తల:** మానసికంగ నిలకడలేని గొప్పతనం ఉండుట. కోపముండును ఒకేచోట సూర్యకిరణాలవలె చుట్టువ్యాపించుటచే కలుగు వ్యాధివలన వచ్చు తలనొప్పి విశ్రాంతి లేక నిద్ర

పట్టకపోవుట, నిజంగలేనివాటిని ఉన్నట్లు భావించి వినుట, తల వెనుకభాగంలో చల్లగ తేమగ ఉండును.

కడుపు: కడుపుమీదగల ఉదర కుహరమండలం కృంగిపోయినట్లు తలంచును. స్పృహపోయినట్లు భావించుట, పుల్లని పదార్థాలు కోరుట, ఆకస్మికంగ అత్యధికంగ వాయువు ఉత్పత్తి చెందుట.

ఉదరము: ఉదరంలో వాయువు వలన కలుగు గుడగుడశబ్దం ఉండును. గిలక కలిగి ఉండును.

స్త్రీ: అండాశయంలో చాల సున్నితంగ నుండుట, పుండుగ నొప్పిగ ఉండును.

గుండె: భారంగ ఉండుటవలన ఆందోళన చెందును. గుండెను కప్పిఉన్న ఛాతీభాగం సంబంధించిన వాపువలన వ్యాకులం చెందినట్లుండును. రోగికి తెలియునట్లు గుండె వేగంగ కొట్టుకొనుట. ఎడమవైపు పరుండుట. కష్టంగ ఉండును. వణుకుచుండుట, పక్షిరెక్కలు కొట్టుకొనునట్లుండును. నాడులు త్వరితంగ కొట్టుకొనును. కాల నియమం లేకుండ విడిచివిడిచి వచ్చుట.

నిద్ర: పగటిపూట నిద్రపోవు స్వభావం ఉండును. రాత్రిపూట నిద్రమత్తుగా వుండును. రక్త నాళాల ఉద్రేకం చెంది నిద్రపట్టకపోవును. చర్మం పొడిగ వుండును. విపరీతమైన కలలువచ్చుటవలన అమిత భయోత్పాతంతో వుండును.

ఈ మందు భారతదేశంలో పండు టీయాకుతో తయారుచేయుదురు.

## 89. థాయిమల్ (THYMOL)

**రోగిలక్షణాలు :** జనేంద్రియాలకు మూత్రావయాలకు సంబంధించిన వ్యాధులు పెతాలజీకి సంబంధించిన శుక్రం అప్రయత్నంగ స్ఖలనమగుట, రతి వాంఛతోగాని లేకపోవుటలోగాని శిశ్నోద్రేకం అత్యధికంగను చాల నొప్పిగను బాధగ నుండుట. ప్రోస్టేటు గ్రంథి నుంచి పల్చని స్రావం వచ్చుట, జనేంద్రియ సంబంధమైన తీవ్రవాంఛ అదుపులో ఉంచునట్లు చేయును. జనేంద్రియాలకు సంబంధించిన నరాలలో ఉండు శక్తి అంతయు పోయి ఉండుట. ఆదర్శ వంతమైన ఉత్పత్తి జరుగుట, కొంకి క్రిమివ్యాధి నివారించుటలో ప్రత్యేకంగా పనిచేయును.

**మానసికమైన:** తేలికగ కోపం విసుగునొందుట, నిరంకుశమైన అభిప్రాయంమీద ఆధారపడుట, తప్పని సరిగ తన స్వంత మార్గం గుండాపోవుట, జనసమూహం కోరుట, శక్తి అంతయు పోయి వుండును.

**వీపు:** అలసిపోయి ఉండుట, నడుముకు సంబంధించిన భాగంలో నొప్పిగ వుండును. ప్రసవసమయంలో మానసికంగ శారీరికంగ బాధలుండును.

**పురుషులు:** చెడుఅలవాట్లకులోనై కామాతురతగల కలలు వచ్చుట వలన రాత్రిపూట స్ఖలనం విస్తారంగ కలుగును. మూత్రవిసర్జన సమయంలో మంటగ ఉండుట. తరువాత మూత్రం బొట్లు బొట్లుగ పడుట, మూత్రం విస్తారంగ విసర్జించుట, యూరిక్ యాసిడ్ యందుండు పదార్థాలు అభివృద్ధి చెందుట, మూత్రంలో ఫాస్ఫేట్సు తగ్గిపోవుట.

నిద్ర: అలసటవలన మేల్కొనియుండుట, విశ్రాంతి నొందకపోవుట, విపరీతంగ కామాతురతగల కలలు వచ్చును.

ఈ మందు వాము చెట్టునుంచి తయారు చేయుదురు.

## 90. వెరాట్రం విరైడ్ (VERATRUM VIRIDE)

**రోగిలక్షణాలు:** ఉధృతం ముమ్మరం ఆకస్మికంగ వచ్చి తాత్కాలికంగ ఉండుట, అధిక

రక్తపుపోటు, తక్కువ రక్తపుపోటు రెండువిధాల ప్రేరేపణవలన క్రిందికి పడిపోవునట్లుండుట, రక్తం అధికంగ కూడుట, ముఖ్యంగ ఊపిరితిత్తులు మెదడు ఆధారంతో వికారం వాంతులు కలుగుట, అదురుచుండుట, పొర్లు, నిండు రక్తం?ల వ్యక్తులను సరిచేయును. గొప్పగ సాగిలపడినట్లుండుట, గుండెకు వాత నొప్పులు వచ్చుట, ముఖం ఉబ్బి కమిలిన రంగుగ నుండును. ఆగ్రహం గల కోపం వచ్చుట, మూర్ఛ వడదెబ్బకు ఉపయోగపడును. రక్తప్రసరణాధిక్యతచే ప్రథమావస్థలో న్యూమోనియా వ్యాధిలో వాపు వచ్చినట్లుండును. ఉష్ణం తీక్షణంగ ఉండుట, వంశపారంపర్యంగ ఉండు ఈడ్పులకు సంబంధించి వ్యాధి, కాళ్లచేతులు నిత్యం కదలించుచుండుట, అవయవంలోని ఒక ముఖ్య ధాతువు అమితంగ పెరుగుటచే అవయవ పరిమాణం హెచ్చుట. ఇందులో అవయవంచేయుపని తగ్గును. కండరాలకు పక్షవాయువు సంభవించుట, ఊపిరితిత్తులకు జీర్ణకోశానికి సంబంధించిన నరాలు మెదడు పొరింగ్సు సప్తపథ గుండె కడుపు అన్ననాళం నాడులు గట్టిగ వుండుట, జ్వరం తీక్షణంగ ఉండుట, నాలుక మధ్యభాగంలో ఎర్రగ వుండుట, నాలుకపై పూత పచ్చగ వుండుట, గుండెబలహీనంగ వుండు రోగులలో ఉష్ణం తగ్గించేందుకు ఈ మందు వాడకూడదు. ఇది గుండెను కృంగదీయును. తక్కువ శక్తిగల ఈ మందును బలానికి ఆకలి గుణం కలిగించెందుకు వాడవచ్చును. మూర్ఛ హిస్టీరియా తలకు రక్తప్రసరణ అధికమగుటచే ధనుర్వాతం సంభవించబోవునట్లుండును. మెడవెనుక భాగం నొప్పిగ ఉండును. ఎక్కిళ్లు శరీరంలో ధనారింపుగ కొట్టుకొనుచుండుట, చమటవల్ల చల్లగ వుంటూ నాడీమండలం శరీరం నిస్త్రాణమై పోయినట్లుండును.

మనస్సు: కలహం చేయు స్వభావం ఉండుట, చిత్తభ్రమ, మూర్ఛ సంధి.

తల: తీవ్రంగ రక్తం కూడుట, ఇంచుమించు రుద్రవాతం మెదడునందలి రక్తనాళాలు పగులుటచే కలుగు పక్షవాతం తలవేడిగ వుండుట, కండ్లు ఎర్రగ ఉండుట, ముఖం ఉబ్బి నీలిరంగుగ మారినట్లుండుట, ముఖం శవాకృతిగ మారినట్లుండుట, తల వెనుకకు లాగినట్లుండుట, కనుపాపలు విపులీకరించుట, చూపు రెండుగ యగుపడుట, మెదడు చుట్టియున్న పొరలవాపు మెడవెనుక భాగం నుండి నొప్పి వచ్చుట, ?లపైన పట్టుకొన లేకపోవుట, వడదెబ్బ, తల చిందుచున్నట్లుండుట, గుండెనుంచి రక్తం గొనిపో?) రక్తనాళాలు ధనారింపుగ కొట్టుకొనుచుండుట, ముఖం ఎర్రగ నుండుట, ముఖ కండరాలు అదురు?ుండుట, ఈడ్పులు ఉండుట, వికారంతో తల త్రిప్పుట.

నాలుక: నాలుక మధ్యలో ఎర్రని చారలు కలిగియుండుట, తెల్లగగాని, పచ్చగగాని ఉండుట, పుండులాగ వున్నట్లు భావించుట, లాలాజలం అధికంగ ఉండును.

కడుపు: దాహంతో ఉండుట వికారం వాంతు?ు, కొద్దిపాటి ఆహారంగాని పానియంగాని తీసుకొన్న వెంటనే వెనుకకు వచ్చుట, పిండినట్లు, నొక్కివేయుచున్నట్లు నొప్పి వుండుట. వెచ్చని పానీయంవల్ల వృద్ధి చెందుట, ఎక్కిళ్లు అన్ననాళం ఈడ్పుతోను అతిగ నొప్పి కలిగి ఉండుట, కడుపు అన్ననాళంలో మంటగ వుండుట.

ఉదరము: కటిప్రదేశం కూపకం వస్తికం కటిప్రదేశమందలి ఎముకల గూడుపైన పుండులాగ నొప్పియుండును.

శ్వాససంబంధమైన: ఊపిరితిత్తులు రక్తంతో కూడియుండుట, ఊపిరి పీల్చుట, కష్టంగ ఉండుట, ఛాతీపైన బరువుభారంగ ఉన్నట్లు భావించుట, న్యూమోనియా కడుపులో శోషిల్లునట్లు భావంతో ఉండుట. ఉధృతంగ రక్తం కూడుట, కింకవాయువు శ్వాసనాళం స్వరపేటికలవాపు ఋతుస్రావం అగుపడుముందు శూల వచ్చుట, మూత్రం బొట్లుబొట్లు విసర్జించుట.

మూత్రం: మూత్రం కొద్దికొద్దిగ మడ్డిలాగ మేఘవర్ణం గల రంగుతోవచ్చును.

స్త్రీ : ప్రసవసమయంలో గర్భకోశ ద్వారం బిర్రబిగిసి విపులీకరించక పోవుట, ఇందుచే ప్రసవం కానేరదు. సూతిక జ్వరం ఋతుస్రావం బంధించుట, తలకు రక్తం అధికంగ కూడుట, బొట్లుబొట్లు మూత్రవిసర్జన ఋతుస్రావం అగుపడుముందు ఋతుశూల వచ్చుట.

గుండె: నాడులు మెల్లగ మెత్తని మృదువుగ బలహీలత కాలనియమం లేకుండ విడిచి విడిచి వచ్చును. నాడులు బిర్రబిగిసినట్లుండును. బిగువు నీరసంగ ఉండుట, గుండె ప్రాంతంలో ఎతెగకుండ మంట మందంగ నొప్పి వుండును. గుండె కవాటములకు సంబంధించి వ్యాధులు శరీరమంతయు నాడులు కొట్టుకొనును. ముఖ్యంగ కుడితొడలో నాడులు కొట్టుకొనును.

కాళ్ళు చేతులు : విసర్పి అక్కి ఒకరకపు అంటుచర్మవ్యాధి అతి ఎర్రగ నుండి జ్వరం తీవ్రమంట మొదలగు లక్షణాలుండును. మెదడుకు సంబంధించిన లక్షణాలుండును. చర్మం పైన ఎర్రబడుట, కుసుమ మొదలగు ఒరువు కలిగించు స్రావాలచే ఇట్లు కలుగును. పలు భాగాలలో దురదవుండుట, చమటలు వేడిగా పుట్టుట.

జ్వరం : సాయంత్రం శరీరంలో అత్యధికంగా ఉష్ణం ఉండుట, ఉదయం పూట తక్కువ ఉష్ణం ఉండును. చీమును కలిగింపచేయు జ్వరం ఉష్ణంవలన గొప్పగా మార్పులు చెందును.

ఈ మందు భారతీయ బిరెడి లేక ఇండియన్ పోక్ నుంచి తయారుచేయుదురు.

## 91. అరహరపత్ర (ARHARPATRA-THE LEAF OF ARHAR)

రోగి లక్షణాలు : నోరు వాచుట నోటిలో అనుత్వక్కు, వాపు నాలుకపై పుండ్లు, దీని రసం తీసి గాని ఆకులను చెట్టుకొమ్మలను నూరి పొడి చేసి నీటిలో తడిపి నాలుకపై రోజుకు మూడు సార్లు మర్దించిన నోటిపూత నాలుకపై పుండ్లు మొదలగునవి నయమగును. పచ్చకామెర్ల వ్యాధి నోటి నుంచి పుల్లని రుచి తేన్పులు వచ్చునపుడు పనిచేయును. పుల్లని రుచిగా ఉండుటను పోగొట్టును.

ఈ మందు కందిచెట్టు ఆకులు పట్టునుంచి తయారుచేయుదురు.

## 92. యుపటోరియం అయాపానా (EUPATORIUM AYAPANA)

పాముకాటుపై ద్రోణ, ఇక్కినీషియా మందులు పనిచేయులాగ ఈమందు కూడా పాము కాటుకు పనిచేయును. ఈ మందును పై పూతగాని, కడుపులోనికి యిచ్చిన పామువిషం దుష్టఫలితాలను హరించును. శరీరంలో ఏ భాగంలో తెగినా, గాయం తగిలినా రక్తం కారుటను ఆపుచేయును. నోటిలోని పుండ్లను నివారించును. గ్రహిణి (రక్తవిరేచనాలు)వ్యాధి నివారించుటలో మంచి ఫలితం యిచ్చును. క్షయ రోగులలో దగ్గుతోపాటు శ్వాసకోశాలనుంచి స్రవించు రక్తస్రావాలను హమామిలిస్ మామామిలిస్ ఇపికాక్, ఎకలాయిఫాఇండికా మందులు సమానంగా పనిచేయును.

## 93. ఆమల్కి (AMALKI)

రాత్రి నిద్రలో శుక్ర స్కలనమగుట నివారించును. ఆయుర్వేద మందులలో చ్యవనప్రాసవిధంగా శ్వాస కోశాలకు సంబంధించిన వ్యాధులకు పనిచేయును. అదేలాగ ఈ మందు (ఆమల్కి) శ్వాసకోశ దగ్గులు నివారించుటలో చక్కగాపనిచేయును. ఊపిరితిత్తులలో కూడియుండు కఫమును హరించివేసి బాధ నివారించును. శ్వాసకోశాలందును, దగ్గులందును జస్టీషియా (వాసాక) మందు. మాదిరి పనిచేయును. అజీర్ణం వలన పుల్లని తేనుపులు మలబద్ధం నివారించుటకు మంచి మందు, ఈ మందు ఉసిరిక చెట్టు కాయలనుంచి తయారుచేయుదురు. తెలుపుకు నలుపుకు మధ్య రంగు వెరసిన నుసిరంగు గల వెంట్రుకలను నల్లగ మార్చును.

## 94. ఎన్హైడ్రో (ANHYDRO)

ఈ మందు ముఖ్యంగా పైత్యజ్వరం, జీర్ణజ్వరం జీర్ణకోశానికి సంబంధించిన వ్యాధులకు పనిచేయును.

## 95. కాషియా సఫోరా (CASSIA SAPHORA)

గాయాలు, దెబ్బలు తామర, ఈ వ్యాధి వృత్తములువలె వ్యాపించి పైపొలుసులు

ఊడుచుండును. మొదలగు చర్మవ్యాధులకు పనిచేయును.

## 96. టిరోకార్పస్ సాంటలినస్ (PTEROGARPUS SANTALINUS)

మొలలవ్యాధి, మూలశంక రక్తస్రావం ఉండుట, కన్నులు లేచిపోయినట్లుండుట, తలనొప్పి ఉండునపుడు మంచిఫలితం యివ్వగలమందు.

## 97. ట్రిబ్యులస్ టెరెస్ట్రస్ (TRIBULUS TERRESTRIS)

సెగవ్యాధి (గనోరియా) నపుంసకత్వం మానసికంగా శారీరకంగా బలహీనత ఉండును. ముఖ్యంగా మూత్ర విసర్జన బాధగా నొప్పిగా ఉండుట, జనేంద్రియాలు నీరసించి పోయి ఉండుట, శుక్రస్ఖలనమగుట, ప్రొస్టేటు గ్రంది వాచుట, శరీరంలోగాని మూత్ర పిండాలలో రాళ్ళవంటివేర్పడుట, హస్త ప్రయోగం వల్ల కలుగు బలహీనత, శుక్రనష్టం మొదలగు లక్షణాలపై పనిచేయును.-ఈ మందు పల్లేరు కాయలనుంచి తయారుచేయుదురు. దీనినే ఇక్షుగంధా అని అందురు.

## 98.పెక్రోరిజా (PECRORRHIZA)

క్రిములు జీర్ణకోశంలో గుడగుడమంటూ జ్వరం వచ్చినట్లుండును. పిత్తకోశంలో గడబిడతోపాటు జ్వరంవచ్చుట, ఆమ్లమధికమగుటవలన కలుగు అజీర్ణ వ్యాధికి లాభదాయకంగా ఉండగలదు.

## 99. ముత్తా (MUTHA)

జీర్ణశక్తిని కలిగించుటలో గొప్ప శక్తివంతంగా పనిచేయును. అజీర్ణం అరోచకం ఆమ్లత్వం గుండెలో మంట, విరేచనాలు, జీర్ణకోశం ప్రేగులు గాలితో ఉబ్బరించియుండుట మొదలగు వ్యాధులకు గొప్పమందు, ఈ మందును తుంగ నుంచి తయారు చేయుదురు.

## 100. మైకా (MICA)

అధికంగా రక్తం పోయినవారలకు, ప్రాణాధారమైన రక్తం శుక్రం మొదలగు ద్రవాలు నష్టపోవడంగాని, హానిజరగడంగాని నుండునపుడు పనిచేయును. నరాల బలహీనత, నపుంసకత్వం క్షయవ్యాధివలన శుష్కించి పోవుట, అతిమూత్రవ్యాధి, దీర్ఘకాలికంగా ఉండు జ్వరాలకు సిద్ధౌషదం. ఈ మందు అబ్రకం నుంచి తయారు చేయుదురు.

## 101. టెర్మినాలియా వలెరికా (TERMINALIA VALARICA)

సైత్యం అధికంగా ఉండుట, దగ్గు స్వరం బొంగురుపోవుట, మలబద్ధకం నివారించును. ఈ మందు తాండ్రనుంచి తయారు చేయుదురు. తాండ్ర త్రిఫలంలో ఒకటి.

## 102. బ్రయోఫైలం కలిసినం (BRYOPHYLUM CALYCINUM)

కలరాసోకిన ప్రథమ దశలోను, అతిగా విరేచనాలు, గ్రహిని చీము రక్తబేదులు, జీర్ణకోశ వ్యాధులు నివారించును.

## 103. వర్నోనియా ఎన్థాల్ మిన్టికా - సోమరాజ (VARNONIA ANTHALMINTICA-SOMARAJA)

ప్రేగులలోని క్రిములను నిర్మూలించుటలో ఉత్తమ ఔషధం. స్వేత కుష్టువ్యాధికి ఆలివ్ ఆయిల్‌తో మిశ్రమంచేసి పైపూతగా వాడిన ఉపయోగం ఉండును. పలురకాల చర్మవ్యాధులకు

మేలుచేయును. రాత్రి నిద్రలో తెలియకుండా మూత్రంపోవుట, రాత్రి పూట పండ్లు నములుట, మొదలగు వ్యాధులకు మేలు చేయును.

ఈమందు సోమరాజ్ విత్తనాలనుంచి తయారు చేయుదురు.

## 104. వైటెక్స్‌నిగుండో (VITEX NEGUNDO)

తరుణ దీర్ఘకాలికంగా ఉండు జ్వరాలు, చిన్నపిల్లలు, శిశువుల ప్రేగులలో నుండు నుసిపురుగుల వలన వచ్చు జ్వరాలు పిల్లలు వృద్ధి చెందలేరు. శైత్యం వలన వాంతులగుట, పిత్తకోశం నుండి రాళ్లువెలువడుటచే ఉదరకుహరమందు కుడివైపు పైభాగంలో కలుగుశూల, పలురకాల చర్మరోగాలకు ఈ మందును లోపలికి పైపూతగాను వాడిన మంచి ఫలితం యివ్వగలదు.

## 105. సెమ్యూల్ (SEMUL)

ధాతు దౌర్బల్యం వలన నిస్సత్తువ స్వరం బొంగురుపోవుట, నరాల బలహీనత పురుషాంగం లేపన శక్తి తగ్గుట, దీర్ఘకాలీన జ్వరంతో బాధలు అనుభవించిన తదంతరం ఈ మందు వాడిన రోగిని కోలుకొనునట్లు చేయును. ఋతుస్రావం అమితంగా స్రవించు వారలకు అమోఘమైన ఔషధం. అకాల వృద్ధాప్యం నివారించగలదు. బుద్ధిమాంద్యం జ్ఞాపక శక్తి లోపించుటకు పనిచేయును.

## హోమియోచికిత్స (HOMOEO THERAPEUTICS)

**మూత్రంలో ఆల్బుమిన్ అధికంగా ఉండుట (Albuminuria)** ఎబ్రొమాగస్ట : మూత్రంలో విశిష్టగురుత్వం అతిగా ఉండుట, మూత్రంలో చక్కెర అతి ఉండుట, తరచుగా విస్తారంగా మూత్ర విసర్జన రాత్రిపూట అధికంగా వచ్చును. ఒక విచిత్రమగు చేపవాసనతో స్వల్పంగా మూత్రం మడ్డిలాగా వచ్చుట. ఆ సమయంలో బురదగా ఉండును. ఆల్బుమిల్ అతిగా వుండునపుడు మేలు చేయును. ప్రతిసారి అధిక పరిమాణం మూత్ర విసర్జన మూత్ర విసర్జనానంతరం నీరసం నిస్రాణం కలుగును. అతి మూత్రం మధుమూత్రంనందు ఈ మందువలన మంచి ఫలితం కలుగును.

## ఋతుస్రావం అగపడకపోవుట, అణగారుట, ఆగిపోవుట (AMENORRHOEA)

**జొనోసియా అశోక** : పలు రకాల గర్భకోశానికి సంబంధించిన వ్యాధులకు పనిచేయును. ఈ మందు స్త్రీల పాలిట కల్పవృక్షం లాంటిది. ఋతుస్రావం అనగారుటచే తలనొప్పివచ్చుట. ఋతుస్రావం విస్తారంగా ప్రవహించుటచే వచ్చు తలనొప్పి, ఉదరం క్రింది భాగాలలో తీవ్రనొప్పి ఉండుట, వీపులోను, తొడలోనూ నొప్పి ఋతుస్రావం తక్కువగానుండుట, పాలిపోయినట్లుండుట, గడ్డలులాగా వుచ్చుట, నొప్పి కలిగి యుండును. హిస్టీరియా, ఆకలి లేకపోవుట, మలబద్ధం, అండాశయంలో నొప్పి రెండు అండాశయ భాగాలలో నొప్పి, ఋతుస్రావం అగుపడిన తగ్గినట్లుండును. మూత్రం తరచుగా వచ్చును, ఋతుశూలకు దివ్యమైన మందు.

ఎబ్రొమరాడిక్స్ : ఋతుశూల ఋతుస్రావం చాలా తక్కువగా గాని అధికంగాగాని విసర్జించవచ్చును. గర్భకోశం నుంచి కలుగు రక్తస్రావం నల్లగనుండి, గడ్డలులాగా ఉండును. ఋతు సమయంలోగాని ఋతుసమయానికి ముందుగాని పొత్తికడుపులో శూలపోట్లు కలుగును.

## ఉబ్బు :శరీరానికి నీరుపట్టుట (ANASARCA/DROPSY)

**ఎకైరాన్తెస్ ఏస్పెరలిస్:** ఒంటికి నీరుపట్టినపుడు ఈ మూలిక ఒక భాగం పదిభాగాలు నీరు కలిసి 15 నిముషాలు పొంగించి పూటకు ఒక ఔన్స్ చొప్పున రోజుకు మూడుసార్లు వాడిన, డబ్బు వ్యాధులు నయమగును.

**ఈగిల్‌ఫోలియా:** అన్నిరకాల ఉబ్బు వ్యాధులకు మంచి మందు. జ్వరం వలన వచ్చు

ఉబ్బులకు మేలు చేయును. ముఖ్యంగా పిల్లలలో వచ్చు వాధులకు మంచి ఫలితం యిచ్చును. ఉబ్బు శరీరంలో అన్ని భాగాలలో కనపడవచ్చును. ఉబ్బు కొన్ని భాగాలలో మాత్రమే కనపడవచ్చును. సాధారణంగా కన్నుల పైరెప్పలు ఉబ్బులకు ఈ మందు సూచించును. జ్వరంతోపాటు చేతులు కాళ్ళుముఖం ఉబ్బినట్లుండును. సాధారణంగా మూత్రం అతిగా ఉత్పత్తి యుగుట, ఈ మందు వాడిన తదనంతరం రెండు మూడు రోజులలోనే మూత్రం అధికమగును. ఈ వ్యాధులకు శాశ్వత నివారణ కలిగించగల మందు.

**బొరావియాడిఫ్యూస** : బెరి బెరి నంజు వ్యాధివలన వచ్చు ఉబ్బులు, షంటికి నీరుపట్టి ఉబ్బుట, కామెర్లు కాలేయవ్యాధుల వలన వచ్చు ఉబ్బులు, గనేరియా, గుండెజబ్బులు విషపురుగు కాట్లు వలన వచ్చు ఉబ్బులు కనురెప్పలు ఉబ్బుట, చేతులు, ఉదరం పాదాల్లు కాళ్ళు ఉబ్బులకు మేలు చేయును.

నోరు, నాలుక జినేంద్రయమందు కలుగు తెల్లని చిన్న పుండ్లు, నోటిపూత (Aphthae)

**పికస్ రెవిజియోస**: నోటిపూత, పుండ్లకు ఈ మందును తేనేతో కలిపి అంటించిన మంచి ఫలితం యిచ్చును. లోనికి యివ్వవలెను.

**ఒపిముసావ్క్టం** : నోటిపూత నోటిలో పుండ్లు పిల్లలకు కలుగు నాలుకపైన నోటిలో కలుగు పుండ్లు నాలుక పూర్తిగాఎర్రగాగాని, నాలుక అంచుల భాగాలలోగాని ఎర్రగనుండుట, నాలుక మధ్యభాగంలో జిగటగా పూత కలిగి ఉండుట, పెదవులు పొడిగుంటూ నల్లగా ఉండును.

**పిజిజియం జాంబొలనం** : చిగురులనుంచి మెత్తని లేక స్పాంజివలె రంధ్రాలు గలదిగా వుంటూ నీటి బుడగలు లాగ శబ్దం ఉండుట, పగుళ్ళు, పుండ్లు కోపంగల నాలుక, ఈ మందును కషాయం తయారు చేసి యిచ్చిన గొంతులో పుండుకు పనిచేయును.

## ఉబ్బసం ; శ్వాసకాసం (ASTHMA)

**ఒపిమంసాక్టం** : చిన్నపిల్లలలోను శిశువులలోను కలుగు ఉబ్బసమునకు ఉపయోగపడును. ఛాతీ మధ్యభాగంలో నొప్పి, ఛాతీలో గురగురమను శబ్దం వుండును. రోగి వెనుకవైపు పరుండలేడు. చేతులు తల ఆధారంతో ముందుకు వంగును. ఎరేలియారెసిమోస, లోబెలియా ఇన్ప్లేటా, బ్లాటా ఒరియంటాలిస్ మందులు విఫలమైనపుడు ఈ మందు వాడిన మంచి ఫలితం యిచ్చును.

**వపుమ్యారియాఇప్పా (Saussurea ıppa)** : ఉబ్బసవ్యాధికి ఉపయోగపడు మందు. వ్యాది కాల నియమం లేకుండా వచ్చిన, మరల మరల ఈ మందును ఇవ్వవచ్చును. ఈ వ్యాధి అణగారిపోయి కాలనియమం లేకుండా శ్వాసకోశాలకు సంబంధించిన వ్యాధులు మరలవచ్చిన పనిచేయగలదు. శ్వాససంబంధమైన ఈడ్పులకు ఉపయోగపడును. శ్వాసనాళాలలో ఉండు ఉబ్బసవ్యాధికి మేలు చేయును.

## రాచపుండు (CARBUNCLE)

(రాచపుండు; ఇది సెగ్గెడ్డకన్నా పెద్దగా నుండి అనేక తూట్లు పడి చీము స్రవించును. సెగ్గెడ్డకు ఒకే తూటు పడి చీము స్రవించును. దీనితో సాధారణంగా జ్వరము యుండును.)

**అబ్రోమ ఆగస్ట**: రాచపుండ్లకును, విషపూరితమగు పుండ్లకును దివ్యమైన మందు. అతిమూత్రవ్యాధి, మధుమూత్ర వ్యాధి గల రోగులలో కలుగు పుండ్లకు మేలు చేయును.

ఎకైరాన్తెస్ ఎస్పెరలిన్ : పైకి, లోపలికి ఈ మందు వాడవచ్చును. మంటతో కూడిన నొప్పికి పైన రాసిన వెంటనే అద్భుత గుణమిచ్చును.

**విథానియా సొమ్నిపెరా (అశ్వగంధ)** : ఈ చెట్టు ఆకులను గుజ్జుమాదిరిగా తయారు చేసి రాచపుండ్లు, విషపూరితమైన పుండ్లపై అంటించిన చాలా మేలు చేయును.

## వాంతి, భేది, విషూచి కలరా (CHOLORA)

(వాంతులు విరేచనాలతో వళ్ళు చల్లగా మారువస్తే అపాయకరవ్యాధి).

**లూఫా అమారా** : విరోచనాలు, వాంతులు తరచుగా కలుగును. బియ్యం కడుగు నీరులాగా విరేచనాలు కలుగును. తరచుగా సైత్యరసం నీరులాగా వాంతులగును. విరేచనాలు, వాంతిని కలిగించును. కలరా ఆకస్మికంగా వచ్చును. విరేచనాలు వాంతులు ఒకేసారి కలుగును. కొంతకాలం చలితో ఉండునట్లు భావించును. చెమటలు పట్టుటతో చల్లగామండును.

ట్రికోసాంతన డియోయికా: కలరా వంటి విరేచనాలు, వాంతులు పల్చగా విస్తారంగా ఉండి సైతరసంతో గాని ఆమ్లముతో గాని ఉండును. రక్తవిరేచనాలు, సైత్యపు వాంతులు, నీరు తాగిన తదనంతరం వాంతులగును. రక్తం పలు రకాల రంగుతో వాంతియగును. నీరసించి స్పృహలేకుండా పడిపోవుట, విశ్రాంతి లేకపోవుట, దాహం, చెమటలు, నాడులు నీరసించి కాళ్ళు చేతులు చల్లబడి నీరసించిపోయినట్లుండును.

## మలబద్ధం (CONSTIPATION)

మొమోర్డికచెరన్షియా : మలబద్దం గలవారికి ఈ మందు మదరు టించరు. పూటకు 5 నుంచి 10 చుక్కల మందును నీటిలో కలుపుకుని రోజుకు నాలుగుసార్లు వాడాలి.

ఒసిమంగ్రాటిస్సీమం: ఇది సాధారణంగా మలబద్దానికి వాడుమందు. పిల్లలలో జలుబు, ముక్కుల నుంచి నీరు కారడం, జ్వరం, దగ్గుకు మేలు చేయును.

టెర్మినాల్లాచేబూల: విరేచన సమయంలో చెమటలు పట్టుట, మలం గట్టిగ కొద్దిగ పచ్చని రంగుతో వచ్చును. "హరితకి" అను మందు మంచి ఫలితం యివ్వగలదు. తరచుగ వచ్చినట్లు కోరిక ఉండునేగాని ఫలితం ఉండదు. బలవంతం చేసిన కొంచెం జరుగును. ఒక సమయంలో ఫలితం ఉండదు.

ట్రయికోపొంతెస్ థాయిమోకా: ఈ చెట్టు వేరుపట్టగాని మందుగాని భేదులు కలిగించే అధికారం కలదు. ఇంకా భేదికి రావాలని మందును యివ్వడం ఎక్కువ పరిమాణంగ యిచ్చిన ప్రమాదస్థాయికి తెచ్చును.

ఈ వ్యాధికి ఇంగా అబ్రోమ ఆగస్ట, ఈగల్ ఫోలియా, అసాయి, అజారడెక్టా, కాల్‌మెఘ్, నికటెసన్ మందులు పని చేయును.

## పడిశం, రొంప, జలుబు (CORYZA) ఒనోస్మియా అశోక

పడిశం, తుమ్ములు, ముక్కులనుంచి తరచుగ నీరుకారుట, ముక్కుల పనికి అంతరాయం కలుగుట, వాసన గ్రహించుట కష్టంగ ఉండును. ముక్కు రంధ్రాలలో పుండ్లు ఏర్పడుట, ముక్కునుంచి తరచుగ ఎర్రని రక్తం కారును.

**జస్టిషియా అడాటోడ**: ఎడతెగకుండ తుమ్ములుండును. మొత్తంపైన వాసన లేకపోవుట, ఆకలిలేకపోవుట, నోరు పొడిగనుండును. జలుబు, దగ్గులు, ఆయాసం తగ్గించుటలో ఇది బ్రహ్మాండమైన మందు. అమితంగ జలుబుతో తుమ్ములుండును. ముక్కులో వాపు నొప్పి, ముక్కులో ఆటంకం కలుగుటచే ముక్కుద్వారా గట్టిగ పీల్చవలసివచ్చును. పిల్లలలో ముక్కుద్వారా కలుగు జలుబు, ముక్కుమాట మాట్లాడును. తరుణంలో నొసట నొప్పిగ నుండును. ముక్కురంధ్రాలలో పుండ్లు వుండును.

**లూఫాబిందాల్**: ముక్కులలో కలుగు జలుబు తరుణవ్యాధికాని, దీర్ఘవ్యాధికాని కుదుర్చును. జలుబును చాల సులభంగ గ్రహించును. వాతావరణం మార్పువల్ల ఈ వ్యాధి సోకి చాల కాలంగ వుండునపుడు నయం చేయును.

**ఒసిమం శాంక్టం** : జలుబు, పడిశం, తరుచుగ తుమ్ములు, తెల్లగగాని పచ్చగగాని ద్రవం

ఉండును. ముక్కులనుంచి నీరుకారును. ముక్కురంధ్రాలలో పుండ్లు, ముక్కుల నుంచి స్రావం విసర్జించును. ఇన్ఫ్లూయంజా ముక్కులనుంచి కలుగు సాధారణ జలుబులను నయం చేయగల మందు.

## దగ్గు (COUGH)

**అబ్రోమ ఆగస్టా:** సాయంత్రం రాత్రిపూట దగ్గు బాధ వుండును. చీములాగ కళ్ళితో పాటు, దగ్గువచ్చుట, ఛాతీలో నొప్పి, చల్లని గాలిలో దగ్గుటవలన తీవ్రమానసికోద్రేకం నొందును. శ్వాసనాళంలో అమత్వక్కు వాపు. చిన్న శ్వాసనాళంలో ప్రథమంగ వాచి తదుపరి ఊపిరితిత్తులకు కలుగు (వాపు) న్యూమోనియాతో కళ్ళి కూడియుండును.

**ఎకలిఫ ఇండిక:** వాసనతో కూడిన కళ్లి వచ్చునపుడు ఎక్కువగ వాడవచ్చును. ముఖ్యంగ పిల్లలలో వచ్చు శ్వాసకోశవ్యాధులు ప్రారంభదశలో ఊపిరితిత్తులకు కలుగు క్షయ, పొడిగ దళసరిగ తీవ్రదగ్గు కళ్లి రక్తంతో వుండును. ఉదయం ప్రకాశవంతమైన శుద్ధరక్తం కళ్ళితోపాటు పడుట, సాయంత్రం నల్లనిరక్తపుగడ్డలు కళ్ళితోపాటు పడును. రాత్రిపూట దగ్గుబాధ అతిగ నుండును. ఛాతీలో నొప్పి కడుపు అన్ననాళంలో మంటగానుండును.

**అపాయి:** దగ్గునపుడు గొంతులో మంట, గొంతులో శ్లేష్మం నిండియుండును. దగ్గుతూ వుండునపుడు వికారం, వాంతులు వచ్చుట, దగ్గు ప్రారంభంలో పొడిగనుంటూ తరువాత తేమగా నుండును. కళ్ళి జిగటగ పచ్చగ వుండును.

**అజాడిరక్టా ఇండిక:** స్నానం చేసిన మధ్యాహ్నం 1 గంట తరువాత దగ్గు చాల బాధగ వుండును. కళ్లి తెల్లగ చిన్నచిన్న ముద్దలులాగ ఉంటూ బయటకు వచ్చేందుకు అతికష్టంగా వుండును. స్వల్పంగ గొంతు బొంగురుపోయినట్లుండును. కళ్ళి నుసిరంగుగ ఉండును. కళ్ళి జిగటగ వుండును. ఛాతీలో కుట్టినట్లుండును. ముఖ్యంగ కుడిభాగంలో ఉండును.

**జస్టిషియా అడాటొడ:** జలుబుతో జ్వరం, శ్వాసనాళంలో అమత్వక్కు వాపు, తరుణ వ్యాధిలో కళ్ళి జిగటగ పట్టుకున్నట్లుండును. దీర్ఘకాలికంగ వుండు వ్యాధిలో కళ్ళిని కరిగించి సులభంగ బయటకు వచ్చునట్లు చేసి ఉపశాంతిని కలిగించును. పొడిదగ్గు రొమ్మెముకలనుంచి వచ్చును. దగ్గుతో ఛాతీ బిగుసుగనుంటూ ఒకవైపునుంచి మరొకవైపు పోవునట్లుండును. రోగి వెచ్చని గదిలో సహించలేడు. కళ్ళి పచ్చగ రక్తంతో కలిసివచ్చును. రాత్రిపూట బాధలధికంగ వుండును.

**బ్లూమియా ఒడొరాటా:** దగ్గును అదుపులో వుంచేందుకు మంచిమందు. దగ్గునపుడు గొంతులో పెద్ద శబ్దం వచ్చును. స్వరం బొంగురుపోయినట్లుండును. దగ్గునపుడు ఊపిరి తిత్తులలో మొరుగునట్లు శబ్దం వచ్చును.

**మకరధ్వజ:** పిల్లలకు వచ్చు పొడిదగ్గు, రాత్రిపూట ఈడ్పులుగల దగ్గు, అధికంగ బాధ వుండును. ఆయాసం మాదిరిగ శ్వాస పీల్చుట కష్టంగ ఉండును. జస్టిషియా అడాటొడ మందులాగ పనిచేయును.

**ఒసిమం శాంక్టం:** దగ్గుతూ తుమ్ముతూ ఉండునపుడు బాధలధికంగ వుండును. ఛాతీ రెండువైపుల నొప్పి, రోగి పడకపై పరుండలేకపోవుట, ఊపిరితిత్తులను చుట్టియుండెడి పూరాయనెడి పొరల్లవాపువలన ఛాతీలో నొప్పివుండును.

## తలపై కేశములున్న భాగానికి కలుగుచుండ్రు (దీandruff; scurf)

**నిక్టాంతెస్ అర్బోర్ ట్రిస్టిస్:** పీటి విత్తనాలను పొడిచేసి మామూలుగ వాడుతూ వచ్చిన తలపై ఉండు చుండ్రును పోగొట్టును.

## మధుమూత్రం: అతిమూత్రం (DIABETES MELLITU, INSIPIDUS)

మధుమూత్రం మూత్రంలో చక్కెర అధికంగా ఉండి మూత్రం సాంద్రత అధికంగా

నుండును. శరీరంలో ఇన్సులిన్ తక్కువగుటచే ఈ వ్యాధి కలుగును. ఈ కారణంగా రక్తంలో చక్కెర అధికమగును. చక్కెర అధికంగా కరుగుటకు కావలసినంత నీరు తీసుకొన్న మూత్రపిండాల ద్వారా మూత్రంగా విసర్జించును. దాహమధికంగా ఉండును. చివరకు మగత కలిగి మృతిచెందును. (Diabetes Mellities)

అతిమూత్రం మూత్రంలో చెక్కరలేనట్టి అతిగా మూత్ర విసర్జన, మూత్రం నీటివలెనుండి సాంద్రత తక్కువగా నుండి, దాహమధికంగా ఉండును. పిట్యూటరీ గ్రంధి దోషించే ఈ వ్యాధి సంభవిస్తున్నది. (Diabetes Insipidus)

**అబ్రొమ అగస్ట:** పగలు రాత్రి విస్తారంగా మూత్రం విసర్జించుట, మూత్ర విసర్జన నాళద్వారంలో దురద మంట ఉండును. అతిమూత్రం రంగుతో ఉండును. విచిత్రముగా చేపవాసనతో స్వల్పంగా మడ్డిలాగా బురదలాగా ఉండును. రాత్రి నిద్రలో తెలియకుండా మూత్రం పోవుట, మధ్యాహ్నం తరచుగా వచ్చును. చక్కెర సాంద్రత అధికంగా ఉంటూ రాత్రిపూట మూత్రం విస్తారంగా వచ్చును. అతిగా దాహం ఉండుట, నిద్రలేమి అలసటచెందుట, శారీరకంగా, మానసికంగా పనిచేయుటకు యిష్టం లేకుండుట. ఈ మందుకు యురానినంనైట్, ఫాస్ఫారిక్ యాసిడ్, సజిజియం మొదలగు మందులు పోల్చుకొనవచ్చును. తెలియకుండగనే నిరంతరం ఎడతెగకుండు మూత్ర విసర్జనకు గొప్పగా పనిచేయును. నోరు పొడిగా ఉండును. తరచుగా దాహం, చల్లని నీరు త్రాగును. భోజనం చేసిన వెంటనే ఆకలి కలుగును.

**సెఫలాండ్ర ఇండిక :** ఒకేసారి అధిక పరిమాణం గల మూత్రం విసర్జించుట, మూత్రం స్పష్టంగాపోవుట, మూత్ర విసర్జనానంతరం బలహీనత, నిస్త్రాణంగా ఉండును. మూత్రంలో చక్కెర అగుపడును. శరీరమంతయు మంటగల స్వభావం ఉండును. పై పూతగా అంటించిన చల్లనగును. ఈ మందు చాలా కేసులలో సమూలంగా నివారించడమైనది.

**జిమ్నెమసైల్వెస్టరు:** మూత్రంలో చక్కెర ఉండును. మధుమూత్ర రోగాన్ని సమూలంగా నివారించును. జననేంద్రియ పటుత్వం తగ్గుట, మూత్రం చక్కెరతో నిండియుండును. మూత్రం అధిక పరిమాణంలో విసర్జించుట వలన నీరసం కలుగును. మూత్రం విస్తారంగా విసర్జించుట, మూత్రం తెల్లగా ఉండును. శరీరమంతా మంట, సెగ్గెడ్డలు, రాచపుండ్లు ఉండును. నీటిని తరచుగా విస్తారంగా త్రాగును. నీరసం క్రమేపి అధికమగును. సంభోగం వలన మూత్ర పరిమాణం హెచ్చి మూత్రమందలి చక్కెర హెచ్చును. జననేంద్రియ శక్తి పూర్తిగా నసించును. రాత్రిపగలు తరచుగా మూత్రం విస్తారంగా వచ్చును.

**సిజిజియం జాంబోలనం :** మూత్రంలో చక్కెర తగ్గించటంలో గొప్ప మందు. దీని విత్తనాలు చూర్ణం చేసి పూటకు 10 గ్రాములు చొప్పున రోజుకు మూడుసార్లు వాడాలి. ఇలాగే టించరును కూడా వాడవచ్చును. ఎండిన పండ్లను విత్తనాలతో సహా తినిన వ్యాధి సమూలంగా నివారించునని డాక్టర్ బోరిక్ చెప్పారు. వీటిగుండా మూత్రంలో చక్కెర విశిష్టగురుత్వం తగ్గిపోవును.

## విరేచనాలు: అతిసారం (DIARRHOEA)

**ఈగిల్ మార్మెలోస్:** దీర్ఘకాలికంగా ఉండు అతిసార గ్రహిణి నివారించుటలో అమూల్యమైన మందు. దీర్ఘవ్యాధులలో తప్పనిసరిగా నిర్మూలించు మందు. కడుపుకు ప్రేగులకు సంబంధించిన వ్యాధులు, జీర్ణకోశానికి సంబంధించిన లక్షణాలు, వాయువుతో కడుపుబ్బరం కలిగి శూలతో బాధపడుచుండును.

**అపాయి:** విరేచనాలు, మలబద్ధకం ఒకటి తరువాత ఒకటి వచ్చును. పచ్చగ, తెల్లగా, మడ్డిలాగా మురికితో కూడిన విరేచనాలు అజీర్ణం వలన అమత్వక్కు గల భాగం నుంచి తెల్లని ద్రవం రక్తంతో విరేచనాలు కలుగుట, శుద్ధమైన రక్తం, నల్లని రక్తం కలుగును. రోగి అమితంగా నీరసించినట్లుండును. మూత్రం ఆణగారుట, కొంచెం నీరులాగ విరేచనాలు కలుగుట, కొంచెం

కొంచెం మూత్రం, మూత్రంలో రక్తం విసర్జించును.

**సైనోడాన్ డక్టలాన్ :** దీర్ఘకాల విరేచనాలు, గ్రహిణి, వంటికి నీరుపట్టుట నివారించును.

**ఒసిమం శాంక్టం:** పసుపుపచ్చరంగు, ఆకుపచ్చరంగు లాగా నీళ్ళులాగా విరేచనాలు, తచుగా విరేచనాలు కలుగునప్పటికీ విస్తారంగా కలుగును. బంకగాగాని రక్తంతో గాని విరేచనాలు కలుగుట, అతిగా జ్వరం ఉండునపుడు తెలియకుండానే విరేచనాలు కలుగుట, ఉదరకుహరంలో ఉబ్బుతగ్గకుండా ఉండును.

**ట్రికోసాంతెస్ డియోయిక:** విరేచనాలు, కలరా వంటి విరేచనాలు, కలరా గ్రహణులందు అద్భుతంగా పనిచేయును. విరేచనాలు పల్చగా విస్తారంగా నుండి పచ్చగా ఆకుపచ్చగా వచ్చును. సైత్యరసం అమముతో రక్త విరేచనాలు, విరేచనాలు నురుగుగా నుండి వెడలునపుడు నొప్పిగా, బాధగా ఉండును. విరేచనాలు, రక్తవిరేచనాలు అప్రయత్నంగా కలుగును. విరేచనాలు శబ్దంతో కలుగును. విరేచనానంతరం చాలా సేపటివరకు విరేచనానుమానం కడుపునొప్పి పోదు. విరేచనానంతరం చురుకు బాధ ఉండును. దాహం మంట చెమటలు అమితనీరసం, కాళ్ళు చేతులు చాలా చల్లగా ఉండును.

**వెర్మినాలియా చెబూల:** విరేచనాలలో మలం పల్చగా నుండి కొలదిగనగుచుండును. జిగటగా ఉండును. కడుపులో మంట, ఉదరం ఉబ్బినట్లుండును. మలం చాలా తక్కువగా వెడలును లేక వెడలదు. మల విసర్జనకు చాలా ప్రయత్నం చేయవలయును. మలం విసర్జించునపుడు చెమటలు పట్టును. పురీశనాళంలో నిండుగనున్నట్లు దురదగనుండును. మలబద్ధకం, మలం గట్టిగను, కొంచెం కొంచెం అగును. ఈ వ్యాధికి కారికపాపయ్య, పికస్ రిలిజియోస, పికస్ ఇండిక టాయిఫోపెబ్రిన్, మందులు మేలు చేయును.

## ఉబ్బురోగము; నీరుపట్టుట (DROPSY)

**ఎక్రైరాన్తెస్ ఎస్పరలిన్ :** శరీరానికి నీరుపట్టుట, ధాతువులలో ద్రవం కూడుట, చర్మం కండరాల మధ్య నీరుపట్టుట, జలోదరం ఉదరకుహరానికి నీరుపట్టుట, గుండె, మూత్రపిండాలు, కాలేయవ్యాధులలో సాధరణంగా ఇది కూడియుండును. ఉబ్బులుండునపుడు ఈ మందును అధికంగా వాడవచ్చును. గొప్పగా పనిచేయు మందు. ఈ మూలికను నీటిలో ఉడికించి కశాయం మాదిరి తయారు చేసి రోజుకు మూడుసారులు లోపలికి యిచ్చిన అద్భుతంగా పనిచేయును.

## గ్రహిణి; రక్తవిరేచనాలు; చీములేక జిగట విరేచనాలు (DYSENTERY)

**ఎగిల్‌పోలియా:** రక్తవిరేచనాలకు అమూల్యమైన ఔషధం. జ్వరముండదు. కొద్దికొద్దిగా మల విసర్జన జరుగుట, తరుణ, దీర్ఘకాలంగా ఉండునపుడు పనిచేయును. మెల్లమెల్లగా తగ్గిపోతూ ఉండును. శ్లేష్మం లేక అమ్లం ఎక్కువగాని, తక్కువగాని ఉండును. దీర్ఘకాలికంగా ఉండు గ్రహిణిలో మలబద్ధకం విరేచనాలు ఒకటి తరువాత ఒకటి కలుగుతూ ఉండును.

**అపాయి:** అజీర్ణం, మలబద్ధం, విరేచనాలు ఒకటి తరువాత ఒకటి కలుగును. మలంలో తెల్లని చీము పడుట, మలంలో రక్తం చీము కలిసి కరుగుట, నల్లని రక్తం లాగా కొంచెం గాని అధికంగా గాని ప్రమాదస్థాయిలో కలుగుట, తెల్లగాగాని, రక్తంలో శ్లేష్మం కలిసి గాని విసర్జించుట, శూల నొప్పితో రక్తంకారుట, బొడ్డు, నాభిచుట్టూ నొప్పి ఉండుట, ఇది సాధారణంగా వస్తున్నపుడు "అటిస్టా ఇండికా" మందు నొప్పితో గ్రహిణి కలుగుతూ ఉండునపుడు కాని, మల విసర్జన తదనంతరం కలుగు నొప్పి, మంటకు మేలు చేయును. ఏరకమైన గ్రహిణి "బాక్టీరియా" అను కంటికగుపడని సూక్ష్మజీవులకు సంబంధించిన విరేచనాలను అదుపులో ఉంచును.

**పిఫలాంద్ర ఇండిక:** మలంలో అమ్లము కలిసి ఉండుట, పచ్చగాగాని రక్తంతో గాని మలవిసర్జన కలుగును. మల విసర్జన సమయంలోగాని తరువాత గాని నొప్పిగా ఉండును.

పికస్ రిలిజోసః గ్రహిణి, మూలశంక రక్తంతో కలిసి ఉండునపుడు మేలు చేయును.

పికస్ ఇండికః పికస్ రిలిజోస మందుకంటే ఇది చాలా గొప్పగా పనిచేయును. చీము, రక్త విరేచనాలకు గొప్ప మందు.

**ట్రిఫుటియా టింక్టోరియా:** అన్ని రకాల గ్రహిణికిని దీర్ఘకాలికంగా ఉండు వాటికి ముఖ్యౌషధం. తరుణ, దీర్ఘవ్యాధికి పనిచేయు మందు. క్లిష్టపరిస్థితులలో జ్వరంతో ఉన్నను, క్లిష్టపరిస్థితిలో లేనప్పటికి దీర్ఘకాలికంగా ఉండు గ్రహిణి వలన బలహీనంగా ఉండునపుడు, చిక్కిపోతూ ఉండునపుడు, ఆకలి లేకపోవుట, ఆహారంపై అయిష్టత, మల విసర్జన సమయంలో గుదం చుట్టూ పుండులాగ నొప్పిగా ఉండునపుడును, బొడ్డుచుట్టూ పోటులాగ శూలనొప్పి, విస్తారంగ రక్తవిరేచనాలు కలుగుట, కుడి భాగం పరుండిన నొప్పి ఉధృతంగ ఉండుట, ఎడమభాగం పరుండిన నొప్పి తగ్గినట్లుండును. మలం వస్తూ ఉన్నట్లుండును.

**ఎటిస్టారాడిక్స్:** ఎటిస్టా ఇండికా కంటె చాల ఉపయోగపడు మందు.

హైడ్రాకోటైల్ ఎసియాటిక : చీము రక్త విరేచనాలలో ఇది గొప్పగ అద్భుతంగ పనిచేయగల మందు.

**సిజిజియం జాంబోలినం:** ఈ చెట్టు ఆకులనుంచి రసం తీసి ఉపయోగించిన విజయవంతంగ పనిచేయును. ఈ నేరేడు చెట్టు పట్టనుంచి తీసిన రసంగాని ఆకులనుంచి తీసిన రసంగాని మేకపాలలో కలిపి సాధారణంగా వాడుట కలదని అన్ని రకాల గ్రహిణి రక్తంతో కలసిగాని కలుగు విరేచనాలకు మేలుచేయునని "కవిరాజన్" ఉపయోగించినట్లు తెలిపారు.

## ఋతుశూల (DYSMENORRHOEA)

**అబ్రోమ అగస్టా:** ఋతుశూలను నివారించుటలో అపజయమంటూ లేకుండా నివారించగల మందు. ఋతుస్రావం ముందుగాగాని దీర్ఘకాలికంగాగాని ఉండుట, ఉదరం క్రింది భాగంలో ఋతుస్రావం ఉండునపుడుగాని, ఋతుస్రావం కలుగుటకు ఒకటిరెండు రోజులు ముందుగగాని, నొప్పి ఉండును. మైల నల్లగ గడ్డలులాగ కలుగుట, ఋతుస్రావానికి సంబంధించిన యితర వ్యాధులుగాని హిస్టీయాకు సంబంధించిన వ్యాధిగాని, తల తిరుగుట ఉండును. కాల నియమం లేకుండా ఋతుస్రావం కలుగుట, అకాల ఋతుస్రావం చాల తక్కువగ అగుట, లేక చాలకాలం ఉండుట, వికారం, వాంతులు కలుగుట, ఉదరానికి క్రింది భాగంలో రెండు వైపుల నొప్పి ఉండును.

**అబ్రోమ రాడిక్స్ :** కాల్మ నియమం లేకుండా కలుగు ఋతుస్రావంవలన కలత చెందుట, ఋతుశూల, ఉదరం క్రింది భాగంలో తీవ్రనొప్పితో బాధపడుట, ఋతుస్రావం కలుగునపుడుగాని ముందుగగాని శూల, పోటు, బాధ ఉండును. మైల కొంచెంగాని, విస్తారంగాగాని నల్లగ గడ్డలు గడ్డలులాగ కలుగును.

**జనోసియా అశోక :** మైల కొంచెం కొంచెం కలుగుటవలన అమితంగ తలనొప్పి, ఉదరం క్రింది భాగం అంతా తీవ్రనొప్పి ఉండును. వీపులోను, తొడలలోను నొప్పి ఋతుశూల మైల ఆలస్యంగ కలుగుట, కాలనియమం లేకుండ ఋతుస్రావం కొంచెం కొంచెంగాని నీళ్లలాగగాని కారుట, చెడిపోయిన రంగు నల్లగ స్వల్పంగ పూతలాగ తడి ఉండును. నొప్పి ఉండును.

## అజీర్ణం : అరోచకం (DYSPEPSIA)

**ఎగిల్ పోలియా:** అజీర్ణంచే నోటిలో నీరు అమితంగ ఊరుచుండుట, జీర్ణకోశంనుంచి నీటివంటి పుల్లని ద్రవం నోటిలోనికి వస్తూ ఉండును. వికారం ఉండును. కాలనియమంలేని కడుపుకు సంబంధించిన వ్యాధులు కలుగుట, ఉదరం ఉబ్బి ఉండుట, జీర్ణకోశంలోగాని, ప్రేగులలోగాని అపానవాయువు చేరి నోటినుంచి తేన్పులుగాని గుదంనుంచి అపానవాయువు పెద్ద శబ్దంతో బయటకువచ్చుట, మధ్యాహ్నం బాధ అధికంగ ఉండును. ఉదరం క్రింది భాగంలో గాలి కూడుకొని

ఉండుట, కడుపుకు, ప్రేగులకు సంబంధించిన అమత్వక్కు వాపు ఉండుట, జీర్ణకోశం ప్రేగులు ఉబ్బరించి రోగి నొప్పితో బాధపడునపుడు మేలు చేయును.

**అండ్రో గ్రాపిస్ :** అప్పుడప్పుడు కలుగు తేన్పులు, ఉదరం భారంగ ఉండుట, ఆకలి లేకపోవుట, వత్తిడి చేసినప్పటికిని విరోచనాలు కలుగుటలో వ్యర్థంగ ఉండుట, ఉదరం మంట ఉష్ణం కలిగి ఉండును. కాలేయం పెద్దగా ఉండును. నీళ్లవిరేచనాలు, పైత్యరసంతో కూడిన విరేచనాలు, పిల్లలకు కలుగు విరేచనాలు, జీర్ణకోశపు వ్యాధులు నివారించుటకు ముఖ్యౌషధం.

**అపాయి :** తేన్పులు, వాయువు, ఉదరం పైభాగంలో భోజనం చేసిన తదనంతరం భారంగ ఉండును. చల్లని నీటిని అతిగ కోరుట, మాంసాహారంపై అయిష్టత, ఆయాసం వలన ఛాతీలో భారంగ ఉండును.

**అటిస్టా ఇండిక :** జీర్ణకోశంలో నొప్పి అజీర్ణం, జీర్ణకోశం ప్రేగులు ఉబ్బరించుట, ఉదరం ఉబ్బినట్లుండుట, పుల్లని వాంతులు, పుల్లగ తేన్పులు ఏదైన తినిన వెంటనే వాంతియగుట.

**అజాడిరక్టా ఇండిక:** ఉదరం ఉబ్బరించి ప్రేగులలో వాయు పూరితమగు గుడగుడ శబ్దం ఉండును. ఉదరం కొద్దిగ ఉబ్బి గుదం నుంచి దుర్వాసనతో అపానవాయువు వెడలును. నోరు జిగటగ, చేదుగ ఉండుట, నోటిలో కృళ్ళిన రుచి ఉండును. గుండెలో మంట, ఛాతీలో ఆయాసం ఉండునట్లు భావించును. కడుపులోను, ముఖం, చేతులు, అరికాలు (పాదపు అడుగుభాగం) మధ్యాహ్న సమయంలో మండినట్లుండును. ప్రేగులు సరిగ పనిచేయకపోవుట వలన మలబద్దకం ఉండును. మలం గట్టిగ సాధారణంగ ఉంటూ విరేచనాలు కలుగును.

**కారికపాపయా:** జీర్ణశక్తి బలహీనంగ ఉండు రోగులకు పనిచేయును. మాంసాహారాలు పాలు వంటపట్టని రోగులకు మేలు చేయును. అజీర్ణవ్యాధివలన కొంచెం కొంచెం విరేచనాలు తరచుగ అగుచుండును. కాలేయానికి సంబంధించిన భాగంలో నొప్పి ఇతర బాధలుండును. కొద్దిపాటి పాలు తీసుకొన్నప్పటికి కాలేయం ప్లీహంలో నొప్పి కలుగును.

**హైడ్రాకోటైల్ ఏసియాటిక :** ఆహారంపై అయిష్టత, తరచుగ తేన్పులు వచ్చుట, ఆమ్లం వికారం కడుపు ఉబ్బినట్లుండుట, వాయువు బంతిలాగ ఉండునట్లు భావించుట, కడుపు భాగంలో ఉష్ణం, ఆతృత ఉండుట అపానవాయువు వెడలుట, ప్రేగులు ముడుచుకొనిపోవునట్లుండుట, ఉదరకుహరంలో ఊర్ధ్వ భాగంలో అడ్డంగ ఉన్న ప్రేగువలన ప్రతి ఐదు నిముషాలకు ఒకసారి నొప్పి వచ్చును. కాలేయం పైభాగంలో నొప్పి ఉండును.

**జనోస అశోక :** ఆకలి ఉండును కాని ఆహారం తీసుకొనుటకు యిష్టం ఉండదు. ఆమ్లం పుల్లని వస్తువులపై కోరిక, అమితంగ నీరు త్రాగుట, అతిగ వికారం, పైత్యరసం వాంతియగుట, కడుపుమీదగల ఉదర కుహరమండలంలో నొప్పి, ఆహారంపై కోరిక లేకపోవును. ఉదరం ఉబ్బుట, గట్టిగ ఉండుట, నొప్పి లేక వత్తిడి ఉండుట, అపరిశుభ్రమైన వాసనతో గాలివచ్చుట, తేన్పులు కడుపు ఉబ్బరం నొప్పి, సాయంత్రం బాధలధికమగుట, మలబద్దకం, మలవిసర్జన ముందు నొప్పి ఉండును. మల విసర్జన జిగటగ ఉండును. వీపులో నొప్పి, మూలశంక, రక్తస్రావం ఉండునపుడుగాని లేకపోయినపుడుగాని పనిచేయును. మొలలు బయటకు త్రోసుకొనువచ్చుట, నలుపునట్లుగాని మంటతోగాని నొప్పిఉండును.

**టెర్మినాలియాచెబూల :** నోటిలో దుర్గంధంతో కూడిన వాసన, ఉదయం పూట దుర్గం ధంతో తేన్పులు, ఎడతెగకుండ ఆమ్లం ఉండుట, ఖాళీగానుండు తేన్పులు వచ్చుట, కడుపు భర్తీగాను, ఉబ్బినట్లు భావించుట, కడుపు క్రింది భాగంలో నొప్పి, కడుపులో గుడగుడ శబ్దం ఉండును. ఉదరం క్రింది భాగంలో కుడిప్రక్కలో నొప్పి ఉండును.

**విథానియా సోమ్నిఫేరా :** కడుపులో వాయువు అధిక్యంగ వత్తిడి వలన గుండె ప్రాంతంలో నొప్పి ఉండును. గోరువెచ్చని నీటిలో అశ్వగంధ చూర్ణంను తీసుకొన్న ఎడల ఉపశాంతి కలుగును.

## చెవులు (EARS)

**అజాడిరక్టా ఇండిక :** చెవులలో తేనెటీగల వలె 'హిస్' లేక 'హుం' అను శబ్దం చేయుచుండుట, ఒక విచిత్రమైన కీళ్లలో కలుగు శబ్దంలాగ వుంటూ, పక్షి ఈక చెవులో ఉంచిన చక్కిలి గింతలు పెట్టినట్లుండుట. అది నోరు తెరచిన అధికమగును.

**ఒసిమం శాంక్టం:** చాల నొప్పి భయంకరమగు శబ్దం వినపడును. చెవులోనుంచి నీరులాగ ద్రవం కారుట, చెవులనుంచి దుర్వాసనగల చీము కారుట, వినికిడి తగ్గుట, ముఖం ఎర్రనై చెవులనుంచి వేడి బయటకు వచ్చినట్లుండును. ముక్కుకు సంబంధించిన అమత్యక్కు వాపువల్ల చెవులలో నొప్పివుండును.

**హైడ్రోకొటైల్ ఎసియాటిక:** వెలుపలి చెవి నుంచి కర్ణభేరి వరకు గల రంధ్రంలోపల ఎడమ భాగంలో నొప్పి, కుడిచెవిలో ధనారింపుగ కొట్టుకొనుట, ఎడమ చెవిలో ఎడతెగని శబ్దం నిలిచి నిలిచి ఉండుట, ఎడమచెవిలో ఒకదానికి మరియొక శబ్దం వినపడునట్లుండును.

## ఏనుగుకాలు: బోద : శ్లీపదము (ELEPHANTIASIS)

**కలొట్రోపిస్ జిగాంటియ:** ఈ చెట్టువేరు పట్టను, గుజ్జు మాదిరి తయారుచేసి ఏనుగుకాలు గల రోగులకు పై పూతగ అంటించిన మేలు చేయును. దీనినే జలాంద్రము బుడ్డలకు ఉపయోగించిన మేలు చేయును. ఈ మందును హోమియోపతి సిద్ధాంతం మేరకు తయారు చేసి లోపలికి వాడిన మేలు చేయును.

## ముక్కునుంచి రక్తం కారుట (EPISTAXIS)

**పికస్ రెలిజియోస:** ప్రేగులు ఊపిరితిత్తులు గర్భకోశం మూత్రకోశం నుంచి రక్తస్రావాలు కలుగువాటికి గొప్ప విలువైన మందు. రక్తస్రావాలకు అద్భుతమైన గుణం యిచ్చు మందు. ఈ మందు రక్తస్రావాలను వేగంగ శాశ్వతంగ నిలిపి నివారించును.

## కాళ్లు చేతులు, చివరి భాగాలు (EXTREMITIES)

**అజాడిరక్టా ఇండిక:** చేతులు మాత్రం తిమ్మిరులుగ ఉండును. ముఖ్యంగ కుడిచేయి తిమ్మిరెక్కి ఉండును. కాళ్లు వాత నొప్పులు కలిగి ఉండును.

**కలొట్రోపిస్ జిగాంటియ:** చేయి కుడిచేయి అరచేతిలో మధ్యభాగం ముడుచుకొని పోయినట్లు నొప్పి ఉండుట, ఏది కూడా గట్టిగ పట్టుకొనలేకపోవుట, కదలించునపుడు మణికట్టులో నొప్పి ఉండును. కాళ్లు కదలునపుడు కుడికాలి తొడలలో స్వల్పంగ నొప్పి, తొడ వెనుక భాగంలో పుండులాగ బాధ ఉండును. గట్టిగ వుండుట, వెనుకకు తిరుగునపుడు బాధ, విసుగుచెందినట్లుండుట, తొడ పుండులాగ నొప్పి ఉండుట, వాపు వచ్చి నొప్పిగ వుండుట, ప్రతి అడుగుకు నొప్పి వుండును.

**హైడ్రోకొటైల్ ఎసియాటిక:** ఎడమ భాగంలో వచ్చు పాత కీళ్ల వాత నొప్పులకు, నడుము, వీపులో, ప్రక్కటెముకలకు కటిప్రదేశం మధ్యభాగంలో ఉండు కుముకుదెబ్బల నొప్పి, కాళ్లు ముంజేయి ముడుచుకొని పోయినట్లుండుట. భుజాలకు సంబంధించిన అన్ని కండరాలు అలసట చెందినట్లుండును. ముడుచుకొని పోవునట్లుండుట, కుడి భాగం ముంజేయి, చేతులు, వ్రేళ్లు తిమ్మిరిగ ఉండుట, వ్రేళ్ళ కీళ్లలో నొప్పి, తుంటిలో చురుకైన నొప్పి తొడలకు సంబంధించిన కండరాలు అలసట చెందినట్లుండుట.

**టెర్మినాలియా చెబూల:** భుజాలకు సంబంధించిన భాగంలో కుడిచేయి పైభాగం కండరాలు నొప్పిగ ఉండును.

## కన్ను (EYE)

**కలొట్రోపిస్ జిగాంటియ:** కంటిలో ఇసుకలాగ బాధలుండును. కలొట్రోపిస్ జిగాంటియ

చెట్టు ఆకులుతిని గ్రుడ్డివాడైనట్లు ఒక ఋషి మహాభారతంలో వర్ణించాడని చెప్పడం జరిగింది. దీనినే (పొటెన్సీ) శక్తిగ తయారు చేసి వాడిన గుడ్డితనం పోగొట్టి చూపు ప్రసాదించునని వివరించారు.

**జనోషియా అశోక:** హ్రస్వదృష్టి పుస్తకం కంటికి దగ్గర పెట్టుకొననిదే చదువలేడు. వెలుతురునుంచి కన్నులు గొప్పగ సూక్ష్మగ్రహణశక్తిగ్రహించుట, కన్నులు అలసట చెందినట్లుండుట, మానసికంగ అలసటచెందినట్లుండుట, అటువంటపుడు చదువుతూ ఉన్నను రెప్పలార్పకుండ చూస్తూ ఉండడం తగదు.

**ఒసిమం శాంక్టం:** కన్నులు ఎర్రగ, నొప్పిగ, కంటినుంచి నీరుకారుట, ముక్కులలోని అమత్వక్కు వాపువల్ల కంటి వ్యాధులు వచ్చుట, కండ్లకలకకు చాల మంచి మందు.

విథానియ సోమ్నిపెర: చూపు వృద్ధిచెందుటకు అశ్వగంధ, యష్టిమధు చూర్ణాలను అమ్లీకి రసంలో మిశ్రణం చేసి వాడాలి.

## జ్వరము (FEVER) ఎగిల్ పోలియా

విడవకుండ ఎడతెగని జ్వరం ముఖం కనురెప్పలు, కన్నులు ఉబ్బి ఉండుట. ఇన్‌ఫ్లూయంజా జ్వరానికి ఉపయోగపడును. ప్రారంభంలో వాపు జ్వరం విరేచనాలతో ఉన్నపుడు మంచి ఫలితం యివ్వగలదు. కాలేయం ప్లీహమునకు సంబంధించిన వ్యాధులు, దీర్ఘకాలికంగ ఉండునపుడు మేలు చేయును. కాళ్లు పాదాలు వాపుతో ఉండునపుడు పనిచేయును.

**ఆండ్రొగ్రాఫిస్ :** రెండురకాల జ్వరాలకు మంచి మందు. స్వల్పంగ చలి అన్ని విధాల ఉష్ణం ఉండును. శరీరమంత మంటగ ఉన్నట్లుండును. తలనొప్పి దాహం ఉండును. చల్లని గాలివలన చల్లని నీరు తగిలిన మంట తగ్గును. విడుపుజ్వరం ఉదయం 11 గంటల తరువాత మరల సాయంత్రం 7 లేక 8 గంటల సమయంలో కనపడును. నోటిలో రుచి లేకపోవుట, పిల్లలలో కాలేయం పెద్దదగుట వలన కలత చెందినట్లుండుట, మెల్లగ జ్వరం వచ్చినట్లుండును.

**ఎటస్టా ఇండిక:** మలేరియా జ్వరం కానప్పటికి దినం విడిచి దినం జ్వరం రావటం లేదా ప్రతి మూడురోజాలకు ఒకసారి జ్వరం రావడం, నిలిచి నిలిచి వచ్చు జ్వరానికి అద్భుతమైన మందు. ఈ జ్వరం సాధారణంగ ఉదయం 5 నుంచి 10 గంటల సమయంలో దాహం లేకుండ చలితో వచ్చును. వర్షాకాలంలో వచ్చు జ్వరాలకు మంచి మందు.

**అజాడిరక్టా ఇండిక:** చాల స్వల్పంగ చలితోగాని చలిలేకుండాగాని వచ్చు జ్వరం సాయంత్రం 4-30 గంటలు నుండి 7-30 గంటల కాలంలో తగ్గుచుండును. ఉష్ణం మండుతూ ఉన్నట్లు మంటగ ఉండును. ముఖ్యంగ ముఖం కన్నులు అరికాళ్లు, అరిచేతులు మండుతూ ఉన్నట్లుండును. నొసటపైన, మెడపైన, శరీరం పైభాగంలో విస్తారంగ చెమటలు పట్టినట్లుండును. దాహం లేకుండుమ.

**పిపాల్ పెనియా బాండుపెల్లా:** కాల నియమం లేకుండ జ్వరం ఆగుపుడుతూ ఉండును. ఏ సమయంలోనైన జ్వరం రావచ్చును. జ్వరం చలితోను, వణుకుతోను ఉండును. శరీరోష్ణం బట్టి దాహం ఉండును. ఆరు గంటలకంటె ఎక్కువ జ్వరం ఉండదు. ఈ జ్వరం రాత్రి 8 గంటల నుంచి 10 గంటల మధ్యలోను సాయంత్రం 2 గంటల నుంచి 4 గంటల మధ్యలోను వచ్చును.

**డైస్కోడియం గంజాటియం:** విడుపుజ్వరాలు, లేక నియమిత కాలవ్యవధులలో జ్వరం హెచ్చుచు తగ్గుచుండును. నిద్రమత్తుగ ఉండుట, శరీరమంతా నొప్పులుండును. జ్వరం ఉదయం 7 గంటలకు స్వల్పంగ చలితోవచ్చును. శాశ్వతంగ రెండు మూడు గంటలు రోజు జ్వరం మరల వస్తూ వుండును.

**ఈ వ్యాధికి అపాయి క్వినియా ఇండికా;** కెలో ట్రోపిస్ జాయిగెసియా; కారికవాపయ; క్లెరోడెండ్రన్ ఇన్‌ఫార్చునేట; హైగ్రోఫిల్ స్పాయినోస; కాల్‌మేఘ్; లూఫావిండల్; ఫ్లాకస్ ఎస్పెర; నిక్టెంతిస; నవేత్రంమూర్‌బిట; రోహితక్; టాయిన స్పోరకార్డిపోలియా మందులు కూడ పనిచేయును.

## సన్నిపాత జ్వరం (TYPHOID)

**హైగ్రోఫిలా స్పినోస:** ఉదయంపూట జ్వరం కనపడును. దురద, దద్దురులు, ఉష్ణం, ప్రకోపించినపుడు ఉండును. చల్లని నీరు తగిలిన దురద తగ్గును.

**డెస్మోడియం గంజాటికం :** మెదడు, వెన్నుపాములను చుట్టి ఉండు పొరలవాపు, జ్వరం, వణుకుతో మెడ వెనుక కండరాలు బిర్రబిగిసినట్లుండును. సన్నిపాత జ్వరం రోగి శరీరమంత నిప్పులతో ఉన్నట్లు భావించును. నిద్రమత్తుగ ఉండుట, స్మారకం లేనట్టి నిద్ర, తలనొప్పి తలంతయు తాడుతోగాని నవారుతోగాని కట్టినట్లుండును. ముఖ్యంగా వెన్నుపాము అంతయు నొప్పిగ ఉండును.

**లూఫాబిండల్ :** దీర్ఘకాలికంగా మలేరియా జ్వరాలు, నీరుపట్టి ఉబ్బినట్లుండుట, కాలేయం, ప్లీహం పెద్దగా సాగినట్లుండునపుడు పనిచేయును.

**నిక్టాంతిస్ ఆర్బోర్‌ట్రిస్టిస్ :** పైత్యజ్వరాలు, కాలనియమం లేకుండ హెచ్చుతగ్గులతో వచ్చు మొండి జ్వరాలకు ఉపయోగపడును. ఈ జ్వరంలో దాహమునకు ముందుగాను, చలితో ఉండునపుడును, చలి విడిచిపోవునపుడు, వాంతులు కలుగునపుడు చేదుగ ఉండును. అన్ని జ్వరాలకు మంచి ఫలితమిచ్చును. పైత్య లక్షణాలపై ప్రాధాన్యత వహించును. నిరంతరం ఉండు వికారం, మలబద్ధకం, పైత్యవిరేచనాలకు పనిచేయును.

**ఒసిమం శాంక్టం :** విడుపుజ్వరాలలో ఇది ఆశ్చర్యం కలిగించేలాగ పనిచేయును. అమితమైన చలితో జ్వరం మధ్యాహ్నం పూట వచ్చును. వణుకు కూడ ఉండును. కాళ్లుచేతులు చల్లగా ఉండును. వర్షాకాలంలో వచ్చు జ్వరాలు, చలికాలం లేక వసంతకాలంలో వచ్చు సన్నిపాత జ్వరాలకు చాలా ఉపయోగపడు మందు, కాల నియమం లేకుండ హెచ్చుతగ్గులతో పిల్లలలో వచ్చు జ్వరాలకు పళ్ళు వచ్చు ఇన్‌ఫ్లూయంజా, ముఖ్యంగా దగ్గు, జలుబు, పడిశం, జ్వరం, విరేచనాలు తగ్గించును. జ్వరం దగ్గుతో ఉండుట, తరుణంలో కలుగు వళ్ళు నొప్పులు, ఎముకల నొప్పులు, కండరాల నొప్పులు, భయంకరమైన తలనొప్పి నివారించును.

**ఒల్డెన్ లాండియా హెర్ బాసియ :** జ్వరాలకు శ్రేష్ఠమైన మందు. ముఖ్యంగా నాడీమండలం కృంగినట్లుండు జ్వరాలలో పైత్యలక్షణాలుండుట, శరీరమంత మంటగ ఉండును. జీర్ణకోశంలో చిరచిరలాడునట్లుండును.

**స్వెర్టియా చిరాట :** చలి ఉన్నంతవరకు పానీయం త్రాగేందుకు కోరిక లేకపోవుట, వేడినీరు త్రాగేందుకు కోరుకొనుట, శరీరమంత చమటలు కారునట్లుండుట, ఛాంతి, చంక, తొడలలో కొంచెం కొంచెం చెమటలు పట్టినట్లుండును. చలితో ఉండునపుడు వికారం, పైత్యరసం, వాంతులు కలుగునట్లుండును. వేడి ఉండునపుడు కొద్దిగ దాహం ఉండును. జ్వరం వచ్చుటకు ఒక సమయమంటూ ఉండదు. దీర్ఘకాలికంగ ఉండు రోగులలో జ్వరాలకు మంచి మందు. జ్వరం విడిచిపోయిన తదనంతరం కాలేయ వ్యాధులు తగ్గిపోవును. జ్వరం వచ్చిన తరువాత కలుగు నీరసానికి ఉపయోగపడును.

**టినోస్పోర కార్డిఫోలియా :** మలేరియా జ్వరాలలో క్వినైను మందు కంటె అన్ని సమయాలలో ఈ మందు మంచి ఫలితం యిచ్చునని చెప్పారు. మలేరియా తరుణవ్యాధిగాని, దీర్ఘవ్యాధి గాని సాధారణంగ ఉష్ణం మధ్యాహ్నం చలితో ఎక్కువగుట, చలితో వణుకుపుట్టుట, అతిగ క్వినైను మందు వాడుట, విడవకుండ జ్వరం ఉన్నట్లయితే ముఖం మంటగ వుండుట, చేతులు, కాళ్ళు మంట, జ్వరం మరల సోకుట వలన వచ్చు బలహీనతకు పనిచేయును.

**ట్రికోశాంతస్ డియోయికా :** మలేరియా కాలా-అజార్ జ్వరాలలో ఉపయోగించిన సంతోషం కలిగించు మంచి ఫలితం యివ్వగల మందు. జ్వరం ఉదయం 10 గంటలకుగాని మధ్యాహ్నంగాని చలితో వచ్చును. దాహం, తలనొప్పి, ఉష్ణంతో తలనొప్పి అధికమగును. వికారం, వాంతులు స్పష్టంగ

సూచించు లక్షణాలు, కాలేయం, ప్లీహం సొలినట్లుండును. కామెర్లు, పైత్యరసంతో కూడిన విరేచనాలు, జ్వరంతో వుండునపుడు మంచి ఫలితం యిచ్చు మందు.

## వాతరోగము (GOUT)

**వయుమ్మూరియాలప్పొ :** ఈ మందు చూర్ణంలో సైంధవలవణం మిశ్రమం చేసి ఆవాల నూనెతో కలిపి అంటించిన వాతనొప్పులు, కీళ్లనొప్పులు నివారించును. లోపలికి కూడ వాడవచ్చును.

**వితానియా సోమ్నిపెర :** అశ్వగంధ మూలిక వేరును పై పూతగ వాడిన నయం చేయును. లోపలికి కూడ వాడవచ్చును.

## జీర్ణకోశం నుంచి రక్తం వాంతియగుట (HAEMATEMESIS)

**పిహాడవ్ డాక్టిలాన్ :** ఈ వ్యాధికి మంచి ఫలితం యిచ్చు మందు.

**పికస్ రిలిజియోస :** ఎర్రని ప్రకాశవంతమగు రక్తం వాంతియగునపుడు మేలు చేయును.

## మూత్రం (URINE)

**కలొట్రోపిస్ జిగాంటియా :** తరచుగ మూత్రవిసర్జన, మూత్రం ఎర్రగ, నల్లగ, గృహంలో వండు సారాయి, బీరులాగ విసర్జించుట, చాలా ఘాటైన వాసనతో విసర్జించును.

**కొల్యూస్ అరొమాటికస్ :** మూత్రావయవ వ్యాధులకును, ముఖ్యంగా మూత్రవిసర్జన బాధగ నుండి మూత్రం చుక్కలు చుక్కలుగ పడుట, మూత్రమనగారుట, మూత్రకోశం వాపు, తరుణ స్థితియందు పొత్తికడుపులో నొప్పులుండి మూత్రకోశంలో తీవ్రబాధ వుండును. మూత్రకోశపు అమత్వక్కు వాపు, సెగవ్యాధి (గనొరియా), మూత్రకోశంలో రాళ్ళ వంటివి ఏర్పడుట.

**ఎంబెలియా రైబెస్ :** మూత్రంలో రక్తం విసర్జించుట, రంగు తీక్షణంగ ఉండును.

**జమ్నెమసైల్వెస్టరు :** మూత్రం చక్కెరతో భారంగ ఉండును. మూత్రవిసర్జన విస్తారంగ ఉండుట వలన చాల బలహీనతగ ఉండును. మూత్రం తెల్లగ తరచుగ రాత్రి పగలు విస్తారంగ విసర్జించును. అధిక సాంద్రత కలిగి ఉండును.

**హైడ్రోకోటైల్ ఎసియాటిక :** మూత్రపిండాలలో స్వల్పంగ చీమలు మొదలగు క్రిములు ప్రాకుచున్నట్లుండుట, మూత్రకోశపె మెడ క్షోభం చెందినట్లుండుట, మూత్రకోశం చుట్టు నొక్కి వేసినట్లుండును. దగ్గరకు ముడుచుకొని పోయినట్లుండుట, తరచుగ మూత్రవిసర్జన కోరుట, మూత్రకోశపు ద్వారం నుంచి మూత్రవిసర్జన అవయవ ద్వారం వరకు గల నాళం క్షోభం చెందుట, మూత్రం గోధుమ రంగుగ మారుట, మూత్రం బురదలాగ మడ్డితో కూడి ఉండును. ఈ వ్యాధికి అబ్రమ అగస్ట, ఎగిల్ ఫోలియ; పికస్ రిలిజియోస; పికస్ ఇండిక; ఒసిమం శాంక్టం; సిజిజియం జాంబోలినం; టయిఫోపెట్రిన్ మందులు మేలు చేయును.

## ఊపిరితిత్తుల నుంచి రక్తం పడుట (HAEMOPTYSIS)

**ఎకలిఫా ఇండిక :** దగ్గినపుడు కల్లితో పాటు రక్తం పడుట, ధమనికి సంబంధించిన రక్తనాళాల నుంచి రక్తస్రావం ఉండుట, జ్వరంలో ఉండునపుడు అంతరాయం ఉండదు. ఉదయం కల్లితోపాటు ఎర్రని కాంతివంతమగు రక్తం పడును. సాయంత్రం గడ్డలులాగ నల్లని రక్తం పడును. ఛాతీలో ఎల్లప్పటికి నొప్పి ఉండును. పొడిదగ్గు వచ్చినపుడు, రక్తం ఉమ్మిట జరుగును.

**జస్టిషియ రుబ్రం :** ఈ వ్యాధికి దివ్యమైన ఔషధం శాశ్వతంగ నివారించగల మందు.

## తలనొప్పి (HEADACHE)

**అజాడిరక్టా ఇండిక :** తలనొప్పి, ధమనులు కణతలలో ధనారింపుగ కొట్టుకొనుట, ముఖ్యంగా

కుడివైపు ఉండును. నొప్పి తలంతయు లాగునట్లు ధనారింపుగ కొట్టుకొనుచున్నట్లుండును. కుడిభాగం కనుగ్రుడ్డులో నొప్పితో ఉండును. కదలిక వలన తలనొప్పి వచ్చును. కపాలంలో నొప్పి ఉండును. తలంతయు తీవ్రనొప్పి ఉండును. నడుస్తూ ఉండిన తల వెనుక భాగంలో నొప్పి ఉండును.

**కలోట్రోపిస్ జిగాంటియా :** తల తిరుగుట, తల వెనుకభాగంలో నొప్పి, మందంగ మొద్దుబారినట్లుండును. ఈ నొప్పి ఉదయం 11 గంటల నుంచి అర్ధరాత్రి వరకు ఉండును. సాయంత్రం పూట బాధలధికంగ ఉండును. తలనొప్పిగుండుట, ధనారింపుగ నుండును. ఒక దానికి బదులుగ మరియొకటి భావించుట, తల, ముఖం వేడిగ నుండును.

**హైడ్రొకొటైల్ ఏసియాటిక :** అమిత స్థబ్దత్వ స్థితిలో తల తిరుగుట, రక్తప్రసరణాధిక్యతచే, కలుగు తలనొప్పి కపాలమునకు సంబంధించిన నరాలన్నీ నొప్పి లాగినట్లుండును. తల వెనుకభాగం తాకిన సహనశక్తి లేకుండ ఉండును.

**జనోసియా అశోక :** తెలివి తప్పునట్లు చేయు తలనొప్పి నొసట, కణతలు గర్భకోశానికి సంబంధించి రక్తప్రసరణాధిక్యతచే కలుగు తలనొప్పి ప్రతిబింబించును. కొంచెం కొంచెం ఋతుస్రావం విసర్జించుట, ఋతుస్రావం ప్రవాహంలాగ విసర్జించిన తలనొప్పి తగ్గిపోవును. స్నానం చేసిన తదనంతరం బాగుండును. బయట గాలిలో తలంత భారంగా ఉండును. కంటిలొత్తుపై నుండు భాగం ఒకటి లేక రెండువైపుల నొప్పులుండును. కన్ను వెలుగును సహించలేకపోవుట, వెలుగులో అమిత భయం, మానసికంగ అలసట వలన కన్నులలో బాధలున్నట్లుండును.

**ఒసిమం శాంక్టం :** తలనొప్పి, భారంగ ఉండుట, ధనారింపుగ కొట్టుకొనుట, ఒత్తిడి వల్ల తగ్గును. తలతిరుగుట, నడుచునపుడు బాధలధికంగ ఉండును. నిశ్శబ్దంగ ఉండుట కోరును. తల పైన కట్టుకొనుట గాని కప్పుకొనుటవలనగాని బాధ తగ్గినట్లు భావించును. నడినెత్తిన ఉష్ణం ఉండును. తలపై చల్లని నీరు పోవుట వలనగాని చల్లని గాలి తగులుట వలనగాని ఉపశాంతి కలుగును.

## గుండె (HEART)

**ఏగిల్ఫోలియో :** గుండెవ్యాధులు, మూత్రం తగ్గిపోవుట నాడులు ఉద్రేకం చెందినట్లుండును.

**అర్జున టెర్మినాలియా :** అల్లోపతి వైద్యం సంబంధించిన పరిశోధనలో ఇది సరియగు ఫలితం నొసంగదని వ్యర్థమని కనుగొన్నట్లు తెలిపారు. అన్నిరకాల గుండె వ్యాధులలో ఆయుర్వేద వైద్యులు యీ మందును వాడి విజయవంతంగా నివారించడం జరిగిందని చెప్పారు. గుండె ప్రాంతంలో భారంగ నొక్కివేయుచున్నట్లును, పొర్లుపొర్లుగా వచ్చు గుండెనొప్పి, ఇందులో గుండెదడ, శ్వాసకష్టంగా ఉండును. రోగికి తెలియునట్లు గుండె వడిగా బలంగా కొట్టుకొను వ్యాధులపై పనిచేయును. డాక్టర్ ఎస్.సి. ఘోష్ తన పరిశోధనల ద్వారా తెలియజేశారు. ఈ వ్యాధికి అసొయిని అను మందు కూడా పనిచేయును.

## ఎక్కిళ్ళు (HICCOUGH)

**వయుమ్యూరియాలప్పా :** ఎక్కిళ్ళు మొండి వ్యాధిగ ఉండునపుడు నివారించును.

## స్వరం బొంగురుపోవుట (HOARSENESS)

**సొలానం జాంతో కార్పస్ :** దగ్గుతో స్వరం బొంగురుపోవుటకు ఇది శ్రేష్టమైన మందు. వైద్యానికి సంబంధించిన అన్ని కళాశాలలవారు పరిశోధన వలన ఒక నిర్ధారణకు రావడం జరిగిందని తెలిపారు. శ్వాసనాళంలో అమత్వక్కు వాపు జలుబుతో కూడిన జ్వరం ఊపిరితిత్తుల వాపు చిన్న శ్వాసనాళాలు ప్రారంభదశలో వాచి తదుపరి ఊపిరితిత్తులకు వాపు (న్యుమోనియా)తో కంఠస్వరం

తగ్గిపోవును. ఏ కారణంచేనైన వచ్చు స్వరం బొంగురుపోవుటకు వాడుదురు. కాస్టికం, ఫాస్ఫరస్, సెలీనయం మందులు పనిచేయక విఫలమైనపుడు ఈ మందు కుదుర్చును.

## వెఱ్రి, ఉన్మాదము , పిచ్చి (INSANITY)

**రావుల్ఫియా సర్పెంటిన** : ఉన్మాదం, పిచ్చి, వెఱ్రి మొదలగు లక్షణాలపై అద్భుతంగ పనిచేయగల మందు. ప్రసిద్ధి చెందిన మందు. ఈ మందు అధిక రక్తపోటు (High Blood Pressure) లక్షణాలను కుదుర్చుటలో శ్రేష్టమైన మందు. కొన్ని కేసులు ఒక వారం రోజులలో తగ్గిపోవును. మరికొన్ని కేసులలో చాలా కాలం మందు తీసుకొనిన నివారణయగును.

## కామెర్లు (JAUNDICE)

**అంద్రోగ్రాఫిస్ పానికులాట** : శిశువు జన్మించిన కొద్దిరోజులలో కలుగు కామెర్లు, కాలేయం పెద్దదగుట, తాకితే నొప్పిగ ఉండుట, వత్తిన కాలేయమంత నొప్పి, శివువులలో కాలేయ వ్యాధుల వలన కలత చెందుట, పైత్యవిరేచనాలు, మలబద్ధకం, పిల్లలో పచ్చని విరేచనాలు కలుగును.

## కుష్టురోగము (LEPROSY)

**కలోట్రోపిస్ జిగాంటియా** : కుష్టువ్యాధిలో పుండ్లులాగ ఉండునపుడు ఉపయోగించిన లాభకారిగ ఉండును.

**జివోకార్డియా ఒడొరాట** : కుష్టువ్యాధిని కుదుర్చుటలో దివ్యమైన ఔషధం, యీ మందును లోపలికి, పైకి వాడాలి. ఈ మందును వాసెలైనుతో కలిపిగాని, మిశ్రమం చేసిగాని అంటించవలయును.

**హైడ్రొకొటైల్ ఏసియాటిక** : చాలా ఆశ్చర్యం కలిగే విధంగ కుష్టువ్యాధి నివారించుటలో పనిచేయగలదని అమెరికా దేశానికి చెందిన వైద్య నిపుణులు, భారతదేశానికి చెందిన వైద్య నిపుణులు చెప్పారు.

**మొమొరిక చరంటియా** : దీని విత్తులు, ఆకులు కుష్టువ్యాధికి మంచి ఫలితం ఇచ్చును. ఈ వ్యాధికి అజాడిరక్టా ఇండికా, ఒసిమం శాంక్టం మందులు పనిచేయును.

## కుసుమ, తెల్లబట్ట (LEUCORRHOEA)

**అబ్రోమ అగస్ట** : కుసుమ విస్తరంగ కలుగుట, తెల్లగ పల్చగ చిక్కగ ఋతుస్రావం కలుగునపుడు స్రవించును. యవ్వనదశలో కలుగు తెల్లబట్ట, పిల్లలు సన్నగ శుష్కించిపోయి నరాల బలహీనత ఏర్పడును. ఈ కేసులలో తెల్లబట్టతోపాటు రక్తం కూడ విసర్జించునపుడు ఈ మందు రాజాలాంటిదని తెలిపారు.

## శరీరంపై కలుగు తెల్లని మచ్చలు (LEUCODERMA)

**వెర్నొనియా ఎంథేల్ మింటిక (సోమరాజ్)** : ఈ మందును దీర్ఘకాలికంగ వాడిన ఫలితముండును. వెర్నొనియా నాలుగు భాగాలు ఒక భాగం హరితల్ ఆవు మూత్రంలో మిశ్రమం చేసి అంటిస్తూ వచ్చిన తెల్లమచ్చలు నివారించవచ్చని చక్రదత్తా సలహా యివ్వడం జరిగింది. "సొరాలియా" అను మందును లోపలికి పైపూతగ వాడిన తెల్లమచ్చలు కుదుర్చుటలో చాలా ఉపయోగపడును.

## ప్రసవించిన తరువాత కలుగు స్రావము (LOCHIA)

**ఒసిమం శాంక్టం** : ప్రసవానంతరం మావిపడినది మొదలు యోని స్వతసిద్ధ ఆకృతికి వచ్చు వరకు స్త్రీ జననేంద్రియం నుంచి స్రవించు మైలస్రావం దుర్వాసనగ నుండును. ఆఖరు వరకు

అస్వాభావికమగు రంగుగ ఉండును. స్రావం అమత్వక్కుతో కలిసి స్రవించును. చీము మాదిరిగను చేపను శుభ్రం చేసినట్లుండును. ప్రసవించిన తదనంతరం యీ మందును వాడిన గర్భకోశానికి సంబంధించి వ్యాధులు రాకుండ అరికట్టును. ఈ వ్యాధికి అశోక, వంశలోచన్ (బంబూనినం) మందులు చక్కగ పనిచేయును.

## క్షీర రసగ్రంథులు : స్త్రీ స్తనాలు (MAMMARY GLANDS)

**మొమోర్డిక చరంటిమా** : వీటి ఆకులను ఉపయోగించిన స్త్రీ స్తనాలు పాలిండ్ల పరిణామం అభివృద్ధి చెందును.

## పొంగు : వేపపువ్వు అనెడి చిన్న అమ్మవారు (MEASLES)

**మొమోర్డిక చరాంటియా** : పొంగు ఆకస్మికంగ అణగారిపోయినట్లయితే దీని యొక్క ఫలితం అధిక ఉష్ణం ప్రకోపించును. ఇది ఉపయోగించిన మంచి ఫలితం ఉండును. పొంగు ప్రథమదశలో ఉండునపుడు వాడదగ్గ మందు. తరుణంలో వచ్చు జలుబు, వికారం, దగ్గు, శరీరమంతా నొప్పులుండునపుడు వాడవలసిన మందు.

## ఋతుస్రావం అమితంగా అత్యధికంగా స్రవించుట (MENORRHAGIA)

**బ్లూమియా ఒడొరాట** : గర్భకోశం నుంచి అమితంగ ఋతుస్రావం స్రవించునపుడు అదుపులో ఉంచగలదు. ఋతుస్రావం దుర్వాసనగ ఉండునపుడు, గర్భస్రావం కలుగునపుడును చక్కగ పనిచేయును. తెల్లబట్ట రక్తంతో స్రవించునపుడు, శారీరకంగ, మానసికంగ అలసట చెందినపుడు కలుగు ఋతుస్రావం అదుపులో ఉండును.

**వికస్ రెలిజియోస** : గర్భకోశం నుంచి ప్రకాశవంతమగు రక్తం స్రవించుట, ఉదరం క్రింది భాగంలో నొప్పి ఉండును, ఋతుస్రావం అత్యధికంగ స్రవించునపుడు యీ మందు అదుపులో ఉంచగలదని సంతృప్తి చెందినట్లు జె.హెచ్. క్లర్క్స్ చెప్పారు.

**జొనొసియా అశోక** : ఈ మందు స్త్రీల పాలిట కల్పవృక్షం లాంటిది. స్త్రీల గర్భాశయం మీద పనిచేయు మందులలో చాలా గొప్పది. ఋతువు చాల త్వరితంగా అగుపడి విస్తారంగ నుండి దీర్ఘకాలం ఉండును. అందుచే ఆమె క్షీణించి పాలిపోయి ముఖం కన్నులు మండుచుండును. రక్తస్రావం చెడు వాసనగ ఉండును. మలబద్ధకం నడుములో తొడలందు నొప్పి ఉండును. ఋతుస్రావం చాలా తక్కువగ నుండు వారలకుగాని, ఋతువు ఆలస్యంగనగుపడువారలకుగాని ఇది అమూల్య ఔషధం. తలనొప్పి, తల తిరుగుటకు కూడ పనిచేయును.

**మెనిస్పెర్మం** : ఎర్రని రక్తం గడ్డలులాగ ద్రవం మాదిరి స్రవించును. రోగి భయంకరంగ బలహీనత చెందును. తల తిరుగుట, చెవులలోఎడతెగని శబ్దం ఉండును. గర్భకోశం నుంచి రక్తం నిరంతరం కారుట, కదలిక వలన ఉద్రేకం చెందును. ఋతుస్రావం కలుగు సమయంలో చెడువాసనగ వచ్చునపుడు సాధారణంగ వాడు మందు. గర్భకోశం నుంచి ఏ విధమైన రక్తస్రావం ఉండినను వాడవచ్చును. మైల వచ్చు సమయంలో ఉదరం క్రింది భాగంలో నొప్పి ఉండును. ప్రసవించిన తదనంతరం అమితంగ కలుగు రక్తస్రావం అదుపు చేయుటకు మేలుచేయును.

## మూల శంక (PILES : HAEMORRHOIDS)

**బ్లూయబదారాట** : రక్తస్రావం ఉండు మూలశంక వ్యాధికి శ్రేష్ఠమైన మందు. ఇది గర్భకోసం నుంచి స్రవించు రక్తస్రావానికి, గ్రహిణి మూలశంక వ్యాధి అదుపులో ఉంచును.

**పిండన్ డక్టిలాన్** : దర్భగడ్డితో చల్లని కషాయం తయారుచేసి, తరచుగ లోపలికి యిచ్చిన మూలశంక నుంచి స్రవించు రక్తస్రావాలను నిలుపుదల చేయును.

జనాషియా అశోక : రక్తస్రావం గల మూలశంక రక్తం రంగు ఎర్రగ నుండును. తీవ్రనొప్పి, వీపులో బిర్రబిగినట్లుండును. మలబద్ధకం వలన బాధలు, మూత్రవిసర్జన సమయంలో మంట వున్నట్లుండును. చేతులు, కాళ్ళు, కన్నులు మంటగ ఉండును.

లూఫాబిండల్ : ఈ మందులోపలికిని, పై పూతగ వాడిన తృప్తికరంగ అదుపులో ఉంచగలదు.

మొమోర్డిక చరంటియా : ఈ మంద పైపూతగాను, లోపలికి వాడిన నయమగును.

## తేలుకాట్లు (SCORPION STINGS)

కలోట్రోపిస్ జిగాంటియా : ఈ మందు తేలుకాటుకు విశేషంగా వాడుదురు. ఇతర విషపురుగు కాట్లుకు ఉపయోగపడు మందు.

క్లెరొడెండ్రాన్ ఇన్‌ఫార్చునేటం : తేలుకాటుకు ఉపయోగపడు మందు.

ల్యూకాస్ ఎస్పేర : పైపూతగాను, లోపలికి, టింక్చరు వాడిన నొప్పి, మంట బాధలు వెంటనే తగ్గిపోవును.

టెర్మినాలియా చెబూల : ఇది తేలుకాటుకు ఉపయోగపడును. ఆర్.ఎన్. చోప్రా.

ట్రిచొశాంతెస్ డియోయికా : దీని ఆకులు తేలుకాట్లకు ఉపయోగపడును. ఆర్.ఎన్. చొప్రా. వీటి పండ్లలో చేదుగా ఉండేవి ఉపయోగపడును.

## చర్మము (SKIN)

అబ్రొమ ఆగస్ట : చర్మం పొడిగ ఉండును, చర్మం గోకుకొనుట, చర్మం మంటగా ఉంటూ రాత్రిళ్ల నిద్రకు అంతరాయం ఏర్పడుట, చిన్న చిన్న కురుపులు ఉండును. వేసవి కాలంలో బాధలధికంగ ఉండును.

అజాడిరక్టా ఇండిక : శరీరంలో కొన్ని భాగాలు దురదగ ఉండుట, దద్దురులు లేకుండును. బయట గాలిలో మధ్యాహ్నం పూట ఉద్రేకం చెందును.

సిసాల్ పెనియా బాండుసెల్లా : చర్మం మురికిగ ఉండుట, నల్లని రంగుతో ఉండును. చిన్న దద్దురులు దోమల కాట్లవలన ఏర్పడిన దద్దురులు మాదిరిగ కనపడును. ఆకస్మికంగ అదృశ్యమగును.

జనొకార్డియా ఒడొరాట : చర్మవ్యాధులకు చాల్మూగ్రా నూనె (ఆయిల్) రాజులాంటి మందు. దీనిని కుష్టువ్యాధిలో, చిడుము, గజ్జి, అంటువ్యాధులలో యీ మందును వాసలైన్‌తో మిశ్రమం చేసి పై పూతగా ఉపయోగించవలయును.

జిమ్నెమసైల్వెస్టరు : సెగ్గెడ్డలు, రాచపుండు, కాలుట, శరీరమంత ఉండును. అతిమూత్రవ్యాధి, మధుమూత్ర వ్యాధి రోగులలో రాచపుండ్లు శరీరంలో ఏ భాగమందైనా కనపడవచ్చును.

హైడ్రొకోటైల్ ఎషియాటిక : కాళ్లపైన పచ్చని మచ్చలు, మచ్చలు శరీరమంతా వ్యాపించుట, విగర్ఫికి చెందిన దద్దురు, ఎర్రగనుండుట, కనురెప్పల మీద ఎర్రని చుక్కలుండుట, ఎడమభాగం చేతులకు కూడా ఉండుట, ఎర్రని చుక్కలు తెల్లని మచ్చలుగా మారుట, ఇది మెడమీద ఎడమ భాగంలో ఉండును. ముఖం, మెడ, వీపు, ఛాతీ, భుజాలు, తొడ భాగంలో చాలా దురద విస్తారంగ చెమటలు పట్టుట, చర్మంపై పైననే ఎర్రగ మారినట్లుండును.

హైడ్రోఫేల స్పినోశ : వేసవికాలంలో సాధారణంగ కనపడు దద్దురులు, దురద, అతివేడి, కొలదిగ ఉష్ణం నుంచి ఇటువంటి బాధలు వచ్చును. చల్లదనం వలన తగ్గును. ఈ మందు వాడిన కలుషితమైన రక్తం వలన కలుగు కురుపులు మొదలగు వాటి నుంచి కాపాడును.

మొమోరాడియా చరంటియా : ఈ మూలిక ఆకులనుగాని, గుజ్జు మాదిరిగ తయారుచేసిగాని అంటించిన చాలాకాలం నుంచి నయంగాని కురుపులను కుదుర్చును.

నయుమ్యారియాలప్పా : ఈ మూలిక వేరును పొడిచేసి ఆవాల నూనెతో మిశ్రమం చేసి

ఉపయోగించిన కపాలంను కప్పి ఉండు కేశాలు గల చర్మవ్యాధిల తీవ్ర దురదతో నుండు చర్మవ్యాధి నివారించును.

**వెర్నోనియా ఆంతెల్మింటికా (సోమరాజ్)** : తెల్లని పొలుసులతోను, పొడిగను, ఎర్రని మచ్చలు, చర్మం గరుకుగ నుండు దీర్ఘవ్యాధి సంబంధమగు చర్మవ్యాధి శరీరంపై కలుగు తెల్లని మచ్చలు ఇతర చర్మవ్యాధులకు ఇది ఉపయోగపడును.

## మశూచికము : పెద్దమ్మవారు (SMALL POX)

**సొలనాంజాంతొకార్పస్** : నమ్మకంగా ఈ వ్యాధి నిరోధకంగా పనిచేయును. ఉదయం పూట ఖాళీ కడుపుతో ఉండునపుడు, హిందూ వైద్యులు కూడ ఈ మందును మశూచికి నిరోధకంగ ఉపయోగింతురు.

## పాముకాటు (SNAKE BITE)

**ఎటిస్టా ఇండిక** : దీని వేరును పాముకాటుకు ఉపయోగించెదరు. ఆర్.ఎన్. చొప్రా.

**ఎచిరాంతస్ ఎస్పేర** : కుక్కకాటుకు, పాముకాటుకు ఇతర విషపురుగు కాట్లకు గొప్పగ పనిచేయును. ఈ మందును లోపలికి, పైకి ఇవ్వవలయును.

**బొరెహవ్యాడి ఫ్యూస** : వర్షాకాలంలో వచ్చు ప్రబలమైన జ్వరం, పాముకాట్లకు, ఎలుకకాట్లకు, పిచ్చికుక్క కాటుకు ఉపయోగపడునట్లు సుష్రుత యందు కనపరచడమైనది. పాము కాటుకు శ్రేష్ఠమైన మందు. దీని రసం లోపలికి ఇవ్వాలి. దీని రసం శరీరమందు పూయాలి. కండ్లలో కూడ వేయాలి. పాము కాటువేసిన స్థలంలో తరచుగ మర్దన చేసిన ఉపయోగపడును. విషం ఉండినట్లయితే ఈ చెట్టు వేర నల్లగ మారును. వెంటనే వాటిని పారేసి కొత్తవేరును తీసుకొని వాడాలి. ఇదేలాగ ఉపయోగిస్తూ వచ్చిన చెట్టువేరు నల్లగ మారనట్లయితే విషం లేదనియు విషాన్ని హరించివేసినట్లు గుర్తించాలి.

**క్లెరొడెండ్రాన్ ఇన్‌ఫార్చునేటం** : పాముకాటుకు ఉపయోగపడును. పద్ధతి ప్రకారం వాడిన మంచి ఫలితం వచ్చును.

**జిమ్నెమసైల్వస్టర్** : దీని వేరు చూర్ణమును ఆముదంలో మిశ్రమం చేసి పైపూతగ అంటించాలి. పాము కాటుకు, విషపురుగుల కాట్లకు ఇపికాక్ మాదిరిగ పనిచేయును.

**లూకాస్ ఎస్పేర** : పాముకాటుకు వాడు మందు. పాముకాటులో ఈ మందు మదర్‌టించరును పాముకాటు వేసిన భాగంలో అంటించాలి. 10 నుంచి 15 చుక్కల మందును ప్రతి 15 నుంచి 20 నిముషాలకు ఒకసారి రోగి బాగుండేవరకు యివ్వాలి. పాముకాటుకు "ఒసిమం శాంక్టం" అను మందు కూడ పనిచేయును. ఇస్‌రాగాజా IX మందు రామబాణంలాగా పనిచేయును.

## శుక్రనష్టము (SPERMATORRHEA)

**పయుస్యూరెయాలప్స్** : శుక్రనష్టం, వీర్యం మూత్రంతోపాటు విసర్జించునపుడు పనిచేయునని హకిమ్యు సిఫారసు చేసెను.

## ప్లీహము (SPLEEN)

**ఎండర్ సోనియా రోహితక్** : ప్లీహం పెద్దదగుట, నొప్పి ఉండిన దీనికి సంబంధించిన అన్ని రకాల బాధలు వ్యాధులకు అమృతంలాగ పనిచేయును. ప్లీహం పెద్దదై దీర్ఘకాలికంగ ఉండు మలేరియా జ్వరాలకు ఉన్నత స్థాయిలో పనిచేయును.

ల్యూకస్ ఎస్పెర : ప్లీహానికి సంబంధించిన వ్యాధులలో గట్టిపడినపుడును, ప్లీహం పెద్దగ సాగినట్లుండునపుడును, స్థిరంగ నమ్మకంగ పనిచేయు మందు.

# వంధ్యత్వము (STERILITY)

జనోషియా అశోక గర్భకోశానికి సంబంధించిన అన్ని వ్యాధులకును, గర్భకోశం బలహీనతను పోగొట్టి చాలాకాలంగ ఉండు వ్యాధులను నయం చేయును. సాధారణంగ వంధ్యత్వం గలవారు వాడుదురు. కొత్త అశోక మొగ్గలను ఎనిమిదింటిని వాపు పట్టుదినంగాని చీము పట్టుదినంగాని యిచ్చిన వంధ్యత్వం నివారించునని పూర్వీకులు చెప్పారు.

# రాయి, గట్టిపడిన పదార్థం (STONE)

**పిండన్ డాక్టీలాన్** : మూత్రకోశానికి సంబంధించిన మూత్రపిండంలో రాళ్ల వంటివి ఏర్పడుట, సవాయి ద్వితీయావస్థచే కలుగు మార్పునకు నయం చేయుటలో ప్రముఖస్థానం వహించిన మందు.

**హెమిడెస్మస్ ఇండిక** : మూత్రం కొంచెం కొంచెం విసర్జించుట, మూత్రం బంధించుట, మూత్రకోశంలో రాళ్లు ఉండుట, ఈ మందును పాలతో వాడవలయును. నయమైన తదనంతరం చితుకకొట్టినట్లు నొప్పి ఉండును.

**హైగ్రాఫిల స్పినోస** : మూత్రపిండంలో రాళ్ల వంటివి ఏర్పడినపుడు విజయవంతంగ పనిచేయును.

**పొలావం జాంతోకార్పస్** : ఆహార నాళం, మూత్రనాళం మూత్రవిసర్జన నాళం సన్ననగుట, మూత్రం బంధించుట,రాయిలాగ ఉండునపుడు ఈ మందు పనిచేయదు అను ప్రశ్న ఉండదని, ఇది దివ్యమైన మందని తెలిపారు. ఈ మందును బెరిబెరిస్, కాంతారిస్, సర్సపరిల్లా, లైకొపోడియం మందులను పోల్చవచ్చును.

# సవాయి (SYPHILIS)

**కల్ట్రోపిస్ జిగంటేయ** : సవాయి (సిఫిలిస్) వ్యాధి నివారించుటలో ఈ మందును ఆలోచించదగ్గది. యోగ్యత, అర్హతగల వారందరు అమూల్యమగు మందుగ పేర్కొనడం జరిగింది. దీని టించరు జయప్రదంగా పనిచేసినట్లు డాక్టర్ గ్రమ్మి చెప్పారు. తీవ్రమగు ప్రమాదంగ ఉండు కేసులలో వృద్ధికి తెచ్చుట, ముందుకు తీసుకొచ్చుట, వ్రేళ్ళు చివరిభాగంలో గోరుపై కండరం వచ్చి పుండు ఏర్పడినటువంటి దానికి పనిచేయగల మందు. కడుపులో ఉష్ణం ఉండుట, దీని ముఖ్య లక్షణం. "కల్ట్రోపిస్ జిగంటేయ" మందు వలన లాభం లేనపుడు "కలొటబపిస్ లెక్టం" అను మందును వాడుము.

# క్షయ ; రాజయక్ష్మ (TUBERCULOSIS)

**జస్టిసియా అడాటొడ** : ప్రథమ దశలో ఈ మందు నమ్మకంగ పనిచేయగల విలువైన మందని కొనుగొన్నారు. అమత్వక్కులు పొడిగనుండుట, దాహం అతిగ నుండును.

**సన్నిపాత జ్వరం** : (Typhoid) డెస్మోడియం జాంగెటికం : సన్నిపాత జ్వరంతో బాధపడురోగిని రక్షించుటకు వాడుదురు. మెదడు వెన్నుపాములను చుట్టియుండు పొరలవాపు ఇందు తీవ్రమగు తలనొప్పి సాధారణంగా తల వెనుకభాగం ఉండును. జ్వరం వణుకుతో మెడవెనుక కండరాలు బిర్రబిగియును. శరీరమంత నొప్పులతో ఉన్నట్లు రోగి భావించును. నిద్రమత్తు ఉండుట, స్మారకం లేనట్టి నిద్ర, తలనొప్పి, తలను నరాలతోగాని త్రాడుతోగాని కట్టివేసినట్లు భావించుట, ముఖ్యంగా వెన్నుపామంతయు నొప్పి ఉండును.

ఈ వ్యాధికి ఎగిల్‌ఫోలియా; ఆండ్రొగ్రాఫిస్; ఎటిస్టా ఇండిక, అజాడిరక్టా ఇండిక, సీసాలిపెనియా బాండు సెల్లా మందులు మేలు చేయును.

## పుండు (ULCER)

**అ[బోమ ఆగస్ట** : చర్మం పొడిగ ఉండుట, చర్మంపై గోకుతూ ఉండుట, రాత్రి విశ్రాంతి లేకుండ చర్మం మంటగ నుండుట, విరివిగ చిన్న చిన్న కురుపులుండుట, వేసవిలో బాధలధికంగా ఉండును.

ఈ వ్యాధికి ఎగిల్ పోలియా, అజాడిరక్టా ఇండిక; కెలోట్రోపిస్ జిగాంటియా మందులు పనిచేయును.

## తలత్రిప్పుట (VERTIGO)

**అజాడిరక్టా ఇండిక** : తలతిరుగుట, ఇటు ఆటు తల కదలినట్లుండును కూర్చుండు స్థితిలో ముఖ్యంగ ఉద్రేకం చెందినట్లుండును. తల త్రిప్పుతోపాటు తలనొప్పి ఉండును. ఉదయం 10 గంటల సమయంలో తలత్రిప్పుట.

**బెర్బినాలియా చెబూల** : తల వెనుకభాగంలో తీవ్రంగా తల త్రిప్పుట ప్రారంభించి తల కుడిభాగం వరకు వ్యాపించి (కుడి కణతల నుంచి కుడిభాగం నొసట వరకు) ఉండును. ఎడతెగకుండా ఉండును. రాత్రి సగలు ఉండును. కణతకు సంబంధించి కుడి భాగంలో ఎముకల అంచులు రంపపు పండ్లవలెనుండి అవి ఒకదానితో మరియొకటి అమరి కదలని కీలుగ ఏర్పడుట, తల వెనుక భాగంలో స్వల్పంగ తల నొప్పి, కుడిభాగం కపాలంతోపాటు తల తీవ్రంగా తిరుగును. సూర్యకిరణాల వలన తల తిరుగుట బాధ ఉండును. ఒత్తిడివలన గట్టిగ ఉండును. కదలిక ఉండును. చల్లనీటి స్నానం సాయంత్రం చల్లని పొడిగాలి నిద్రించు సమయం తింటున్నప్పుడు తగ్గినట్లుండును.

## కోరింత దగ్గు (WHOOPING COUGH)

**జస్టిసియా అడాటొడ** : కోరింత దగ్గుతో పిల్లలు ఊపిరిపీల్చుట కష్టంగ ఉండును. పాలిపోయినట్లుండుట, నల్లగ బిగుసుకొని పోయినట్లుండుట, శరీరం బిర్రబిగిసినట్లుండును. దగ్గుతోపాటు, వాంతులు కలుగుట, ఆహారంగాని, ద్రవ పదార్థంగాని, నీరుగాని కడుపులో ఉండకపోవుట.

## క్రిములు (WORMS)

**వెర్నొనియా ఎంతెల్మింటికా** : ప్రేగులలో ఉండు ఏటికపాములు, నుసి పురుగులు, దారం వంటి క్రిములకు ఈ మందు ఉపయోగపడును. రాత్రి స్పృహ లేకుండగనే శయ్యలో మూత్రం పోయుట, పిల్లలలో కొరుకుచున్నట్లు అలవాటుపడి యుందురు.

**ఎటిస్టా ఇండిక** : అన్నిరకాల క్రిముల వ్యాధికి ఇది దివ్యమైన మందు. బొడ్డుచుట్టూ శూల, వికారం, వాంతులు ఉండును. క్రిముల వలన పిల్లలకు ఈడ్పులుండును. పూర్తిగ కండ్లు మూసుకొని ఉందురు.

**క్లరొడెండ్రాన్ ఇన్‌ఫార్చునేటం** : ఇది విరేచనమగునట్లు చేయు మందు. ప్రేగులలోనికి పైత్యరసమధికంగా స్రవింపచేయును. ప్రేగులందలి క్రిములను నశింప చేయునట్టి మందు. పెద్దప్రేగు చివరిభాగంలోగాని, పురీషనాళంలో ఉండు క్రిములను నాశనం చేసేందుకు సూది మందు యివ్వడం వలన చాలా ఉపయోగం ఉంటుందని తెలిపారు. క్రిముల లక్షణాలతో నీళ్ళ విరేచనాలు కలుగునపుడు ఉపయోగపడును. విరేచనాలు ద్రవంలాగగాని పశుపు పచ్చరంగుగాని, నురుగుతోగాని ఉండుట, క్రిములవలన కడుపునొప్పి వచ్చుట, ప్రేగులలో క్రిములను నాశనం చేయుటలో ప్రథమ స్థానం వహించిన మందు.

యొంబెలియా రైబ్సు : క్రిముల మీద గొప్ప పనిచేయు మందు. చిన్నపిల్లలలో క్రిముల వలన కలుగు అజీర్ణం, ఉదరం వాయుపూరితమగుట, విరేచనాలు, జ్వరాలు, క్రిమివ్యాధులలో "నక్సువామికి", "సినా", "శాంటోనైను" మందులు మేలు చేయనపుడు ఈ మందు మేలుచేయును. మూత్రం ఘాటు వాసనగను, రక్తంవలె ఎర్రగ నుండును. ఈ మందు ఎంపిక చేయుటకు ఒక ముఖ్యలక్షణం విరేచనంలో క్రిములు వెడలును. రోగి చిరచిరలాడుచుండును. పండ్లు కొరుకుకొనును. రోగి ఎల్లప్పుడు ముక్కును గిల్లుకొనుచు, నాలుక పొడిగ నుండును. వికారం ఉండును. ఉదరం వాయుపూరితమై అజీర్ణ విరేచనాలు, గుదంనందు దురద, ముక్కులో దురద, ముక్కులోనికి వ్రేళ్ళను దోపుకొనుచుండుట, మూలశంక, చిన్నపిల్లల్లో మలబద్ధం శ్వాసనాళాలు వాపు, చర్మవ్యాధులు, కీళ్ళవాతం ఉండునపుడు మేలుచేయును.

## రోగికి సంబంధించిన లక్షణ సూచిక (CLINICAL REPERTORY)

**ఉదరం :** (Abdomen) మంట నొప్పి : ఎకలైఫ ఇండిక, ఎన్తెర్సొనియా రోహితక, అమూర రోహితక, ఎన్డో గ్రాఫిస్ పానికులేట, ఎటిస్టా ఇండిక; ఉదయం 11 గంటలు = ట్రిచొసాంతస్.

**ఉబ్బుట, వాచుట :** Distention ఎకలైఫ ఇండిక, ఎగిల్‌పోలియా; జెంటియాన చిరాట; అబ్రొమ అగస్ట; హైడ్రొకొటైల్ ఏసియాటిక, సెఫలాండ్ర ఇండిక, ఒసిమం సాంక్టం, సారక ఇండిక; టెర్మినాలియా చెబూల; ట్రిచొసాంతస్ డియోయిక; జస్టిసియా అడాటోడ; జుగ్లాన్స్ రెజియా.

**ఉదరం క్రింది భాగం :** Lower Abdomen : ఎగిల్ పోలియా; ఆండర్ సోనియా.

**భుజించిన తగ్గుట :** ఎగిల్‌పోలియా, జస్టీషియా అడాటోడ.

**నీరు పొరెడిశబ్దం :** ఒసిమం శాంక్టం.

**నొప్పి :** అబ్రొమ అగస్ట, ఎకలిఫా ఇండిక.

**శూలనొప్పి :** ఎకలిఫ ఇండిక, అజాడిరక్టా ఇండిక.

**ఉదరకుహర ఊర్ధ్వభాగమందలి ఇరుపార్శ్వములలో ఎడమ భాగం నొప్పి :** ఆండర్ సోనియా రోహితక్.

**కుడి భాగంలో నొప్పి :** ఆండర్ సోనియా; ఆండ్రోగ్రాఫిస్ పానికులేట, బొరెవియా డిఫ్యూసా; సిసాల్ పెనియా బాండుసెల్లా, బసిమం శాంక్టం; ట్రిచొసాంతస్ డియోయిక.

**ఉదరం చుట్టూ నొక్కివేయుట :** Abdomen constriction : హైడ్రొకొటైల్ ఎసియాటిక.

**జ్వరానికి ముందు :** సిసాల్ పెనియా బాండుసెల్లా.

విరేచనాలు ఉధృతంగా ఉండుట : ట్రికొసాంతస్ డయోయిక.

**వడుముకు సంబంధించిన కుడిభాగం :** టెర్మినాలియా చెబూల.

బొడ్డుచుట్టూ నొప్పి : అజాడిరక్టా ఇండిక : ఎటిస్టా ఇండిక.

ఒత్తిడివలన ఉపశాంతి : అజాడిరిక్టా ఇండిక.

**అవయవం గట్టిపడి పరిమాణమందు తగ్గుట** - Cirrhosiss; Hardening Liver : బొరావియా డిఫ్యూస.

**పరధ్యానం** - Absent minded : అబ్రొమ అగస్ట, బ్రాహ్మి; సారక ఇండిక; టెర్మినాలియా చెబూల.

**మొటిమలు** - Acne : హైడ్రొకొటైల్.

**ఆమ్లత్వం** - Acidity : ఎగిల్‌పోలియా; ఎటిస్టా ఇండిక; ఎటిస్టారాడిక్స్; ఆండ్రొగ్రాఫిస్ పానికులేట.

**వాత్సల్యంగల** - Affectionate : సారక ఇండిక.

**వ్యాకులత ; ఆందోళన** - Anxiety : అబ్రొమ అగస్ట ; అజాడిరక్ట ఇండిక; హోలర్రెన ఆంటి డిసెంట్రిక; జస్టిసియా అడాటొడ; లూఫా అమార; నిక్టాంతెస్ అర్బొర్టిస్టిస్; గర్భస్రావం;

**గర్భపతనం** - Abortion : కారికపాపయ.

**రక్తక్షీణత** - Anaemia : కలొట్రోఫిస్ జిగాంటియా.

నోటిపూత - Aphthae : ఒసిమం శాంక్టం.
స్వరం పోవుట - Aphonia; Hoarseness : సాలానంజాంతో కార్పస్.
ఆకలి ; ఆహార హితవు - Appetite; తగ్గిపోవుట : ఆండర్‌సోనియా, లూకాస్ ఎస్పెర; సాయు స్యూరియాలప్పా, టెర్మినాలియా చెబూల.
ఆకలి లేకపోవుట - Loss of appetite : సెఫలాండ్ర ఇండిక.
అమిత ఆకలిగల - Ravenous : అబ్రోమ ఆగస్ట, ఎటిస్ట ఇండిక, అజాడిరక్టా ఇండిక, యంబెలియ.
ఉదయం : ట్రిచొశాంతిస్ డియోయిక.
జ్వరం తరువాత : ట్రిచొశాంతిస్ డియోయిక.
భోజనం చేసిన తరువాత : యంబిలియార్తైబ్స్.
ఆహారంపై యిష్టంలేకుండుట ; అయిష్టత - Aversion : పికస్‌రిలిజియోస.
ద్రావకం : ఎటిస్ట ఇండిక; సీసాల్ పినియా బాండుసెల్లా.
పాలు : సారక ఇండిక.
పుగాకు : హైడ్రొకొటైల్ ఎసియాటిక.
మానసికంగ చేయుపని : సిసాల్ పినియా బాండుసెల్లా.
శారీరకంగ చేయుపని : సిసాల్ పినియా బాండుసెల్లా.
కురుపు - Abscess : అబ్రోమ ఆగస్ట.

## రోగిబాధలధికమగుట : ఉద్రేకం - AGGRAVATION.

మధ్యాహ్నం : అజాడిరక్టా ఇండిక ; ఎగిల్ మార్మలోస్.
చల్లని నీరు చేతులలో ఉంచిన : జట్రోఫ.
కాఫీ : కలోట్రోపిస్ జగాంటియా.
సంభోగము : జమ్బొమ సైల్వెస్ట్ర
ఉష్ణము : హైడ్రొకొటైల్, టెర్మినాలియా చెబూల.
ఋతుస్రావం ప్రవహించుట : సారక ఇండిక.
పాలు : కారికపాపయ.
ఉదయం : ఎకల్ఫ ఇండిక.
విరేచనాలు ; మలవిసర్జన : టెర్మినాలియా చెబూల.
రాత్రి : జస్టియా అడాటోడ.
శబ్దం : జస్టీసియా అడాటోడ.
బయటగాలి : అజాడిరక్టా ఇండిక.
ఒత్తిడి : టెర్మినాలియా చెబూల.
ఎడమ ప్రక్క : హైడ్రొకొటైల్ ఎసియాటిక.
ఎండ ; సూర్యుడు : టెర్మినాలియా చెబూల.

## ఉపశమనము; ఉపశాంతి - AMELIORATION

ఎత్తుక త్రిప్పబడగోరుట : ఒసిమం సాంక్టం.
కండ్లు మూసుకొనుట : టెర్మినాలియా చెబూల.
వడిశము ; చల్లని : ఆడర్సోనియా; ఆండ్రొగ్రాఫిస్ పానికులేట; టెర్మినాలియా చెబూల; సెఫలాండ్ర ఇండిక ; హైగ్రోఫిల స్పినోస.
చన్నీటి స్నానం : టెర్మినాలియా చెబూల.
తినుట : ఎగిల్‌మార్మిలోస్; జస్టీసియా అడాటోడ; టెర్మినాలియ చెబూల.

పాయంత్రం : టెర్మినాలియ చెబూల.
వేడి పానీయాలు త్రాగుట : స్వెర్టియా చిరాట;
బయటగాలి : సారక ఇండిక.
ఒత్తిడి; అదుముట : హైడ్రొకొటైల్ ఎసియాటిక.
విశ్రాంతి : టెర్మినాలియా చెబూల.
నిద్ర : టెర్మినాలియా చెబూల.
మూత్రంలో ఆల్బుమిన్ అధికంగా నుండుట - Albuminuria : అబ్రొమ అగస్ట.
ఋతుస్రావం అగుపడకపోవుట, లేక అణగారుట, ఆగిపోవుట : అబ్రొమ అగస్ట ; జనోసియా అశోక.
తలనొప్పితో : జనోసియా అశోక.
స్త్రీలకు కలుగు మానసిక నాడీమండల సంబంధమగు వ్యాధి - Hysteria : జనోసియా అశోక.
తెల్లబట్ట : జనోసియా అశోక.
యవ్వనం : జనోసియా అశోక.
ప్రేగుల అమత్వక్కును ఎమీబా పుండుచేయుటచే కలుగు రక్తం.
చీములతో కూడిన విరేచనాలు - Amoebiasis : ఎటిస్టా ఇండిక ; ఎటిస్టారాడిక్స్, పికస్ ఇండిక; హైడ్రొకొటైల్; సెఫలాండ్ర ఇండిక; గుండెప్రాంతంలో భారంగను నొక్కివేయుచున్నట్లుండుట.
పొర్లు పొర్లుగ వచ్చు గుండెనొప్పి - Anginapectoris : టెర్మినాలియ అర్జున.
గుదం, మలద్వారం - Anus : దురద ఉండుట : ఆండ్రొగ్రాపిస్ పానికులేట.
పుండు నొప్పిగ ఉండుట : జనోసియా అశోక.
జలోదరం, ఉదరకుహరానికి నీరు పట్టుట, గుండె, మూత్రపిండాలు, కాలేయ వ్యాధులతో సాధారణంగా ఇది కూడి ఉండును. - Ascites : బొరొవియా డిఫ్యూసా.
ఉబ్బసము ; శ్వాసకాసము - Asthma – అజాడిరక్టా ఇండిక, బ్లాట ఒరియంటాలిస్ బొరావియా డిఫ్యూసా; కాస్సియా సొఫేర; జస్టీసియా అడొటోడ; ల్యూకస్ ఎస్పెర; బసిమం శాంక్టం; సయుస్యాలప్పా; సొలానం జాంతోకార్పస్.
ఛాతీలో నొప్పి : అజాడిరక్ట ఇండిక.
పిల్లలలో : ఒసిమం సాంక్టం.
వెచ్చనిగది మూసివేసిన ఉద్రేకం చెందుట : జస్టీసియా అఢాటోడ.
సాయంత్రంవూట ఉద్రేకం చెందుట : కాస్సియా సొఫేర.
క్రిందపరుండిన ఉద్రేకం చెందుట : కాస్సియా సొఫేర.
అర్ధరాత్రి ఉద్రేకం చెందుట : కాస్సియా సొఫేర.
వర్షాకాల వాతావరణంలో ఉద్రేకం చెందుట : కాస్సియా సొఫేర.
శీతాకాలం చలికాలం ఉద్రేకం చెందుట : కాస్సియా సొఫేర.
వీపు, వెనుకవైపు, చెమటలు, పొక్కులు, వళ్ళుపేలుట ముఖ్యంగ కొన్ని రకాల జ్వరాలలో విస్తారంగా చెమటలు పట్టిన పిమ్మట ఇట్టి పొక్కులు ఉద్భవించును. - Back; Sudaminaon : అజాడిరక్టా ఇండిక.
మూత్రంలో రక్తం పోవునట్టి అపాయకరమగు తీవ్ర.
మలేరియా జ్వరం - Black Water fever : అసాయి.
మూత్రకోశం - Bladder - మెడ వేడిమి, ఎర్రదనం, నొప్పి, ఉబ్బుట అను లక్షణాలు గలవాపు, హైడ్రొకొటైల్.
రక్తపుపోటు - Blood Pressure : హెచ్చు : ఎగిల్‌పోలియా; బొరావియా డిఫ్యూస; రావాల్ఫియా సర్పెంటిన; ట్రిపొపెబ్.
పెగ్గడ్డలు వాచి చీముకారు కురుపులు - Boils - అతి మూత్రం, మధుమూత్రవ్యాధి; జెమ్నెమ సైల్వెస్టరు.

చర్మంపై కురుపులు, గడ్డలు - Boils on Skin : ఎచరాంతస్ ఎస్పెర.
రొమ్ము పడిశం, పేసవిలో - Bronchitis : అబ్రొమ అగస్ట, బ్లాట ఒరియాంటాలిస్; ఎగిల్ పోలియా, టెర్మినాలియా చెబూల; జొంటియాన చిరాట; కలోట్రోపిస్ జగాంటియా; జస్టిసియా అడాటోడ; మకరధ్వజ; ఒసిమం శాంక్టం; సొలానం జాంతోకార్పస్.
మంట, కాలుట - Burning : అచిరాంతస్ ఎస్పెర; బ్లూమేయ ఒడొరాట, జాంతోకార్పస్; సెపలాంద్ర; జెమ్నెమ సైల్వెస్టర్; హైడ్రొకొటైల్; సారక ఇండిక; ఎటిస్ట ఇండిక; అజాడిరక్టా ఇండిక.
చలి, జలుబు - Cold : సెపలాంద్ర; సిసాల్పిన బాండుసెల్లి.
జ్వరం - Fever : సెపలాంద్ర; స్వెర్టియా చిరాట.
మధ్యాహ్నం - Afternoon : ఎగిల్మార్మెలోస్.
సాయంత్రం - Evening : ఎగిల్మార్మెలోస్.
నవ్వతో - Itching with : సారక ఇండిక.
వాంతులతో ఉత్తేజనరచుట - Vomiting with urging for : ఆండర్ సోనియా.
పొత్తికడుపులో మంట - Abdomen Burning : ఎగిల్పోలియా ఇండిక, ఆండ్రోగ్రాఫిస్ పానికులేట, ఆండర్ సోనియా, ట్రిచొశాంతస్ డియోయిక.
ఉదయం 11 గంటలు : ట్రిచొశాంతస్ డియోయిక.
పొత్తికడుపు - Hypogastrium : హైడ్రొకొటైల్.
పొత్తికడుపు క్రింది భాగం - Lower abdomen : ఆండర్ సోనియా.
కాలేయము - Liver : ఆండర్ సోనియా; ఎటిస్ట ఇండిక.
ప్లీహము - Spleen : ఆండర్ సోనియా; ఎటిస్ట ఇండిక.
పురీషనాళం పెద్ద ప్రేగు చివరిభాగం మంట - Rectum Burning : అజాడిరక్ట ఇండిక, హైడ్రొకొటైల్, సారక ఇండిక.
గుదస్థానంలో మంట - Anus Burning : ట్రొచొశాంతస్ డియోయిక.
యోనిలో మంట - With in Vagina Burning : హైడ్రొకొటైల్.
లోతుగ శ్వాశించుట, నిట్టూర్పు - Breath Deep : టెర్మినాలియా చెబూల.
వేడి - Hot : సిసాల్ పినియా బాండుసెల్లా.
తక్కువగానుండుట - Short : హైడ్రొకొటైల్; జస్టిసియా అడాటోడ, కలొట్రొపిస్ జగెంటియా.
ఛాతీలో మంట - Chest Burning : ఎకలిప ఇండిక.
కాల నియమం లేకుండా గుండె కొట్టుకొనుట - Beat - irregular : హైడ్రొకొటైల్.
కాళ్ళు, చేతులు సన్నముల్లతో కుట్టుచున్నట్లు మంట - Burning Extremiteis : అజాడిరక్టా ఇండిక.
చేతులు మంట - Hands Burning : అజాడిరక్టా ఇండిక ; డెస్మొడియం జెగాంటికం.
పాదాలు, కాళ్ళు మంట - Burning Feet : డెస్మొడియం జెగాంటిక.
అరికాళ్ళు మంట - Burning Soles : అజాడిరక్టా ఇండిక.
పంజువ్యాధి - Beri - Beri : బొరావియాడిఫ్యూస.
కుక్కకాటు - Dog Bite : అచరాంతస్ ఎస్పెర.
తేలు కాటు - Scorpion Bite : ల్యూకాస్ ఎస్పెర.
పాము కాటు - Snake Bite : అచరాంతస్ ఎస్పెర; జెమ్నెమ సైల్వెస్టర్; ల్యూకస్ ఎస్పెర; కలొట్రొపిస్ జిగాంటియా.
విషపు జంతువులు - Venomous animals : బొరావియా డిఫ్యూస; ల్యూకాస్ ఎస్పెర.

శరీరంలో ఏర్పడు రాయివంటి పదార్థము, మూత్రాశయంలో రాళ్లవంటివి ఏర్పడుట - Calculus

హైగ్రొఫిలియా; సొలానం జాంతోకార్పస్; ఒసిమంగ్రాటిస్సిమం, సిండన్ డాక్టిలిన్.

# కేన్సరు, అర్బుదము ; పుట్టరణము - CANCER

**నోరు** - Buccal cavity : ఎటిస్ట ఇండిక, స్త్రీ గర్భకోశపు మెడ - Cervix Uteri : హైడ్రాకొటైల్.
**గొంతు** - Throat : ఎటిస్ట ఇండిక.
**రాచపుండు** - Carbuncle : ఇది సెగ్గడ్డకన్న పెద్దదిగ నుండి అనేక తూట్లుపడి చీము కారును : అబ్రోమ ఆగస్ట; అచరాంతస్ ఎస్పెర.
**అతిమూత్రం, మధుమూత్రం** - Diabetic : జిమ్నెమ సైల్వెస్టర్.
**పడిశము, జలుబు, అమత్వక్కువాపు** - Catarrh : జస్టిసియా అడాటోడ; ల్యాకాస్ ఎస్పెర; లూఫాబిండల్.
**దవుడ, చెంప** - Cheek : ఎర్రని మచ్చలు; అబ్రోమ అగస్ట.
**చిన్నపిల్లలు, శిశువులు** - Children : ఆయాసము - Asthma:
**జలుబు** - Catarrh : దగ్గు - Cough, జ్వరం - Fever : ఒసిమం శాంక్టం.
**మలబద్దం** - Constipation : ఒసిమం శాంక్టం; ఒసిమం గ్రాటిస్సిమం ; నిక్టాంతిస్ ; టెర్మినాలియా చెబూల, సారక ఇండిక.
**మూత్రం ప్రయత్నం లేకుండ, తెలియకుండగనే పోవుట** - Urine involuntary : ఒసిమం శాంక్టం.
**శ్లేష్మము ; అమ్లము** - Mucous in : ఒసిమం శాంక్టం.
**వాంతి, భేది, కలరా, విషూచి** - Cholera : అచరాంతస్ ఎస్పెర, భఅటిస్టారాడిక్స్, కలోట్రొపిస్, జిగెంటియా, లూఫ అమార, ట్రిచొశాంతస్ డియొయిక.
మూత్రపిండాలు, మూత్రకోశం వ్యాధిచే మూత్రోత్పత్తి అణగారుట లేక మూత్రవిసర్జన లేకపోవుట - Suppression Urine of in : కొల్యూస్, ఆరోమాటికస్; లూఫ అమార.
**మూత్రం బంధించుట** : Retention of urine : కొల్యూస్ ఆరోమాటికస్.
**శూల, ఉదరకుహరంలో కలుగు తీవ్రమగు నొప్పి** - Colic : ఎటిస్ట ఇండిక, ఎటిస్టరాడిక్స్, అజాడిరక్టా ఇండిక.
**కంటియొక్క మున్నితమగు అమత్వక్కు** - Conjunctiva : ఇది కనురెప్పల లోపలి భాగమును, కనుగ్రుడ్డు ముందు భాగమును కప్పి ఉండును. పాలిపోవుట, తెల్లనగుట - Paleness : అబ్రోమ అగస్ట.
**మలబద్దం** - Constipation : ఎగిల్‌పోలియా, జనోసియా అశోక, అజాడిరక్ట ఇండిక, ఆండ్రొగ్రాఫిస్ పానికులేట; మొమోర్డిక చరంటియా, టెర్మినాలియ చెబూల; జస్టిసియా అడాటోడు.
**పిల్లలు, శిశువులు** - Children in : నిక్టాంతస్; ఒసిమం గ్రాటిస్సియం.
**మొండి వ్యాధి** - Obstinate : జనోసియా అశోక; జస్టిసియా అడాటోడ.
**జలుబు పడిశం తుమ్ములుండుమ** - Coryza: అబ్రోమ అగస్ట, ఆండ్రొగాఫిస్ పానికులేట్, అజాడిరక్ట ఇండిక, జస్టిసియా అడాటోడ, ల్యాకస్ ఎస్పెర, ఒసిమం శాంక్టం; హైడ్రాకొటైల్; చిరాట ; సారక ఇండిక; లూఫా అమార.
**పొడి దగ్గు** - Dry Cough : బొరావియా డిప్యూస.
**నీరుకారుట** - Watery : అబ్రోమ అగస్ట, దగ్గు - cough : అబ్రోమ అగస్ట ; ఎకలిఫ ఇండిక; ఎగిల్ పోలియా ; అసాయి, అజాడిరక్టా ఇండిక; బ్లూమేయ ఒడొరాట, కాస్సియా సపేర, జస్టిసియా అడాటోడ; ల్యాకస్ ఎస్పెర, మకరధ్వజ, ఒసిమం శాంక్టం, సారిక ఇండిక.
**స్నానం చేసిన ఉద్రేకం చెందుట** - Bathing agg : అజాడిరక్టా ఇండిక.
**రక్తం వాంతి చేసికొనుట** - Blood vomiting : ఫికస్ రిలిజియోస, ఎకలిఫ ఇండిక.
**ఛాతీ నొప్పి** - Chest pain : అబ్రోమ అగస్ట ; ఎకలిఫ ఇండిక.
**దగ్గవవుడు ఛాతీలో ఒత్తినట్లు నొప్పి ఉండుట** - Chest Pain Presis During : అబ్రోమ అగస్ట.

చల్లనిగాలి ఉద్రేకం చెందుట- Cold air agg : అబ్రోమ ఆగస్ట.
మలబద్దం - Constipation : జస్టిసియా అడాటోడ.
పొడిగా ఉండుట - Dry : ఎకలిఫ ఇండిక, జస్టిసియా అడాటోడ.
ఆయాసం శ్వాస కష్టంగ ఉండుట — Dyspnoea with : జస్టిసియా అడాటోడ.
స్వరం బొంగురు పోవుట - Hoarseness, with : అజాడిరక్టా ఇండిక, బ్లూమేయ బడోరాట.
వాసన - Odo జస్టిసియ బడోటోడ, అబ్రోమ ఆగస్ట.
రాత్రి ఉద్రేకం చెందుట - Night agg : అబ్రోమ ఆగస్ట, జస్టిసియా అడాటోడ.
ఆకస్మికంగ, ఉధృతంగ కాలవ్యవధులలో కలుగునది - Paroxysmal : జస్టిసియా అడాటోడ.
తుమ్ములతో - Sneezing with : జస్టిసియా.
వాంతులతో - Vomiting with : జస్టిసియా.
గొంతులో గురగురమనుట - Wheezing , throat in : జస్టిసియా.
మనస్సును ఏకాగ్రచిత్త మొనర్పలేకపోవుట - Concentrate cannot : ఆండర్ సోనియా; ఒసిమం శాంక్టం.
ఒకదానిని మరియొక దానిగ భావించుట - Confusion : కలొట్రోపిస్ జిగెంటియా; జుగ్లాన్స్ రెజియా.
అడ్డుచెప్పుట, వ్యతిరేకత చెప్పుట - Contradiction – సహించలేకపోవుట - Unbearble : అబ్రోమ ఆగస్ట; ఆండర్ సోనియా.
మెదడు వెన్నుపాములను చుట్టి ఉండు పొరలవాపు, తీవ్రమగు తలనొప్పి సాధారణంగా తల వెనుకభాగం నుంచి, జ్వరం వణుకుతో మెడ వెనుక కండరాలు బిర్రబిగియును - Cerebro-spinal Meningitis : డెస్మోడియం జిగెంటికం.
చల్లదనం చలి - Coldness : స్వెర్టియ చిరాట; జట్రోఫ.
తలకు రక్తం అధికంగా కూడుట - Congestion : ఏగిల్ మార్మెలోస్; హైడ్రొకొటైల్, జస్టిసియ; ఒసిమం శాంక్టం; సారక ఇండిక.
చిన్నపిల్లల ముఖంమీద, తలమీద చిక్కని చీముతో కూడిన పొక్కులు కలిగి, అవి పగిలి తెల్లని పక్కుగట్టును. ఈ పొక్కులు గుంపులుగగాని, ఒకదానితో మరియొకటి కలిసిగాని ఉండి దురదగ నుండును - Crusta Lactea : జుగ్లాన్స్‌రెజియా.
కన్నులు మూసుకొనుట - Eyes close - inclination to - వాలుట : అబ్రోమ ఆగస్ట.
కండ్లకు రక్తం కూడుట - Eyes congestion : ఒసిమం శాంక్టం.
గొంతు మూసికొనిపోయినట్లుండుట - Throat close - sensation of as if throat would : మాంగిఫెర ఇండిక.
మల విరేచనాలు రంగు - Stool Color కొంత నల్లన - Blackish : అబ్రోమ ఆగస్ట : ఆండ్రొగ్రాఫిస్ పానికులేట.
విరేచనాలు కొంత గోధుమరంగు : అబ్రోమ ఆగస్ట.
విరేచనాలు నల్లగ : హైడ్రొకొటైల్ ఎసియాటిక.
విరేచనాలు కొంత ఆకుపచ్చని : సెఫలాండ్ర ఇండిక, ఒసిమం శాంక్టం; ట్రిచొశాంతస్ డియోయిక.
విరేచనాలు కొంత పసుపుపచ్చని : అచరాంతస్ ఎస్పెర; సాయిసాల్పినియా బాండుసెల్లా ; క్లెరోడెండ్రాన్ ఇన్ఫార్చునేట; ఒసిమంశాంక్టం, టెర్మినాలియా చెబూల; ట్రిచొశాంతిస్ డియోయిక.
చిన్న పిల్లలలో - in infants : ఆండ్రోగ్రాఫిస్ పానికులేట.
మూత్రకోశం వాపు తరుణ స్థితియందు పొత్తికడుపులో నొప్పి వుండి మూత్రకోశంలో తీవ్రబాధగ నుండును - Cystitis : కొల్యూస్ ఆరోమాటికస్.
సంభోగానంతరం నీరసించిపోయినట్లుండును - Coition - Exhaustism ofter : అబ్రోమ ఆగస్ట;

పికస్ ఇండిక.
**అసమర్థత, దౌర్బల్యం** - Inability : అబ్రొమ ఆగస్ట.
**కుతూహలంగాని, శ్రద్ధగాని లేకపోవుట** - indifference : హైడ్రోకొటైల్.
**క్షయ, రాజయక్ష, క్షీణింపచేయునది** - Consumption : జస్టిసియా అడాటోడ.
**వీపులో చల్లగాను చలి వుండునట్లుండుట** - Chill Back : కలోట్రోపిస్ జిగాంటియా.
**కాళ్ళు చేతులు చల్లగ ఉండుట** - Cold - Extremities : లూఫా అమార.
**చేతులు, పాదాలు** - Hands and feets : హైడ్రొకొటైల్ ఏసియాటిక.
**రక్తప్రసరణ తక్కువగ ఉండుట** - Circulation - poor : మాంగిపెర ఇండిక.
**కండరాలు బాధగ అప్రయత్నంగ దగ్గరకు ముడుచుకొనిపోవుట** - Cramp : జట్రోఫ.
**తలపై కేశాలున్న భాగం కలుగుచుండు** - Dandruff : నిక్టాంతెస్.
**చెవుడు, చెముడు** – Deafness : అబ్రొమ ఆగస్ట.
**నీరసము, బలహీనత** - Debility : అబ్రొమ ఆగస్ట; ఆండర్ సోనియా.
**కష్టంగా ఉండుట** - Difficult : అబ్రొమ ఆగస్ట.
**మింగినవుడు నొప్పిగ ఉండుట** - Deglutition - painful : అజాడిరక్టా ఇండిక; ఒసిమం శాంక్టం.
మాంసం, ఆహారం తీసుకొనిన ఉద్రేకం చెందుట - Meat agg : అజాడిరక్టా ఇండిక.
**నీరుత్రాగిన ఉద్రేకం చెందుట** - Water, agg : అజాడిరక్టా ఇండిక, మానసికంగా కృంగి వుండుట - Depression mental : అజాడిరక్టా ఇండిక; అబ్రొమ ఆగస్ట, సిసాల్ పినియా బాండుసెల్లా, కలొట్రొపిస్ జిగెంటియా.
**కోరికలు, వాంఛలు** - Desires : ఆమ్లములు : అబ్రొమ ఆగస్ట.
**పుల్లని** - Sour : జనోసియా.

అతిమూత్రం, మూత్రంలో చక్కెరలేనట్టి, అధికమూత్ర విసర్జన, మూత్రం నీటివలె నుండి సాంద్రత తక్కువగ నుండి దాహమధికంగా ఉండును. పిట్యూటరీ గ్రంధి దోషంచే ఇది కలుగుచున్నది – Diabetes Insipidus : అబ్రొమ ఆగస్ట, సెఫలాండ్ర.

మధుమూత్రం మూత్రంలో చక్కెర అధికంగా ఉండి మూత్రం సాంద్రత అధికంగ నుండును. శరీరంలో ఇన్సులిన్ తక్కువగుటచే ఈ వ్యాధి కలుగును. ఇందువలన రక్తంలోని చక్కెర అధికమగును. చక్కెర అధికంగా కరుగుటకు కావలసిన నీరు మూత్రపిండాల ద్వారా మూత్రంగ విసర్జించును. దాహం అధికంగా ఉండును. చివరకు మగత కలిగి మృతి చెందును - Diabetes mellitus : అబ్రొమ ఆగస్ట, సెఫలాండ్ర, జిమ్నెమ సైల్వెస్టర్, సిజిజియం జాంబోలినం.

**విరేచనాలు** - Diarrhoea : ఏకలిఫ ఇండిక, అచరాంతస్ ఎస్పెర, ఎగిల్‌పోలియా, ఎగిల్ మార్నెలోస్, అసాయి, ఎటిస్ట ఇండిక, ఎటిస్టరాడిక్స్, క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేటం, సిండం డాక్టిలాన్, యెంబిలియార్రైబ్సు, పికస్ ఇండిక; హెమిడెస్మస్ ఇండిక; లూఫ అమార; ఒసిమం శాంక్టం, ట్రిచొశాంతెస్ డియోయిక.

మలబద్ధం, విరేచనాలు, ఒకటి తరువాత ఒకటి కలుగుట - alternates with constipation : ఎగిల్ ఫోలియా.

దీర్ఘకాలికంగా ఉండు విరేచనాలు - Chronic Diarrhoea : సిండం, టెర్మినాలియ చెబూల.

జీర్ణకోశంలోగాని, ప్రేగులలో ఉండుగాలి, నోటి ద్వారా తేన్పులు, గుదం ద్వారా అపానవాయువుగ శబ్దంతో వెడలును - Flatus noisy with : ఏకలిఫ ఇండిక

నురుతోవచ్చుట - Forthy : క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేటం.

అమత్వక్కు గల భాగాల నుంచి స్రవించుద్రవం - Mucus in : అచరాంతెస్ ఎస్పెర, ఎటిస్టరాడిక్స్.

వికారం, వాంతి చేసుకొనగోరుట, తల తిరుగుట - Nausea and giddiness : అచరాంతస్ ఎస్పెర.
వికారం వాంతి చేసికొనగోరుట - Nausea with : క్లెరొడెండ్రాన్ ఇన్‌ఫార్చునేటం.
వర్షాకాలంలో వచ్చుట - Rain Season : ఒసిమం శాంక్టం.
విరేచనాలు విస్తారంగ కలుగుట - Profuse : లూఫ అమార.
కడుపునొప్పితో విరేచనాలు - Tenesmus with : ఎట్టిస్ట ఇండిక.
మూత్రం బంధించుట - Urine retention of : సిండం డాక్టిలైన్
మూత్రం అణగారుట - Urine suppression of : లూఫ అమార.
నీళ్ల విరేచనాలు - Watery అచరాంతెస్ ఎస్పెర ; లూఫ అమార.
ఆకస్మికంగా విరేచనాలు - Sudden జట్రోఫ
అమిత దాహంతో ఉండుట - Thirst excessive : అచరాంతెస్ ఎస్పెర : లూఫ అమార.
ఉబ్బుట, వాచుట - Distention : అబ్రొమ్మ అగస్ట, ఎకలిఫ ఇండిక, ఎగిల్‌ఫొలియో; అసాయి ; ఎటిస్ట ఇండిక ; అజాడిరక్ట ఇండిక; యెం బిలియా రిబ్బు ; హైడ్రొకొటైల్ ; ఆండ్రొగ్రాఫిస్ పానికులేట ; ఒసిమం శాంక్టం ; ట్రైపొపెబ్.
కుక్కకాటు - Dog Bite : ఆండ్రొగ్రాఫిస్ పానికులేట, ఒసిమం శాంక్టం, ట్రైపొపెబ్, అచరాంతెస్ ఎస్పెర.
వాటి నుంచి శరీర ధాతువులలోనికి సూక్ష్మజీవులు పోయి, వృద్ధిచెంది వ్యాధిని కలిగించుట, వ్యాధి సోకుట - Infection, from : బొరావియా డిఫ్యూస.
కలలు -Dreams : భయంకరమైన - Fearful : జనోసియా, సారక ఇండిక.
కలలు జగడములు ; కలహములు - Quarrels of : అజాడిరక్ట ఇండిక.
కలలు ప్రయాణం చేస్తూ ఉన్నట్లు - Travelling, జనోసియా.
కలలు కొట్టుతూ ఉన్నట్లు - Beating : అజాడిరిక్టా ఇండిక.
కలలు అతిగవచ్చుట - Excessive : హైడ్రొకొటైల్
ఉబ్బురోగం, నీరుపట్టుట -Dropsy : అచరాంతెస్ ఎస్పెర ; బొరావియా డిఫ్యూస.
ఉబ్బురోగం, చర్మం - Skin : ఎగిల్ మార్మెలోస్.
ఉబ్బురోగం జర్వంతో - with fever : ఎగిల్ మార్మెలోస్.
గ్రహిణి, రక్తవిరేచనాలు, చీములేక జిగట విరేచనాలు - Dysentry :ఎగిల్‌మార్మెలోస్, అచిరాంతెస్. ఎస్పెర; ఎగిల్‌ఫోలియా, ఎటిస్టరాడిక్స్; హోలరేన ఆంటిడిసెంట్రిక.
ఉదరం నొప్పితో ఉండుట - Abdomen pain with :ఎటెస్టారాడిక్స్' సెఫలాండ్ర
తరుణంలో - Acute హోలరేన ఆంటిడెసెంట్రిక .
వర్షాకాలం లోకలిగెడు - Autumnal :ఎటిస్టరాడిక్స్
గ్రహిణి రక్తంతో వచ్చుట- Blood with : అచరాంతెస్ ఎస్పెర; ఎగికమార్మెలోస్, ఎటిస్ట ఇండిక ; ఎటిస్టరాడిక్స్ బ్లూమియా బడోరాట, సెఫలాండ్ర; సిండన్; పికస్ రిలిజియోస ; పికస్ ఇండిక; ల్యూకాస్ ఎస్పెర.
గ్రహిణి ప్రకాశవంతమైన రక్తం వచ్చుట - Bright Red : పికస్‌రిలిజియోస.
గ్రహిణి దీర్ఘకాలికంగ వుండుట -Chronic : పికస్ ఇండిక ; హోలరేన ఆంటిడి సెంట్రిక; టెర్మినాలియా చెబూల.
గ్రహిణి శూలతో - Colic with : పికస్ ఇండిక ; హోలరేన.
గ్రహిణి కుడి ప్రక్క పరుండిన శూలతో ఉధృతమగును - Colic with lying right side agg.: హోలరేన ఆంటిడి సెంట్రిక
గ్రహిణి కడుపునొప్పితో - Tenesmus with ; సెఫలాండ్ర ఇండిక ; పికస్ ఇండిక.

గ్రహిణి వత్తిడి చేయుట, ఉత్తేజపరచుట- urging : పికస్ ఇండిక.
గ్రహిణి మూత్రం బంధించుట- Urine Retention in : సిండన్.
ఋతుస్రావం బాధతో నగుట ఋతుశూల- Dymenorrhoea అబ్రోమ ఆ గస్ట, అబ్రోమ రాడిక్స్ జనోసియా అశోక; పికస్ రిలిజియోస, ఆండ్రొగ్రాఫిస్ పానికులేట; మెనిస్పెర్మం, ఇసిమం శాంక్టం.
ఋతు స్రావం హిస్టీరియాతో- Hysteria with ; అబ్రోమ ఆగస్ట.
అజీర్ణం, అరోచకం- Dyspepsia కారికపాపయ; జెంటియాన చిరాట.
అధైర్యంతో, నిరాశ, విచారంగ ఉండుట, మానిసికంగ కృంగుట-Despondency : ట్రిచొశాంతెస్ డియోయిక : మెనిస్పెర్మం.
కదలిక ఇష్టం లేకుండుట-Disinclination-to move పికస్ రిలిజియోస.
మాట్లాడుటకు ఇష్టం లేకుండుట-Disinclination to talk : ఆండ్రోగ్రాఫిస్ పానికులేట ; జస్టిసియా ఆడాటోడ, ఒసిమం శాంక్టం.
జ్వరం తరువాత - after fever : సిసాల్ పినియా బాండుసెల్లా.
పనిచేయుట యిష్టం లేకుండుట- Disinclination to work ఆండ్రొగ్రాఫిస్ పానికులేట, సెఫలాండ్ర ఇండిక; సారక ఇండిక; స్వెర్టియాచిరాట,
మందబుద్ధి విచారకరంగ వుండుట - Dull Mind : ఆండర్ సోనియా ; ఆండ్రొ గ్రాఫిస్ పానికులేట; ఎటిస్ట ఇండిక; అజాడిరక్ట ఇండిక; సిసాల్ పినియా బాండుసెల్లా; జిమ్మెను సైల్వెస్టర్ ; జస్టీసియా అడాటోడ ; స్వెర్టియా చిరాట.
కనుపాపలు విపులీకరించుట- Pupils dilated mydriasis : ట్రిచొసాంతెస్ డియోయిక.
కన్నుల నుంచి అంటుకొను జిగట కారుట - Eysdischarge sticky ఒసిమం శాంక్టం.
కన్నుల నుంచి నీరు అధికంగా వుండుట, తడిగ నుండుట- Watery eyes ; ఒసిమం శాంక్టం.
కన్నుల వివర్ణమగుట, కన్నుల చుట్టు నీలి చారలుండుట- Discoloration-blue ring around : జస్టీసియా అడాటోడ.
కన్నుల నుండి ఎర్రగ నుండుట- Redness: ఆండ్రొగ్రాఫిస్ పానికులేట; అజాడిక్ట ఇండిక; ఒసిమం శాంక్టం.
కన్నుల కంటియొక్క సున్నితమగు అమత్వక్కు ఇదికనురెప్పల లోపలి భాగమును కనుగ్రుడ్డు ముందు భాగమును కప్పి వుండుట -Conjunctiva : సారక ఇండిక ; కారికపాపయ.
కంటి నుంచి పశుపుపచ్చ-Yellow : అబ్రోమ ఆగస్ట. ఆండ్రొగాఫిస్ పానికులేట, టినోస్పోరియా కార్డిపోలియా, ట్రిచొశాంతెస్ డియోయిక.
చెవుల నుంచి రసికారుట -. Discharge from ear : అబ్రోమ ఆగస్ట.
చెవుల దుర్వాసనగ నుండు- Offensive : ఒసిమం శాంక్టం.
చెవుల నుంచి చీము-Pus : ఒసిమం శాంక్టం.
చెవుల నుంచి నీరులాగ కారుట- Watery : ఒసిమం శాంక్టం.
ముక్కు నుంచి రక్తం కారుట- Discharge Blood from nose : ఎటిస్ట ఇండిక ; సిండన్ డాక్టిలాన్ ; పికస్రిలిజియోస ; హైడ్రొకొటైల్ ; ఒసిమం శాంక్టం, సారక ఇండిక.
ముక్కు నుంచి శ్లేష్మము-Mucous : జస్టిసియా అధాటోడ.
ముక్కునుంచి విస్తారంగా కారుట- Profuse : సారక ఇండిక.
ముక్కు నుంచి నీరులాగ కారుట- Watery : అబ్రోమ ఆగస్ట; ఆండ్రొగ్రాఫిస్ పానికులేట ; అజాడిరక్ట ఇండిక, ఒసిమం శాంక్టం ; సారక ఇండిక.
ముక్కు నుంచి తెల్లగ వచ్చుట–White : ఒసిమం శాంక్టం.

ముక్కునుంచి పశుపు పచ్చగ-Yellow : ఒసిమం శాంక్టం.

ముక్కునుంచి పొడిగ వుండుట- Dry : హోలరేన ఆంటిడి సెంట్రిక్, జస్టిసియా అడాటోడ.

ముక్కు రంధ్రాలు, రాపిడి, మర్ద చేసిన కొనగోరుట- Nostrils with Desire to rub : అబ్రొమ ఆగస్ట.

ముఖం ఎర్రగ వివర్ణమగుట - Face discoloration-red : ఒసిమం శాంక్టం.

చెంపలు దవుడరంగు మారుట- Discoloration-Cheeks : సారక ఇండిక.

పెదవులు రంగు మారుట - Discoloration lips : ఒసిమం శాంక్టం.

పశుపు రంగుగ మారుట - Discoloration Yellow : పికర్రిలిజియోస.

నోరు పొడిగ వుండుట- Mouth Dryness : అబ్రొమ ఆగస్ట. ఎటస్ట ఇండిక ; సెఫలాంద్ర హోలరేన ఆంటి డిసెంట్రిక, జస్టీసియా అడాటోడ, లూఫా అమార ; సారక ఇండిక ; సిజిజియం జాంబోలినం ; టెర్మినాలియా అర్జున.

పైదవుడ - Upper Jaw : టెర్మినాలియా చెబూల.

గొంతు ఎండిపోవుట- Throat dryness : అబ్రొమ ఆగస్ట ; ఆంద్రోగ్రాఫిస్ పానికులేట ; కలోట్రోపిస్ జిగాంటియా , సెఫలాంద్ర ఇండిక ; జస్టిసియా అడాటోడ ; ట్రిచోశాంతెస్ డియోయిక.

అన్న నాళం, అన్న వాహిక- Oesophagus : హైడ్రొకొటైల్ ఎసియాటిక.

కడుపు కోరికలు - Stomach desires : ఆంమ్లమునకు సంబంధించిన వస్తువులు - Acid things : సారిక ఇండిక.

చేదు వస్తువులు- Bitter thing : స్వెర్టియా చిరాట.

ఉడికిన బియ్యం - Boiled rice : సీపాల్ పినియా బాండుసెల్లా

వెన్న, నెయ్యి- Butter : స్వెర్టియా చిరాట.

చల్లని వస్తువులు- Cold thing : టెర్మినాలియా చెబూల.

ద్రవ పదార్థములు - Liquids : అబ్రొమ ఆగస్ట.

నిమ్మరసం- Lime juice : ఎటిస్ట ఇండిక.

మాంసము - Meat : సిపాల్ పెనియా బాండు సెల్లా , సెర్టియా చిరాట.

ఘన పదార్థాలు - Solids : సిసాల్ పెనియా బాండు సెల్లా.

పుల్లని వస్తువులు- Sour thing : సారక ఇండిక.

తీపు పదార్థాలు- Sweets : అబ్రొమ ఆగస్ట సారక ఇండిక.

సరిపడని ఆహార పదార్థాలు - Disagree thing that milk : కారిక పాపయ.

మాంసము, ఆహారము- Meat : కారికపాపయ.

పురుష జనేంద్రియ ప్రోస్టేటు గ్రంథి నుండి వచ్చెడి పల్చని స్రావం విసర్జించ Male sexual prostatorrhoea discharge : సారక ఇండిక

వీర్యము, శుక్లము- Semen : స్వెర్టియా చిరాట, టెర్మినాలియా అర్జున ; టినొస్పొరియా కార్డిపోలియా.

శుక్రవాహక నాళాలు లాగు చుండుట- Drawing Spermatic cords : హైడ్రొ కొటైల్ ఎసియాటిక, సారక ఇండిక.

స్త్రీ జనేంద్రియ కటిప్రదేశంలో ఈడ్చుచుండునట్లుండుట-Dragging -Pelvis; Female Sexual : గొషిపియం.

స్వర పేటికలుగల భాగం శ్వాసనాళపు ఊర్ధ్వభాగం ; శ్వాసనాళం (ఛాతీ) ఎండినట్లుండుట, పొడిగ వుండుట- Dryness. Larynx-Chest of wind pipe : హైడ్రొకొటైల్ ఎసియాటిక.

చర్మం అపరి శుభ్రంగ ఉండుట ; మురికిగ ఉండుట- Dirty-skin : సీసాల్ పెనియా బాండు సెల్లా.

చర్మం పొడిగ, ఎండినట్లుండుట- Dryness skin : అబ్రొమ అగస్ట ; సిసాల్ పెనియా బాండుసెల్లా.

నిద్ర అంతరాయం కలుగుట- Disturbed-sleep : అజాడిరక్ట ఇండిక ; యెంబిలియారిబ్సు ; సారక ఇండిక.

తరచుగ మూత్ర విసర్జనవలన నిద్రకు అంతరాయం-Due to frequent urination-Disturbed-sleep : అబ్రొమ అగస్ట.

చెవి వ్యాధులు- Ear : అసాయి, ఒసిమం శాంక్టం.

చెవి శబ్దం ఉండుట - Noise in : అబ్రొమ అగస్ట ; అజాడిరక్ట ఇండిక.

చెవి తేనెటీగల వలె శబ్దం వుండుట- Buzzing : అబ్రొమ అగస్ట.

చెవి విసర్జించుట- Discharge : అబ్రొమ అగస్ట.

చెవి ఎడతెగని శబ్దం ; గంటానాదం- Ringing in : అర్జున.

చెవి నొప్పి వుండుట- Pain in : అబ్రొమ అగస్ట.

చెవి ఊహించని పిశాచము- Phantiasis : కలోట్రొపిస్ జిగాంటియా ; హైడ్రొకొటైల్.

చిక్కిపోవుట, శుష్కించుట, ఎండిపోవుట - Emaciation : ఎకలిఫ ఇండిక; కలోట్రొఫిస్ జిగాంటియా; జిమ్నెమ సైల్వెస్టల్; సిజిజియం జాంబోలినం.

చిక్కిపోవుట గ్రహిణిలో - Dysentry in : హోలరేన ఆంటిడి సెంట్రిక.

మూత్రం అప్రయత్నంగ నగుచుండుట; ప్రక్కలో మూత్రం పోయుట- Enuresis : అబ్రొమ అగస్ట; బ్లూమియ బొడొరాట, ఒసిమం శాంక్టం ; సారక ఇండిక.

ముక్కునుంచి రక్తంకారుట - Epistaxis: సిండన్ ; పికస్ రలిజియోస; ఒసిమం శాంక్టం.

వికారము- Vausca : పికస్రిలిజియోస.

భోజనం చేయనట్లయితే అలసట- Exhaustion-Eating not if : అబ్రొమ అగస్ట.

రక్తంగల కళ్ళి, కఫము- Expectoration-Bloody ఎకలిప ఇండిక; పికస్రిలిజియోస; జస్టిసియా అడాటోడ; జస్టిసియారుబ్సు.

కఫం అతిగ వుండుట, కష్టంగ వుండును- Difficult to Raise : అజాడిరక్ట ఇండిక.

కఫం చీములాగ వుండుట - Puslike : బ్లూమియ ఒడోరాట.

కఫం తెల్లగ వుండుట- whitish : అబ్రొమ అగస్ట అజాడిరక్ట ఇండిక.

కఫం పశుపు పచ్చగ ఉండుట- Yellowish : అబ్రొమ అగస్ట; జస్టిసియా.

కాళ్ళు చేతులు- Extremities : చల్లగ వుండుట- Coldness : హైడ్రొకొటాల్.

కాళ్ళు చేతులు శుష్కించుట- Emaciation : అబ్రొమ అగస్ట.

కాళ్ళు చేతులు తిమ్మెర, తిమురు- Numbness : అజాడిరక్ట ఇండిక.

కాళ్ళు చేతులు తిమ్మెర, కుడిచేయి- Right hand అజాడిరక్ట ఇండిక.

కాళ్ళు చేతులు దీర్ఘకాలికంగ వుండునొప్పి- Pain; aching : అచరాంతెస్స్పెర; ఆండ్రొగ్రాఫిస్ పానికులేట.

కాళ్ళు చేతులు మంట - Burning : ఆండ్రోగ్రాఫిస్ పానికులేట; అజాడిరక్ట ఇండిక.

కుడిచేయి మంట - Right hand Burning : టెర్మినాలియా చెబూల.

ఉబ్బుట- Swelling : బొరివియా డిప్యూస ; హైడ్రొకొటైల్.

తెల్లపొలుసులతో నుండి పొడిగ నుండి ఎర్రని మచ్చలుగల చర్మం గరుకుగ నుండు దీర్ఘవ్యాధి సంబంధమగు చర్మవ్యాధి- Psoriasis : హైడ్రొక్రొటైల్.

కాళ్ళు- Lower : ట్రికొశాంతెస్.

కన్ను- Eye : ఆండ్రొగ్రాఫిస్ పానికులేట ; అజాడిరక్ట ఇండిక , కలొట్రొఫిస్ జిగెంటియా ; కలొ ట్రోఫిస్ లాక్యూటమ్, ఒసిమం శాంక్టం.

సులభంగ అలసినట్లుండుట- Tired easily : అబ్రోమ ఆగస్ట.
కాలేయ వ్యాధులతో- Hepatic disorder with : ట్రిచొశాంతెస్ డియోయికకు.
మనస్సు తేలికగ ఉద్రేకం నొందుట- Excitable Mind : అబ్రోమ ఆగస్ట.
తలకాళీగా ఉన్నట్లు వేదన చెందుట- Head emptyness -sensation of : అబ్రోమ ఆగస్ట.
ముఖంపై దద్దులు పొక్కులు నల్లని మచ్చలు- Face eruptions-comedones : జుగ్లాన్సు రెజియా.
ముఖంపై దురద మంటతో వున్నట్లు వేధించుట- itching with Burning sensation : అబ్రోమ ఆగస్ట.
ఛాతీపైన దద్దులు - Chest-Eruptions : హైడ్రోకొటైల్.
మొటిమలు- Pimples : హైడ్రోకొటైల్; జుగ్లాన్సురెజియా; సారక ఇండిక.
కడుపులో ఖాళీ, తరచుగ తినాలని కోరిక వుండుట- Stomach-emptiness-with frequent disire to eat : అబ్రోమ ఆగస్ట.
తేన్పులు, తేపులు- Eructation : ఎటిస్ట ఇండిక; కలోట్రోపిస్ జిగెంటియా; హైడ్రోకొటైల్; ఒసిమం శాంక్టం; సారక ఇండిక ట్రిచొశాంతెస్ డియోయిక.
తేన్పులు నీళ్ళు త్రాగిన తరువాత - Drinking water after ట్రిచొశాంతస్ డియోయిక.
తేన్పులు దుర్వాసన- Foetid : టెర్మినాలియా చెబూల.
తేన్పులు తరచుగ- Frequent : ఎటిస్ట ఇండిక.
భోజనం తరువాత- Meal After : ఎటిస్ట ఇండిక.
తేన్పులు ఉదయం - Morning : టెర్మినాలియ చెబూల.
కాలేయం- పెద్దగ వుండుట- Enlargement-liver : ఆండర్ సోనియా; ఆండ్రోగ్రాపిస్ పానికులేట; సిపాల్ పినియా బాండు సెల్లా, కారిక పాపయ; క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేట; ల్యూకాస్ ఎస్పెర; లూఫబిం డల్ , నిక్టాంతెస్ అర్బొట్రిస్టెస్; స్వెర్టియాచిరాట; టినోస్పోరియా కార్డిపోలియా, ట్రిచొశాంతెస్డియోయిక.
ప్లీహము- Spleen : ఆండర్ సోనియా; సిపాల్ పినియా బాండుసెల్లా; కారిక పాపయ; క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేటం, ల్యూకాస్, ఎస్పెర; లూఫ అమార; లూఫ బిండల్; నిక్టాంతెస్ అర్బొట్రిస్టిస్, స్వెర్టియాచిరాట; టినొస్పోరియాకార్డిపోలియా; ట్రిచొ శాంతెస్ డియోయిక.
శుక్రము అప్రయత్నంగ స్ఖలనమగుట-Emission : ఒసిమం కారియోఫైలాటం; స్వెర్టియాచిరాట, టెర్మినాలియా అర్జున; టినొస్పోరియా కార్డిపోలియా.
శుక్రము రాత్రిపూట కలలు వుండని లేకపోని- At night with or without-dreams : సారక ఇండిక.
పురుషులలో శిశ్నం, స్త్రీలలో క్లిటోరిస్, స్తనాలు నిక్కి ఉబ్బుట రాత్రి ఎలాంటి కారణం లేకనే Erection- at night without any cause : ఎటిస్ట ఇండిక.
చర్మం పై దద్దులు - Skin-Eruption : హైడ్రోకొటైల్ ; జగ్లాన్సురెజియా.
చర్మం పొడిగ వుండుట- Dry : హైడ్రోకొటైల్.
చర్మం దురద - itching : జుగ్లాన్సురెజియా.
చర్మం ఉధృతంగ- Violenty : సిజిజియం జాంబోలినం.
చర్మం పొంగు, వేపపువ్వు అనెడి చిన్న అమ్మవారు- Measles like : హైగ్రోఫిలిస్పినోస, జుగ్లాన్సురెజియా.
చర్మం ఆవగింజవంటి, మెడపైన వీపులో, ఛాతీపైన- Miliary, on neck, back and chest : హైడ్రోకొటైల్.

చర్మం దోమకాట్లులాగ వుండుట -Mosquito,bite like: సిసాల్ పినియాబాండు సెల్లా.
చర్మం ఎర్రని మొటాలు- Pimples Red: హైగ్రాఫిల స్పినోస; సిజిజియం జాంబోలినం.
చర్మం చిన్నవిగ వుండుట- Small : సిసాల్ సినియా బాండుసెల్లా : సిజిజియం జాంబోలినం.
చర్మం జ్వరంతో -With fever : హైగ్రాఫిల స్పినోస.
ఎముక, గోళ్ళు చర్మం మొదలగు మృతిచెందిన ధాతువులు పల్చని పొరలుగ నూడిపోవుట- Exfoliation :హ్రడా కొటైల్ ఎసియాటిక.
ఏనుగు కాలు, బోధ - Elephantiasis : కలోట్రోపిస్ జిగాంటియా, హై డ్రాకొటైల్.
**ముఖము-** Face : పాతరపు పొక్కులు చీము పొక్కులు - Acne : హైడ్రాకొటైల్.
ముఖము మంట - Burning : ఆండర్ సోనియా, కలోట్రోపిస్ జిగాంటియా.
ముఖము చల్లని నీరు - Cold water, amel : ఆండర్ సోనియా.
ముఖము దద్దులు, బొబ్బలు, దురద - Eruption, itching : అబ్రొమ ఆగస్ట.
ముఖము వేడి ఉష్ణము- Hot కలోట్రోపిస్ జిగెంటియా.
ముఖము శరీరం చల్లగ వుండుట- Body cold : కలోట్రోపిస్ జిగాంటియా.
ముఖము చూసెందుకు ముసలితంగ వుండుట-Old looking : అబ్రొమ ఆగస్ట.
ముఖము పాలిన, తెల్లబారిన, రంగుపోయిన - Pale : అబ్రొమ ఆగస్ట.
ముఖము మడతలుపడి వుండుట. - Wrinkled- అబ్రొమ ఆగస్ట.
జ్వరము- Fever: పైత్యము -Bilious- కలోట్రోపిస్ జగాంటియా, నిక్టాం తెస్, ఒల్డెంలాండియా.
జ్వరము ఎముకలు నొప్పితో- Bone pain with : ఒసిమం శాంక్టం.
జ్వరము ముందుగ మంట - Burning before : సిసాల్ పినియా బాండుసెల్లా.
జ్వరము పిల్లలలో- Children in : ఒసిమం శాంక్టం.
జ్వరము పడిశము దగ్గుతో- Cold cough with : ఒసిమం శాంక్టం.
జ్వరము చలి స్థితిలో - Chilliness with : డెస్మోడియం జాగెంటికం.
జ్వరము చలి లేకుండ - Chill with out : హైగ్రోపిలియా.
జ్వరం నిలకడలేని మారుచుండెడు - Changeable : సిసాల్ పినియా బాండు సెల్లా.
జ్వరము దీర్ఘకాలికంగ వుండు- Chronic : అజారిక్టా ఇండిక; సీపాల్ పినాయ బాండు సెల్లా ; సెఫలాండ్ర, క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేటం, జంటియాన చిరాట.
జ్వరము ఆకలి లేకపోవుట - appetite lost in : క్లెరొడెండ్రాన్ ఇన్‌పార్చునేటం.
జ్వరం ఎడతెగకుండ వుండుట- continued: ఎగిల్ పోలియా; ఆండ్రో గ్రాఫిస్ పానికులేట.
జ్వరం ఉబ్బుతో- Dropsy with : ఎగిల్‌పోలియా.
జ్వరం దద్దులతో - Eruption with : హైగ్రోపిలియా స్పినోస.
జ్వరం విడిచి విడిచి వచ్చుట - Intermittent : అజాడిరక్టా ఇండిక, ఎటిస్ట ఇండిక ; ల్యూకాస్ ఎస్పెర.
జ్వరం ఉదయం - Morning : హైగ్రోపిలియాస్పినోస ; ఉదయం 7 గంటలకు (7 A.M.) : డెస్మోండియం జాంజెటికం.
జ్వరం చలి మొదలగు వాటివలన వణుకు- Shivering with : హైడ్రాకొటైల్.
జ్వరం సాయంత్రం 4-30 గంటల నుంచి 7-30 గంటల వరకు : అజాడిరక్టా ఇండిక.
జ్వరం ప్రతి ఇతర దినాలలో వచ్చు- Every other day : ఎటిస్ట ఇండిక; బ్లూమియా బడొరాట.
జ్వరం కామెర్లతో- Jaundice with : అండ్రొగ్రాఫిస్ పానికులేట.

జ్వరం ఉష్ణ మండలాలలో కలుగు అపాయకరమగు అంటువ్యాధి, కాలేయము, ప్లీహము పెద్దవగును. జ్వరంతో రోగి ఎండి నల్లబడును. ఒంటికి నీరు పట్టును. ఇగుళ్ళు నుండి అంతర్గతావయవాల నుంచి రక్తం స్రవించును. Kala-azar : అసాయి, ట్రిచొశాంతెస్ డియోయిక.

జ్వరం చీము ఏర్పడుట- Pus formation due to : కల్ట్రోపిస్ జిగెంటియా.

జ్వరం నియమితకాల వ్యవధులలో హెచ్చుచు తగ్గుచుండును - Remittent: డెస్మోడియం జాంజిటికం ; నిక్టాంతెస్.

జ్వరం మెల్లగ- Slow : ఆండర్ సోనియా.

జ్వరం సవాయి సంబంధించిన వ్యాధి- Syphilitic affection : కల్ట్రోపిస్ జిగెంటియా.

జ్వరం సన్నిపాత జ్వరం - Typhoid : డెస్మోడియం జింజాటికం.

జ్వరం తరువాత బలహీనత, నీరసం-Weakness after : సిసాల్ పినియా బాండుసెల్లా.

జీర్ణకోశం, ప్రేగులు గాలితో ఉబ్బరించుట. ఇందువలన ప్రేగులలో గుడ గుడ శబ్దం కలుగును- Flatulence : అబ్రొమ ఆగస్ట, అజాడిరక్టా ఇండిక, సెఫలాంద్ర ఇండిక, హైడ్రొకొటైల్; జెంటియాన చిరాట; ఎటిస్ట ఇండిక; ఎటిస్ట రిలిజియోస; ఎగిల్ మార్మెలోస్.

జీర్ణకోశంలో గాని, ప్రేగులలో గాని వుండు గాలి. ఇది నోటిద్వారా తేన్పులుగను, గుదం ద్వారా అపానవాయువుగను వెడలును- Flatus : ఎగిల్ పోల్మియా ; హైగ్రొ ఫిలియా స్పినోస.

లలాటము, నుదురు- Fore head Red spots : అబ్రొమ ఆగస్ట.

మరుపు- Forgetfulness : అబ్రొమ ఆగస్ట; ఆండర్‌సోనియా; ఆండ్రొగ్రాపిస్ పానికులేట; ఒసిమం శాంక్టం, బ్రాహ్మి

మరుపు విధి నిర్వహణలో ఉపయోగపడునది- Duties, usual in : ఒసిమం శాంక్టం.

మరుపు మాట్లాడుటలో- Talking : ఒసిమం శాంక్టం.

మరుపు వ్రాతలో-in writing : అజాడిరక్టా ఇండిక.

మరుపు వర్ణ క్రమం పదాలు - in spelling words : ఎగిల్ మార్మెలోస్ ; ఆండర్ సోనియా, అజాడిరక్టా ఇండిక.

మరుపు కొన్ని తావులందు పొరపాట్లు దొర్లుట- Mistakes in places : ఆండర్ సోనియా.

మరుపు పరిచయస్తుల పేర్లు జ్ఞాపకముండక పోవుట - Name of familiar persons, cannot remember : అజాడిరక్టా ఇండిక.

తల గాలితోగాని నీటిపైగానీ తేలిపోవుట - Head floating : జుగ్లాన్సు రిజియా

ముఖం ఎర్రబడుట - Face flushed : ఎగిల్ మార్మెలోస్, ఆండర్ సోనియా; సీసాల్‌పినియా బాండుసెల్లా, డెస్మోడియం, జాంజిటికం; ఒసిమం శాంక్టం; సారక ఇండిక.

మూత్రం తరచుగా విసర్జించుట - Urine frequent discharge : సిజిజియం; సారక ఇండిక; అబ్రొమ ఆగస్ట; కల్ట్రోపిస్ జిగాంటియా; ఫికస్‌రిలిజియోస; జిమ్నెమసైల్వెస్టర్; హైడ్రొకొటైల్; ఒసిమం కారియోఫైలాటం.

మూత్రం మధ్యాహ్నం – Afternoon : అబ్రొమ ఆగస్ట.

మూత్రం రాత్రి Night : సారక ఇండిక; టెర్మినాలియా చెబూల

మూర్ఛ, నిస్త్రాణ, నిస్సత్తువ - Faintness : కల్ట్రోపిస్ జిగాంటియ.

"గాల్" త్రిత్తిలో ఏర్పడు రాళ్ళవంటివి; ఇవి తరచూ చాలా ఏర్పడుచుండును.

(Gall; Bile; పైత్యరసం); (Gall-Stones) : లూఫ బిండల్.

శరీర ధాతువులందలి భాగం మృతినొందుట (Gangrene) కల్ట్రోపిస్ జిగాంటియా, కంట్రోపిస్ లాక్టం.

మాంసగ్రంథి; కాయపెద్దదగుట, Glands-Enlargment : ఆండర్ సోనియా లేక అమూర రోహితక్.

గనోరియా : సెగవ్యాధి - Gonorrhoea: ఆండర్సోనియా, కొల్యూస్ ఆరోమాటికస్, పికస్ ఇండిక, హైడ్రొకొటైల్, ఒసిమం కారియోపైల్లాటం, ఒసిమం గ్రాటిస్సిమం, టినొస్పోర్ కార్డిఫోలియా.
మూత్రం విసర్జించు సమయంలో మంట - Micturition; Burning During : పికస్ ఇండిక, ఒసిమం కారియోఫెలాటం, ఒసిమం గ్రాటిస్సిమం, టినొస్పోర కార్డిపోలియా.

కీళ్ళవాయువు, గౌటు; దీర్ఘవ్యాధి - Gout : డెస్మోడియం జాంగెటికం, గైనోకార్డియా ఒడోరాట; హెమిడెస్మస్ ఇండిక, సయుస్సూరియాలప్పా.
ఇగుళ్ళ నుంచి రక్తం కారుట - Bleeding from gums; జనోసియా అశోక.
కనుగుడ్డులోని బింకమధికమగునట్టి తీవ్ర అపాయకరమగు కంటివ్యాధి. ఇందువల్ల అంధత్వం కలుగుచున్నది. ఇది తరుణవ్యాధిగ ఉన్నప్పుడు నొప్పి తీవ్రంగా వుండును. కన్ను ఎర్రగా నుండి చూపు అలుకకుపోవును. ప్రక్కలకు చూడలేరు. Tonometer : అనెడి పనిముట్టుచే దీనిని కనిపెట్టవచ్చును. Glaucoma :
దంతములు నములుట - Grinding of : అరెక - Betel Nut Teeth : ఎంబిలియారైబ్సు; వెర్నొనియా ఆంతెల్ మింటిక.
జీర్ణకోశం నుంచి రక్తం వాంతియగుట - Haemalemesis : నిండన్డాక్టిలాన్; పికస్ రిలిజియోస.
మూత్రకోశం నుంచి కలుగు రక్తస్రావం, మూత్రంలో రక్తముండుట - Haematuria : అసాయి, సిండన్, పికస్రిలిజియోస; పికస్ ఇండిక, ఒసిమం కరియోపైలాటం.
ఊపిరితిత్తుల నుంచి (దగ్గునపుడు) రక్తం వచ్చుట, రక్తంగాని, రక్తజీరగల కళ్ళినిగాని ఉమ్ముట - Haemoptysis : ఎకలిఫ ఇండిక, పికస్ ఇండిక, పికస్ రిలిజియోస, జస్టిషియరుబ్రం.
ఊపిరి మధ్యాహ్నం - Afternoon : ఎకలిఫ ఇండిక.
ఊపిరి రక్తం ప్రకాశవంతంగా ఉండుట - Blood, Bright Red : ఎకలిఫ ఇండిక; పికస్ రిలిజియోస, పికస్ ఇండిక.
ఊపిరి ఉదయం - Morning : ఎకలిఫ ఇండిక.
ఊపిరి రాత్రి - Night : ఎకలిఫ ఇండిక.
రక్తస్రావం - Haemorrhage : ఎకలిఫ ఇండిక; బ్లూమియా బడొరాట, పికస్ రిలిజియోస; పికస్ ఇండిక.
రక్తస్రావం ప్రసవం తరువాత - Child Birth after : మెనిస్పెర్మం; ఒసిమం శాంక్టం.
మూలశంక; మూలవ్యాధి - Haemorrhoids : జనొస అశోక, పికస్ ఇండిక; పికస్ రిలిజియోస; కెలిఫ ఇండిక, లూఫ బిండల్; సారక ఇండిక.
మూలశంక దురద - Itching : జనోస అశోక.
మూలశంక నొప్పి బాధగ నుండుట - Painful : జనోస అశోక.
తల చల్లగ నుండుట - head coldness : జెంటియానచిరాట.
తల ఖాళీగా ఉన్నట్లు భావించుట - head empty feeling : ఆండ్రొగ్రాఫిస్ పానికులేట, జస్టిసియా అడొటోడ, అబ్రొమ ఆగస్ట; సారక ఇండిక.
తల బరువు, భారంగా ఉండుట - Head Heaviness : అబ్రొమ ఆగస్ట.

## తలనొప్పి (HEAD PAIN) ఎగిల్పోలియా

తలనొప్పి మధ్యాహ్నం - Afternoon : సాయంత్రం 4 గంటల నుంచి 8 గంటల వరకు : ఎగిల్పోలియా.
తలనొప్పి బయటగాలిలో - Air-open : జనోస అశోక.
తలనొప్పి వెనుకవైపు - Back of : అబ్రొమ ఆగస్ట.
తలనొప్పి బద్దలగునట్లుండుట - Bursting : బొరావియా డిప్ఫ్యూస.

తలనొప్పి కుడిభాగం - Right side : బొరావియా డిప్యూస.
తలనొప్పి జ్వరానికి ముందు - Fever before : సిసాల్ పినియా బాండుసెల్లా.
తలనొప్పి అదిమిన తగ్గుట - Pressure amel : సిసాల్‌పినియా బాండుసెల్లా; ఒసిమం శాంక్టం.
తలనొప్పి కపాలం తాకినట్లుండిన - Scalp sensitive to touch : అజాడిరక్టా ఇండిక.
తలనొప్పి వడదెబ్బ - Sunstroke, from : సెఫలాండ్ర.
తలనొప్పి కుడిభాగం ధనారింపుగ కొట్టుకొనుట - Throbbing right side: అజాడిరక్టా ఇండిక.
తలనొప్పి కదులుట వలనగాని, విరేచనాలవలనగాని ఉద్రేకం చెందుట - Motion agg : అజాడిరక్టా ఇండిక.
తలనొప్పి అస్థిమితము, ఆందోళన – Uneasiness : అబ్రొమ అగస్ట.
తలనొప్పి ఒకవైపు మాత్రమే - Unilateral : జనోస అశోక.
తలనొప్పి ఋతుస్రావం కలిగిన తగ్గుట - Menses amel : జనోస అశోక.
ఉష్ణము, వేడిమి - Heat; పైభాగం - Upper part : సిజిజియం జాంబోలనం.
గుండె వ్యాధులు - Heart Diseases : అబ్రొమ అగస్ట, అర్జున; అసాయి.
వైద్యుని కంటికిగాని ప్రయోగశాలలో పరీక్షల వలనగాని తెలియని వ్యాధి - Functional Diseases : అర్జున.
అవయవ నిర్మాణమందు (ధాతువులో) మార్పులను కలిగించిన వ్యాధి - Organic disease అర్జున.
గుండెలో నొప్పి - Heart pain in : అర్జున.
రోగికి తెలియునట్లు గుండె వడిగా, బలంగా కొట్టుకొనుట - Palpitation : అర్జున.
ఆహారనాళంలో కడుపులో మంట పులితేన్పులతో అజీర్ణం, ఛాతీ అడుగుభాగంలో మంటగ ఉండును - Heart Burn : అజాడిరక్టా ఇండిక, ఎటిష్ట ఇండిక.
ఎక్కిళ్ళు, హిక్క - Hiccough : సయుస్యూరియాలప్పా; ఒసిమం శాంక్టం.
స్వరం బొంగురుపోవుట - Hoarsensess : అజాడిరక్టా ఇండిక; బ్లూమియా బడోరోట, ఒసిమం శాంక్టం, సోలనం జాంతోకార్పస్.
స్వరం దగ్గువలన - Cough in : అజాడిరక్టా ఇండిక; బ్లూమియా బడొరాట, సోలనం జాంతోకార్పెన్.
ఆకలి - Hunger : అబ్రొమ అగస్ట.
ఆకలి అస్వాభావికమగు - Unnatural : అబ్రొమ అగస్ట.
ఆకలి శోషిల్లునట్లుండుట - Faint feeling with : అబ్రొమ అగస్ట.
ఆకలి నీరసం, బలహీనత - Weakness : అబ్రొమ అగస్ట.
మనస్సుకు ఆశతో నిండియుండుట - Hopeful-mind : జమ్నెమసైల్వెస్టర్
సాయంత్రం ఉష్ణం ఉండుట - Evening Heat : ఎగిల్‌మార్మెలోస్
నుదుట, నొసట ఉష్ణము - Forehead heat : జస్టిషియా అడాటోడ
నడినెత్తిన ఉష్ణం - Vertex Heat : ఆండర్ సోనియా, ఎగిల్‌మార్మెలోస్, బొరావియా డిప్యూస, పికన్‌రిలిజియోస, ఒసిమం శాంక్టం.
వినికిడి క్షీణించుట (మందగించుట) - Impaired hearing : అబ్రొమ అగస్ట, ఒసిమం శాంక్టం.
వినికిడి క్షీణించు తరుణంలో - Acute : ఎటిష్ట ఇండిక.
ముక్కులో ఉష్ణం - Nose-Heat : స్విర్టియాచిరాట.
నోటిలో ఇగుళ్ళు గట్టిపడుట - Mouth-hard-gums : టెర్మినాలియా చెబూల.
ఉదరం భారంగా వుండుట - Abdomen Heaviness : ఒసిమం శాంక్టం
పురుమునకు వృషణములుండెడి తిత్తి. ఇది గజ్జల మధ్య వ్రేలాడుచుండును - Hanging-scrotum : హైడ్రాకొటైల్ ఏసియాటిక.

